*Telugu Classics — Popular Edition Series*

# శ్రీమత్



# ఆంధ్ర మహాభారతము

( అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహా
ప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు )

తిక్కన ప్రణీతము

పరిష్కర్త :

మహాకవి, సరస్వతీ పుత్ర

పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ హైదరాబాదు - 500004.

Telugu Classics—Popular Edition Series

# శ్రీమత్
# ఆంధ్ర మహాభారతము

( అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల
మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు )

తిక్కన ప్రణీతము


పరిష్కర్త :
పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ – హైదరాబాదు – 500004.

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథ సముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈలోటును తీర్చి ప్రాచీనగ్రంథ సంచయము విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమీ ఒక ప్రణాళిక సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన ; రెండవది మహాభారతము ప్రచురణ ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతిగ్రంథములో గ్రంథ కర్తనుగూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్తగ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్ర-మహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే భారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్ర మహాభారత సంపుటములలో తుదిదైన యీ సంపుటమును పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన మహాకవి సరస్వతీ పుత్ర, పద్మశ్రీ శ్రీ పుట్టపర్తి నారాయణచార్యులుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథ సంపుటాల వ్రాతప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమీ పక్షాన కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
1-5-74

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి



# విషయసూచిక

అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము

పుట

విషయము


| | |
|---|---|
| శోకమగ్నుండగు ధర్మజునిఁ గృష్ణాదులు ప్రబోధించుట | 1 |
| వేదవ్యాసమునీంద్రుఁడు ధర్మజునకు మరుత్తుని చరితంబు చెప్పుట | 6 |
| మరుత్తుఁడు సంవర్తునిఁ దన యజ్ఞంబున కుపద్రష్టగా వరియించుట | 10 |
| సంవర్తుఁడు మరుత్తునియజ్ఞంబున కుపద్రష్ట యగుట | 13 |
| అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట | 15 |
| మరుత్తుని యజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట | 21 |
| శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు చేయుట | 23 |
| వ్యాస నారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట | 28 |
| ధర్మజుఁడు ధరణిఁ బాలించునపుడు కృష్ణార్జునుల వర్తించువిధము | 29 |
| శ్రీకృష్ణుఁ డర్జునునకు దత్త్వజ్ఞానస్థిరీకరణము చేయుట | 32 |
| శ్లేష్మాదిరోగ వికారంబుల నిరూపించుట | 34 |
| తత్త్వజ్ఞాన విశేషప్రవర్తనము | 39 |


అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము


| | |
|---|---|
| బ్రాహ్మణగీతలు | 47 |
| అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట | 49 |
| ఇంద్రియ మనః పరస్పర సంవాదప్రకారము | 52 |
| జీవాత్మ స్వరూప నిరూపణప్రకారము | 57 |
| జనకునకు విప్రరూపధరుండైన యమునితో నైన సంవాదము | 63 |
| గురుశిష్య సంవాదంబు కృష్ణుం డర్జునున కెఱింగించుట | 66 |
| మనోబుద్ధ్యహంకారాది తత్త్వప్రకారము | 72 |
| అవ్యక్తనామతత్త్వ నిరూపణప్రకారము | 77 |
| సత్త్వం బపశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట | 83 |


అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము


| | |
|---|---|
| తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁడడుగుట | 91 |
| కృష్ణార్జును లింద్రప్రస్థమువనుండి హస్తిపురంబునకు వచ్చుట | 93 |

| విషయము | పుట |
|---|---|


| విషయము | పుట |
|---|---|
| శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకు బోవుట | 96 |
| శ్రీకృష్ణుఁ డుదంకునకుఁ దన విశ్వరూపంబుఁ జూపుట | 98 |
| జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకునిచరితంబు చెప్పుట | 102 |
| ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట | 107 |
| ఉదంకుండు కుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱుచుట | 111 |
| వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట | 115 |
| వ్యాసుఁడు హిమవత్పర్వంబున నున్న పాండవులకడకు వచ్చుట | 118 |
| శ్రీకృష్ణుండు సకలబంధుసహితుండై కరినగరంబునకు వచ్చుట | 120 |
| పరీక్షిత్ప్రాణదానంబుకై కుంతీసుభద్రలు కృష్ణుం బ్రార్థించుట | 122 |
| కృష్ణుండు మృతజాతుండైన పరీక్షితు లబ్ధజీవితుం జేయుట | 126 |
| వ్యాసుఁడు కృష్ణసహితులై యున్న పాండవులయొద్దకు వచ్చుట | 129 |
| ధర్మజుం డర్జును యజ్ఞాశ్వ రక్షణంబునకు నియోగించుట | 132 |
| **అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము** | |
| ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిఁ దిరుగ విడుచుట | 135 |
| అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధంబు చేయుట | 136 |
| అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు చేయుట | 141 |
| బభ్రువాహనుం డర్జునితో యుద్ధంబు చేయుట | 145 |
| అర్జునుఁడు బభ్రువాహనునిశరంబుచేతఁ బుడమిం ద్రెళ్లుట | 146 |
| ఉలూపి సంజీవనిమణిచేత నర్జును బ్రతికించుట | 149 |
| ఉలూపి యర్జునునితో వసువుల కోపప్రసాదంబుల నెఱింగించుట | 151 |
| అర్జునుఁడు జరాసంధపౌత్రుని యుద్ధంబుచేసి యోడించుట | 154 |
| అర్జునుఁడు గాంధారదేశాధీశుని యుద్ధంబు చేసి జయించుట | 157 |
| కృష్ణుఁడు ధర్మజునితో నర్జునుసందేశంబు చెప్పుట | 162 |
| అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకు వచ్చుట | 164 |
| ధర్మరా జశ్వమేధయాగంబు సుప్రయోగంబుగాఁ జేయుట | 167 |
| ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దన రాజ్యంబంతయు నిచ్చుట | 170 |
| ధర్మజుఁడు యజ్ఞంబునకు వచ్చిన రాజులనెల్ల సత్కరించి పంపుట | 173 |
| సక్తుప్రస్థ చరిత్రంబు బ్రాహ్మణులకుం జెప్పుట | 175 |
| యముఁడు సక్తుప్రస్థునికడ కతిథియై వచ్చుట | 176 |
| యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకంబునకుఁ బో నియోగించుట | 179 |
| సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకమునకుఁ బోవుట | 180 |
| అగస్త్యమహాముని ద్వాదశవార్షిక యజ్ఞప్రభావము | 183 |
| జమదగ్నిమహాముని పితృదేవతల శాపంబున నకులంబై పుట్టిన కథ | 185 |

## ఆశ్రమవాసపర్వము - ప్రథమాశ్వాసము


| విషయము | పుట |
|---|---|
| యుధిష్ఠిరాదులను గాంధారీ ధృతరాష్ట్రులును నొండొరులయెడ నడచికొనిన ప్రవర్తనము | 189 |
| ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దన మనోరథంబు తెలుపుట | 193 |
| వ్యాసుఁడు ధృతరాష్ట్రు వనవాసంబున కనుజ్ఞ యిచ్చుట | 198 |
| ధృతరాష్ట్రుడు ధర్మజునకు రాజనీతి విశేషంబులు చెప్పుట | 201 |
| ధృతరాష్ట్రుండు ధర్మరాజునకు శత్రురాజుల జయించు తెఱంగు చెప్పుట | 205 |
| ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచేత ననుజ్ఞ గొనుట | 207 |
| ధృతరాష్ట్రునితో శంబు వను విప్రుఁడు పౌరజనసమ్మతి చెప్పుట | 210 |
| భీముఁడర్జునునితో ధృతరాష్ట్రు నుద్యోగంబునకుఁ బ్రతికూలించిచెప్పుట | 214 |
| ధృతరాష్ట్రుఁడు గాంధారీ సహితుండై వనంబునకుం బోవుట | 218 |
| ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవలదని ప్రార్థించుట | 221 |
| ధృతరాష్ట్రుఁడు శతయూపరాజర్షి యాశ్రమంబున వసియించుట | 226 |


## ఆశ్రమవాసపర్వము - ద్వితీయాశ్వాసము


| విషయము | పుట |
|---|---|
| ధృతరాష్ట్రునిపాలికినారదుండు మునులతోవచ్చియత్తపోవనమహిమచెప్పుట | 229 |
| నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రుడు సుగతిఁ బొందెడు తెఱంగు చెప్పుట | 231 |
| పాండవులు బంధుసహితంబుగా ధృతరాష్ట్రుఁ జూడఁ బోవుట | 324 |
| పాండవులు కురుక్షేత్రంబునను న్న ధృతరాష్ట్రు గాంధారీకుంతులదర్శించుట | 236 |
| విదురుఁడు యోగమార్గంబున ధర్మరాజునందుఁ గలయుట | 242 |
| వేదవ్యాసుఁడు పాండవసహితుండైన ధృతరాష్ట్రు నాశ్రమంబునకువచ్చుట | 244 |
| కుంతి వేదవ్యాసునితోఁ గర్ణుఁడు తనకు జన్మించిన తెఱఁగెఱింగించుట | 249 |
| వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతుల రావించి | 254 |
| ధృతరాష్ట్రుఁడు భాగీరథీ తీరంబునుండి నిజాశ్రమంబు ప్రవేశించుట | 256 |
| నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణంబు చెప్పుట | 260 |
| ధర్మరాజు ధృతరాష్ట్ర ప్రభృతులు మృతులగుటకు శోకించుట | 264 |
| యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదకప్రదానంబు చేయుట | 265 |


## మౌసలపర్వము


| విషయము | పుట |
|---|---|
| ధర్మరాజు రాజ్యంబున నుత్పాతంబులు తోఁచుట | 269 |
| మునిశాపంబున సాంబునికడుపున ముసలంబు పుట్టుట | 272 |
| ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట | 273 |
| యాదవు లందఱుఁ గృష్ణసహితులై సముద్రతీరమునకుఁ బోవుట | 275 |
| సాత్యకికృతవర్మలకు రోషజనకంబుగాఁ గలిగిన సంవాదము | 278 |
| మద్యపానమత్తుఁడైన సాత్యకి కృతవర్మ తల నఱకుట | 279 |

| విషయము | పుట |
|---|---|
| యాదవులెల్ల మడసినపిదపఁ గృష్ణుఁ డర్జునుం దోడ్తేర దారుకుం బంపుట | 282 |
| బలరాముఁడు శరీరంబు విడచి యనంతునియందుఁ గలయుట | 285 |
| శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట | 287 |
| దారుకుఁడు పాండవులకు సకలయాదవక్షయంబు చెప్పుట | 289 |
| అర్జునుఁడు సకలస్వజనక్షయ దుఃఖితుండగు వసుదేవునిం గాంచుట | 291 |
| వసుదేవుఁ డర్జునునకు యాదవనాశంబు తెఱం గెఱింగించుట | 292 |
| వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట | 298 |
| అర్జునుఁడు రామకృష్ణుల వెదకుచు వనంబునకుఁ బోవుట | 301 |
| అర్జునుఁడు రామకృష్ణుల కళేబరంబులు చూచి వలవించుట | 303 |
| అర్జునుఁడు రామకృష్ణులకు నగ్ని సంస్కారంబు చేయుట | 304 |
| ద్వారకానగరంబు సముద్రమున మునింగి పోవుట | 306 |
| బోయలర్జును నోర్చి యాదవాంగనల సొమ్ముల నపహరించుట | 307 |
| అర్జునుఁడు రామకృష్ణుల నిర్యాణంబును యాదవస్త్రీల కెఱింగించుట | 310 |
| రుక్మిణీదేవి మొదలగు కృష్ణభార్య లగ్నిప్రవేశంబు చేయుట | 311 |
| అర్జునుఁడు వేదవ్యాసు నొద్దకుఁ బోయి యాదవక్షయంబు చెప్పుట | 312 |
| వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము చేయుట | 314 |
| మహాప్రస్థానిక పర్వము | |
| అగ్నిదేవుఁ డర్జునుచేతి గాండీవంబు సముద్రంబున వైపించుట | 322 |
| ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట | 323 |
| ఇంద్రుఁడు రథంబుఁగొని ధర్మరాజు నెదురుకొనుట | 326 |
| ధర్మరాజ సురరాజులకుఁ గుర్కుర విషయముగా జరిగిన వివాదము | 327 |
| సారమేయరూపంబున వచ్చిన ధర్ముఁడు ధర్మరాజునకుఁ బ్రత్యక్షం బగుట | 329 |
| స్వర్గారోహణపర్వము | |
| ధర్మజుఁడు దుర్యోధనుఁ జూచి యసూయాపరుండైన నారదుఁ డతనిం దేర్చుట | 334 |
| ధర్మజుఁడు దేవమునులను గర్ణాదిస్వజనులఁ జూప వేఁడుకొనుట | 335 |
| ధర్మరాజు నరకమున నున్న యన్నదమ్ముల నెఱింగి పరితపించుట | 338 |
| ఇంద్రుఁడు నరకంబుకడ నున్న ధర్మరాజునొద్దకు వచ్చి యతని సంభావించుట | 339 |
| యముఁడు ధర్మరాజు నుచితవచనంబుల సంభావించుట | 343 |
| ధర్మజుఁ డాకాశగంగావగాహంబుఁ జేసి దేవభావంబు నొందుట | 344 |
| ఇంద్రుండు ధర్మజునకు దేవత్వంబు నొందిన స్వజనంబులఁ జూపిచెప్పుట | 345 |
| ఫలశ్రుతి | 352 |




# పీఠిక

తిక్కనామాత్యుఁడు భారతము వ్రాయుట తెలుఁగువారి యదృష్టము! అతని మనస్తత్త్వమునకు, సర్వ రీతుల సరిపోయిన దీరచన. భారతమున కచ్చొత్తినట్లుండిన చిత్తవృత్తి యతనిది. తిక్కన్న భాగవతమును, పోతనామాత్యుఁడు భారతమును రచియించియున్నచో—నవి యెట్లుండెడివో చెప్పలేము. భారతము వ్రాయునాటికి అమాత్యుఁడు యజ్ఞముచేసి సోమయాజియైనాఁడు. "నాసాగ్ర విహార రసికుఁడు"-ను, "నాదామృత ధారాసార రూపుఁడు"ను అయిన హరిహరనాథుని కైవసమొనర్చికొన్నాఁడు. ఇవి, యాతఁడాంతరికముగ సంపాదించుకున్న యోగ్యతలు. బాహ్యముగ 'బుధారాధన విరాజితుఁ'డయ్యెను. "ఉభయ కవిమిత్రు"డైనాడు. అతనికి తెనుఁగు పలుకుబడులపై ప్రీతి. దానికప్పుడు వెన్నుబలము లేదు. కన్నడమునుండి, తమిళమునుండి, యనేక శబ్దములను-మట్టసముగా తలలుమార్చి - "తెలగు"-లు చేసికొన్నాడు. ఆనాటికి వాడుకలోనున్న ప్రతి తెనుఁగు పదమును మెలకువతో గ్రహించినాఁడు. దానిని వితసేయక - ప్రయోగ స్వాతంత్ర్య మలవఱచికొని - యవసరములలో వాడికొన్నాఁడు. ఒకరీతిగా తిక్కన తెలుగు భాషను సంస్కరించి - గొప్పస్వరూపమిచ్చినవాఁడని చెప్పవచ్చును. నన్నయవలెనే యితఁడును - శబ్దశాసనుఁడు. అతనివలె నీతఁడు వ్యాకరణము వ్రాయలేదంతే. బ్రహ్మాండమైన నిష్ఠాశీలి. నిష్ఠ కుదరని వాడంతపని చేయలేఁడు. శ్రీనాథాదులకా యదృష్టము లేదు. పాదరసము వలెఁ బారాడు బ్రతుకు. అందుచే వారు - ఏకధారగా - తిక్కనవలె పని చేయలేక పోయినారు. వారి రచనలు - అందదుకులుగా నుండిపోయినవి. పూర్వకవులు చాలమందిలో - "వీరి చదువులెక్కువ. వారి చదువులు తక్కువ" అని వితర్కించుట మన యవివేకము. వారు ప్రతిభాశాలురు గాకపోవచ్చును, గాని యవ్యుత్పన్నులుగారు. ఒకటి - రెండు శాస్త్రములు వెన్నుబలముగా నుండెడివి. బహుగ్రంథ ద్రష్టలు, లోకజ్ఞులు, నాఁడును—నేటివలెనే స్పర్థలు, అసూయలు, సత్యప్రతారణములు కొల్లలు కాని యవి తాత్కాలికములు. కాలములో విలువలేనివి. అది యట్లుండె కాఁగా - మన మిప్పుడు - పెద్దన్న చదువెక్కువా - రామకృష్ణుని చదువెక్కువా యని - కూర్చున్నచో - నెవరు

తేల్చువారు? పెద్దన్నగారి మనుచరిత్ర తనే దీసికొందము. అతని శైలినిబట్టి వారి యభిమాన కవులను మన మూహింపవలెను. వ్యుత్పత్తిలోని లోతు నంచనా వేయవలెను: హృదయంగమసిక్యమును గమనింపవలెను. పైగా - వారిలో సంయమన మెక్కువ. వచ్చిన చమత్కృతియు నొక మనుచరిత్రలోనే యెట్లు సూపగలరు? ప్రతి కవియు నింతే శ్రీనాథాదులుకూడ నింతే తిక్కన్నలో నీ సంయమనము మరియు నెక్కువ. జీవితములో, రచనలో; కాని - యతఁడు దాని మితినెఱిగిన వాఁడు. మొండి సంయమనముగాదు విశృంఖలతయుగాదు. "మాలకరి పుష్పములు గోయు మాడ్కి" జీవితము ననుభవించెను. వలదని త్రోసిపుచ్చికొనలేదు "బొగ్గులకువోలె మొదలంట బొడుపను లేదు." అతని మనస్తత్వమున కన్నిరీతుల సరిపోయినది విరాటము. అది హృదయాహ్లాది. ఊర్జితకథోపేతము. నానారసాభ్యుదయోల్లాసి అందుకే యాతఁడు దానినట్లు నడిపినాఁడు. అనాగరకుఁడైన కీచకుని నాగరకుఁ డనిపించెను. వారి దుర్వ్యవసాయమునకుఁ గారణమైన సుదేష్ణపైఁ గూడ మనకు సానుభూతియే గలుగును. మఱల నాతని సమగ్ర స్వరూపము మనకు గనిపించునది - ఉద్యోగ - శాంతి పర్వములలో, తక్కిన భాగములలో - హిడింబ వధ - అభిమన్యు సంహారము- దుశ్శాసన వధ - కర్ణ సంహారము - దుర్యోధనుని చావు - మొదలైనవి. మనకు గింగవెత్తు లెత్తించును. ఈ ఘట్టములలో తిక్కన్న కలమునకు మూపులు మూఁడైనవి సంభాషణలను - అమాత్యులవలె నడపఁ గలుగువాఁడు - సంస్కృత మందైననెంతమందియున్నారో చెప్పుట గష్టము. యుద్ధపంచకములో చాల భాగ మస్త్రముల చిట్టా. వాని నాతఁడెంతో మెలకువతో తీర్చిదిద్దెను వింతలైన నవ్వులు, వివిధములైన కోపములు - బలే-యనిపించు సంభాషణా చాకచక్యము. భారతములో నానుశాసనికము మొదలు - చాలబల్హీనమైన పదార్థము. తిక్కన్న చిత్తవృత్తికి - చాకచక్యమునకు - కల్పనాశక్తికి - సరిపోవు సందర్భములు చాల తక్కువ అయిన నేమి? వానిలోఁ గూడ నీతఁడు తిక్కనామాత్యుఁడు గాకపోలేదు. గంభీరములైన యాధ్యాత్మిక చర్చల నాతఁడు - కమ్మని తెనుంగుబాసలోనే "జన సంప్రార్థ్యములు"గా వివరించెను. సంస్కృతములో వ్యాసుడు, విశ్వరూపము; గుణమునుబట్టియు - సంపత్తినిబట్టియు వారి రచన. "వ్యాసో నారాయణో హరిః" - అంతే వారి రచనాశక్తి - విజ్ఞానసాగరము - భారత భాగవతములలో - సమగ్రకముగా నిక్షిప్తమైనదని చెప్పవచ్చును. వేదము లొకవైపు - భారతము నొకవైపు పెట్టి చూచినచో భారతమే బరువయ్యెనట!

అది యాఖ్యానవరిష్ఠము. విశిష్టపద పర్వము. "వేదైశ్చతుర్భిస్సహితా" - అని, వ్యాసుడే యన్నాఁడు. ఈ పురాణం పూర్ణచంద్రునిచేత "శృతి జ్యోత్స్నలు"- ప్రకాశించినవట ! భారత సూర్యుఁడు లేకున్నచోఁ బ్రపంచమంతయుఁ జీకటి యగును. ఇది సర్వకవి ముఖ్యుల కుపజీవ్యము. దీనిలో లేని కథ లేదు. నల చరిత్రమునకుఁ గొందరు పాశ్చాత్య పండితులు మరులు వోయిరి. భారతము విన్నచో - మఱి వినదగినవి లేవనుచున్నాఁడు వ్యాసుఁడు.

అంతమాత్రమె గాదు ఇది యర్థ శాస్త్రము-కాదు కామశాస్త్రమట? ధర్మశాస్త్రము, కామశాస్త్ర మెఱుఁగవలెనన్నను - భారతము జదువవలెను. ఇంతేనా ! వ్యాసభగవానుఁడు భారతమును గూర్చి చేసిన కైవారములు చాల గలవు. కొన్ని యీ క్రిందివి:

శ్లో॥ ఇతిహాస ప్రదీపేన మోహావరణ ఘాతినా
లోకగర్భ గృహం కృత్స్నం యథావ త్సంప్రకాశితం॥

శ్లో॥ నవనీతం యథా దధ్నః, ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకంచ వేదేభ్య, శ్చౌషధిభ్యోఽ మృతం యథా॥

శ్లో॥ హ్రదానాముద ధిశ్శ్రేష్ఠో. గౌర్వరిష్ఠా చతుష్పదాం
యద్వై తానీతిహాసానాం, తథాభారతముచ్యతే॥

శ్లో॥ అనాశ్రిత్యేదమాఖ్యానం కథాభువి నవిద్యతే
ఆహార మన పాశ్రిత్య శరీరస్యేవ ధారణం॥

శ్లో॥ యోవిద్యాచ్చతురోవేదాన్ సాంగోపనిషదో ద్విజః
నచాఖ్యాన మిదం విద్వాన్, నైవ సస్స్యాద్విచక్షణః॥

భారత భాగవతములు వ్యాసభగవానుని యుచ్ఛ్వాస నిశ్వాసములు. చంద్రసూర్యనాడులు. చాలమంది - వ్యాసునితోఁ దిక్కన్ననుఁ బోల్చి వెర్రి వెర్రి విమర్శలు చేయుదురు. వ్యాసుని స్వరూపము ముందుఁ బ్రపంచమంతయు పిపీలిక. తిక్కనామాత్యుఁడు - వ్యాసునకుఁ దనశక్తి కొలఁది సేవ చెల్లించెను. ఆ విద్వ త్సంస్తవనీయ భవ్యకవితావేశి" యొక్క జ్ఞానసాగరమునందోపిక కొలఁది మునుకలు వేసెను. అందినన్ని రత్నములు దెచ్చెను. కాని యా మునుకలు - మరే తెలుఁగువాఁడును వేయలేనంత గొప్పవి. దాక్షిణాత్యభాష

లలోఁ దిక్కన భారతమువంటిది మరిలేదు. ఉత్తర భాషలలోఁగూడ లేదు. భారత భాగవతములు చేతఁబట్టికొని-తెలుఁగువాఁ డెవ్వరియెదుట నైనను-ధైర్యముగ నిలబడవచ్చును. ఈ భాగములయందుఁ గూడఁ దిక్కన-వ్యాసుని, — సముచితముగనే సేవించినాఁడు. అక్కడక్కడ వంకలు. దిద్ద యత్నించెను. వర్ణలేపములు గమనించెను.

వ్యాసభారతమొక యుత్తాలమగు ప్రవాహము. దానిని శరత్కాల ప్రవాహముగా మార్చుటకు యత్నించినవాఁడు తిక్కన్న. ఆయత్నించుటలో- వింత వింతవింతలగు నందములు చిత్రములైన కొలఁకులు ద్రవ్వెను మలుపులు ద్రిప్పెను. కొన్నిచోట్ల నీరు తగ్గించెను. 'అయ్యో! యిక్కడ మరి కొంతజలమున్న బాగుండెడిదిగదా!' యనిపించుటలో నన్యాయములేదు. అతఁడు చేసినపని సర్వోత్కృష్టమైనది. కాని - యింత మాత్రముతో-వ్యాసులనెత్తిపైఁ జేతులు పెట్టబూనుట యేటిపసి? యుద్ధము ముగిసినది. భీష్మునివంటి వాఁడు దెలచెను. ధర్మరాజుమనస్సు శాంతింపలేదు. మరల "నుమ్మలికంబున నొవ్వగులు నల్లము;" లోచన ములగ్రమ్మిన యశ్రువారి. కృష్ణుఁడుచితవచనములఁ బ్రబోధించినాఁడు. కాని-శాంతి స్వప్నలబ్ధధనమైనది అందియునందదు. ధర్మరాజు- "ధూమంబు వొదివిన యనల"మయ్యెను ఈ "పంకమైన తలపెట్లు"మార్చుట! దీనిచే - ధర్మరాజుని కర్మానుష్ఠానము గూడ - నిర్మలముగా నడపఁబడుటలేదు. అది "యాఁటతాఁట"లగుచున్నది కృష్ణుఁడు—"ధర్మరాజా! నీ యంతశ్శత్రువుల జయింపు"- యని, యొక యితిహాసము జెప్పెను. అది వృత్రకథ. "భీష్మాది యుద్ధతంత్ర మారయంగ [illegible] "యని — పిండితార్థము. అది మిథ్యా యుద్ధము. సత్యయుద్ధము వేఱు. "మమ"—యను రెండక్షరములు మృత్యువు. "నమమ"యనునదే బ్రహ్మము ఈ రెంటికిని— నిరంతర యుద్ధము ఆ ఐదు భూతములచేతఁగానఁబడదు. ఈ సందర్భమున—కృష్ణుఁడు — గొన్నిమాటలు చెప్పెను అవి యీ క్రిందివి

శ్లో॥ అథవా వసతః పార్థ! వనే వన్యేన జీవతః
మమతా యస్య ద్రవ్యేషు మృత్యోరాస్యే స వర్తతే॥

శ్లో॥ బాహ్యాంతరాణాం శత్రూణాం స్వభావం పశ్య! భారత!
యన్న పశ్యతి తద్భూతం ముచ్యతే స మహాభయాత్॥

పై శ్లోకములను—మట్టసములైన మాకందముల వంటి కందములలోఁ దిక్కన దెనిగించెను ఆతని కందము లందమైనవి

కం॥ వనమున, వన్యాహారం
బున వర్తించిన పదార్థములపై మమతన్
మనమున విడకుండిన, న
మ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా! ॥

కం॥ వెలి పగఱగెలుపు గెలుపే?
యలఘుమతిన్ గెలువవలయు, నభ్యంతరశ
త్రుల, దద్విజయము మోక్షము
నలవరుపంజాలు, నొంట నమ్మేలగునే ॥

పై పద్యము "యన్నపశ్యతి తద్భూతం" — అనుదానికి చక్కని వ్యాఖ్యానము

కం॥ విను! మంతశ్శ్రుతులలో
ఘనుఁడగు గాముఁడు, నిరస్తకామంబగు వ
ర్తనము విరల. మధ్యయనము
జనదానంబులును గామ సహితములు గదా! ॥

ఈ సందర్భములో—నింకను మూడు శ్లోకములున్నవి. వాని యర్థము నంతయుఁ గంద పద్యపాదములో నిమిడ్చివేసినాఁడు బాగున్నదనుకొందము. ఈ పట్టున—"కామగీత"లు—కృష్ణుఁడుట్టంకించెను అవి యీ రేడు శ్లోకములు. వ్యాసుని కూర్పు-యెంతో ముచ్చటగా యున్నది అర్థ పుష్కలమైయున్నది అవి యీ క్రిందివి.

1. అత్ర గాథాః కామగీతాః కీర్తయంతి పురావిదః
శృణు సంకీర్త్యమానాస్తా అఖిలేన యుధిష్ఠిర ! ॥

2. నాఽహం శక్యోఽనుపాయేన హంతుంభూతేన కేనచిత్
యోమాం ప్రయతతే హంతుం జ్ఞాత్వా ప్రహరణే బలం
తస్య తస్మిన్ ప్రహరణే పునః ప్రాదుర్భవామ్యహం ॥

3. యోమాం ప్రయతతే హంతుం యజ్ఞైర్వివిధదక్షిణైః
జంగమేష్వివ ధర్మాత్మా పునః ప్రాదుర్భవామ్యహం ॥

4. యోమాం ప్రయతతే నిత్యం వేదైర్వేదాంతసాధనైః
స్థావరేష్వివ భూతాత్మా తస్య ప్రాదుర్భవామ్యహం ॥

5. యోమాం ప్రయతతే హంతుం ధృత్యా సత్యపరాక్రమః
భావో భవామి తస్యాహం సచమాం నావ బుధ్యతే ॥

6. యోమాం ప్రయతతే హంతుం తపసా సంశ్రితవ్రతః
తతస్త పసి తస్యాథ పునః ప్రాదుర్భవామ్యహం ॥

7. యోమాం ప్రయతతే హంతుం మోక్షమాస్థాయ పండితః
తస్యమోక్షరతి స్థస్య నృత్యామిచ హసామిచ ॥
అవధ్యః సర్వభూతానా మహమేకః సనాతనః

8. తస్మాత్త్వమపి తంకామం యజ్ఞైర్వివిధ దక్షిణైః
ధర్మేకురు మహారాజ ! తత్రతే స భవిష్యతి ॥

పై శ్లోకములకుఁ దిక్కనామాత్యుఁ డొనర్చిన తెనుఁగుసేత యిది—

కం. అన పాయుండగు న్వేవం
డను-నను బాధింపఁజాలఁడు ప్రయత్నమునా
ధన మగునె ? వేద వేద్యుం
డయిన పరఁగుచున్న నా యెడను విహతికినై ॥

కం. ధృతి నెవ్వఁడు నన్నుం బ్రవి
హతుఁ జేయఁగఁ జూచు భావమగుదు నతనికే
నతఁడది యెఱుఁగఁడుగాన, వి
హతి బొంకై పోవఁగా జయము లేకుండున్ ॥

కం. ననుఁదపమునఁ బ్రహరించెద
నని, యెవ్వఁడు దొడఁగు నతనికాతపముఫలం
బున దెసఁగోరికనై, యే
జనియింతుం జెఱపఁగా వశమె యెవ్వరికిన్ ॥

కం. ననుమోక్షమూది చెఱచెద
నని, యెవ్వఁడు దలఁచు వానియందే మోక్షా
ర్థనమై యునికినవధ్యుఁడ
సనాతనుఁడఁ బ్రోవ నొకఁడు జాలఁడునన్నున్ ॥

వ్యాసరచనములోని వాడిమి - తెనుఁగు దనములోని పోడిమి, మీ కర్థమగును, గంభీరార్థములను తెనుఁగు మెల్మితోఁ బొందించుటలోఁ దిక్కన దక్షుఁడు, కాని_యీ సందర్భమున నొండు రెంటిని - అమాత్యుఁడు వదలెను, వానినిఁ గూడ - తెనుఁగులో పోతబోసియున్నచో బాగుండెడివని మన కనిపించుటలో న్యాయములేదు, మరి - వ్యాస మనస్తత్త్వవేదులలో నగ్రగణ్యుఁడైన తిక్కనామాత్యుఁడు - వానినెందుకు వదలెనోయేమో :, "తిక్కన కంటె సమర్థముగా నీవు వ్రాయగలవా"— అని మీరడుగవచ్చును. ఇది యావేశముతో వేయు ప్రశ్న. దీనికి సమాధానము చెప్పకుండుటయే యుచితము, తిక్కన్న లలితమైన తెనుఁగుతోను - మహాగంభీరమైన సంస్కృతమును సవాలుచేసిన ఘట్టములును లేకపోలేదు, వ్యాసభగవానుని యీ క్రింది శ్లోకము జూడుఁడు—

శ్లో॥ యథాప్సుకోష్ణే ప్రక్షిప్యభాండం భాండమనా భవేత్
తథా స్వకాయే ప్రక్షిప్య మనోద్వారైరనిశ్చలైః
ఆత్మానం తత్ర మార్గేత ప్రమాదం పరివర్జయేత్ ॥

పైశ్లోకమునకుఁ దిక్కన తెలుఁగు సేత యిది—

ఆ॥ పెఁకడవ పెన్కు పసులలో డించిన
యాతఁడెట్లు దాని నరసి కొనుచు
నుండు, నట్లు లోన నుసిచిన మనసు నే
మఱక, యాత్మ వెదకు తెఱఁగు మేలు ॥

వ్యాసుని శ్లోకమున కేమాత్రము తీసిపోవని పద్యమిది, "ప్రీతాత్మా"— అను శబ్దమునకు - "తెలిసంచిన మనంబు"— అను తెలుఁగుసేత - యెంతయో ముచ్చటైనది. అట్లే - వ్యాసుని యీ క్రింది శ్లోకము.

శ్లో॥ సర్వే క్షయాంతా నిచయాః పతనాంతాః సముచ్ఛ్రయాః
సంయోగాశ్చ వియోగాంతా మరణాంతంచ జీవితం ॥

తిక్కన తెనుఁగుసేత—

తే॥ పొదలుఁదఱుఁగుటకై, పొదపొదవుబడుట
కై, కదనుజేరుఁ, బాయుటకై, జనించు
బొలియుటకు నై సుఖంబును బొందు, దుఃఖ
మందుటకునై పదార్థములఖిలములును ॥

"యది పాపమపాపంవా"– అన్న వ్యాసునకు "పాపమయ్యో గాకుండె"– అని–
తెనుఁగుఁదనమిచ్చిన తిక్కనామాత్యుని రచనాశక్తికి మనమాశ్చర్యపడుదుము,
వ్యాసుని యీ క్రింది శ్లోకములు–

శ్లో॥ ఆత్మవత్ సర్వభూతేషు యశ్చరేన్నియతశ్శుచిః
అమానీ నిరభిమానః సర్వతోముక్త ఏవ సః ॥

శ్లో॥ జీవితం మరణం చోభే సుఖదుఃఖేతథైవచ
లాభాలాభే ప్రియద్వేషే యస్సమః సచముచ్యతే ॥

శ్లో॥ నకస్యచిత్ స్పృహయతే నావజానాతి కించన
నిర్ద్వంద్వో వీతరాగాత్మా సర్వథా ముక్త ఏవ సః ॥

శ్లో॥ అనమిత్రశ్చ నిర్బంధు రనపత్యశ్చయః క్వచిత్
త్యక్త ధర్మార్థకామశ్చ నిరాకాంక్షీచ ముచ్యతే॥

శ్లో॥ నైవధర్మీన చాధర్మీ పూర్వోపచిత హాయకః
ధాతుక్షయ ప్రశాంతాత్మా నిర్ద్వంద్వస్సవిముచ్యతే॥

పై యైదు శ్లోకములకును క్రింది సీసపద్యము పరివర్తనము

సీ. ఒలయు లాభాలాభములుఁ బ్రియద్వేషంబు
లును, సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని, కానపాటును–నవ
జ్ఞతయు నెందునులేక సర్వధర్మ
తంత్రలోలుండును ధర్మశీలుండుగా
డెవ్వఁడు, గూర్చువారౌవ్వకుంతు
వారని తనకు నెవ్వరును గల్గక ప్రివ
ర్గేచ్ఛ యెవ్వనిచేత నీడవిడువఁ

తే॥ బడు, నకర్మ భావంబుఁ దాపత్రయాప
గమము వైరాగ్య సుస్థిరత్వమునుగల్గ
నరయనెవ్వని యందేని నతఁడు, నతఁడు
నతఁడును, నతఁడును, గందురవ్యయపదంబు॥

పైదానిలోని క్రమాలంకారమెంత సామర్థ్యముతో నిర్వహింపఁబడినదో— కవితా శిల్పులు గ్రహింపఁగలరు. ఆతని భారతరచన—అనాలోచితముగా-వ్రాసి కొనిపోవుటగాదు. ఎన్నియోసారులు భారతమును మననజేసి — దిద్ది తీర్చిన శిల్పము. ఈ క్రింది శిల్పము మఱియొకటి—

సీ॥ వల్లభుఁడొక్క సద్వ్రతముఁ బూనినదాను
తద్వ్రతమూని గాంధారియతని
పోయినగతిఁ బోయె, నాయమకైయంత
వగవఁ బుత్రుల రాజ్యవైభవంబు
విడిచి, మేయోమక యడవికిఁ బోయిన
తల్లికి వగచెద ధర్మసుతుఁడు
భీమసేనుండును బీభత్సుఁడును దన
కడుపునఁ బుట్టిన కొడుకులట్టె!

తే॥ యెగ్గతంబునఁ దానుఁగారగ్గిఁ గాలె
నటె! యనాథయై దీనికి నంతరంగ
మలఁదురక-తల్లడిల్లక యారటమున
నుడుక కలమట బడక యెట్లుండుఁ జెపుమ॥

పై పాదములలోఁ గుంతీ దేవినిగూర్చి—తాను దుఃఖించుటకు గల కారణములు చెప్పినాఁడు. తేట గీతియందు నాలుగుక్రియాపదములు. వరుసగా వేసినాఁడు. క్రమముగా నన్వయించుకొనవలె. ఆతని దృష్టిలోఁ బద్యమునుగట్టుట యాదేశముగాదు. శబ్దజాలముగాదు. మరి-నిలుకడగా దిద్దితీర్చిన శిల్పము. వ్యాసభగవానుని.

శ్లో॥ యథాలోహస్య నిష్యందో నిషిక్తో బింబవిగ్రహం
ఉపైతి తద్విజానీహి గర్భే జీవప్రవేశనం॥

అనుశ్లోకమున కనువాదముండియున్నచో బాగుండెడిది. ఎందుకో తిక్కనామాత్యుఁడు విడిచిపెట్టినాఁడు. వీనిలోఁగూడఁ దిక్కన మూఁడుదాహరణములు విడిచినాఁడు. అమాత్యుల కీపర్వములు వ్రాయునాటికిఁ గొంత విసుగయ్యేనేమో! వయస్సుపైకొన్నదేమో! రాజ్యములోని యలజడులు మనస్సును గలఁచినవేమో చెప్పలేము.

వ్యాసుఁడనవసరముగా విపులీకరించినాఁడని తోచినచోటఁ దిక్కన సంకు చించుటయుఁగద్దు, ధృతరాష్ట్రుఁడు ధర్మరాజు నూరార్చుటకుఁ బూసుకొన్నాఁడు. ఈ సందర్భములో - మూలమున సుమారు పది శ్లోకముల వరకున్నవి. వీనిలోఁ గొన్ని సందర్భశుద్ధి లేనివిగాఁదోచునవి. మరికొన్ని యనవసరమైన విపులీకరణము. ఈ శ్లోకములనన్నింటిని-తిక్కన-యీ క్రింది పద్యముతోఁదేల్చి వేసినాఁడు.

సీ॥ క్షత్రధర్మంబున గైకొంటి మేదిని
యుమ్మలికింపక లెమ్ము! వత్స!
యనుజవర్గము నీవు ననుభవింపుము, శోక
కాలంబుగాదిది యేఁపగవ
నసిపల్క—విదురహితాలాపములు, దన
వినకుండుటయు సుయోధనునికీడు
నద్దుష్టబుద్ధిఁదాననుసరింపఁగ ధర్మ
మెడలిన కతమున నింతపుట్టె

ఆ॥ ననియుఁ, దెలియనాడి, తనకు గాంధారికి
వగలు మిగుల బొగుల వలయుటయును
నగ్గడించి, మమ్ము నొంటిపగ్గులగనుం
గొనుము!, ఎంత దీర్పుమనియె నధిప! ॥

ఈ సందర్భములో

శ్లో॥ శోచితవ్యం మయాచైవ గాంధార్యాచమహీపతే।
యయోః పుత్రశతం నష్టం స్వప్నలబ్ధం యథాధనం॥

అనునది సందర్భమునఁ దగనిమాటగాఁ గనుపించుచున్నది. దీని పైన విదురబోధయొక్క విపులీకరణమున్నది. దీనినంతయుఁ దిక్కనామాత్యుఁడు "తెలియనాడి"-యని యొకమాటతో ముగించివేసినాఁడు

తిక్కన మహాలోకజ్ఞుఁడంటేమి వ్యాసుడుకాఁడా!, కాఁదనుట దురాగతము, వ్యాసునకునుఁ - దిక్కనకును - యుగముల యంతరమున్నది, జాతులు మారినవి, నాగరికత లెన్నియో వచ్చినవి పోయినవి అభిరుచులు తారుమారై

నవి, ఆచార వ్యవహారములు మారినవి; ఇన్ని వేల సంవత్సరములైనను వ్యాసుఁడు-జీవించి యుండుటయే యాతడవతార పురుషుఁడనుటకు నిదర్శనము. అమాత్యులతో మనకంతరము గొన్ని వందల యేండ్లు. ఒకరీతిగా మనకుఁ దోడివాఁడు. అతని రాగద్వేషములు మనవేమో యనిపించును అతని హృదయము మనలోఁ బ్రతిస్పందించును. ధర్మరాజునందఱునూరార్చిరి, పారాశర్యునకుఁగూడ విసుగైనది, "నిష్ఠించి నీకేము సెప్పిన వాక్యంబులెల్లను— వఱదఁగలసిపోయెనే"—యని విసుగు కొనుచున్నాఁడు. కాని - యేమి సేయును, మరల బ్రాతపాట, మరల యూరార్పు, అశ్వమేధ మధికదక్షిణాన్వితముగఁ జేయుమన్నాఁడు, బాగున్నది, ధనమేదీ? కయ్యంబునఁ బ్రసిద్ధులైన రాజులందఱును జచ్చిరి. వారి సుతులున్నారు, వారా! శిశువులు, పితృవియోగ దుఃఖితులు, వారి నుండి ధనము వసూలుసేయుట యకరణీయము బండారము వట్టిది, దుర్యోధనుఁడుఁ బాండవులలోడి యీసుతో ననేక రాజులను గూడఁబెట్టికొనెను, పుక్కడి మూకలను జేర్చెను. భూమి పాడైనది. ఈ సందర్భముననే వ్యాసుఁడు మరుత్తుని ధనము వాడుకొమ్మన్నాఁడు, అతఁడెవరు? మరుత్తుని కథ జెప్పవలసివచ్చినది, ఈ ఘట్టములో వ్యాసుడు నరమేధమున గూడ జేయుమనెను. తిక్కన దానినిఁ దొలఁగించెను కృతయుగమున మనువుండెను. అతఁడు దండనీతి ప్రవర్తకుఁడు. ఆ వంశమట్లే జరుగుచుఁబోయినది. అందులో వివిశుఁడు జనియించెను అతనికిఁ బది యేవురు గొడుకులు. వారిలోఁ బెద్దవాఁడు ఖనీనేత్రుఁడు. వీరందఱికినిఁ గలిపి - వ్యాస భగవానుఁడీ క్రింది విశేషణములు వేసినాఁడు.

శ్లో॥ సర్వేధనుషి విక్రాంతాః బ్రహ్మణ్యాస్సత్యవాదినః
దాన ధర్మరతాశ్శాంతాః, సతతంప్రియవాదినః ॥

ఇన్ని సుగుణములతోడ వీరు సాధించినదేమి? "ఖనీనేత్రుఁడధిక బల శౌర్యుండు. అకార్యపరుడు" వాఁడు దమ్ములతో జగడించెను. పదునలువురన్జెఱచి-సామ్రాజ్యము గైకొనెను తిక్కనామాత్యులకుఁ బై విశేషణములలో సందర్భశుద్ధి గన్పింపలేదు. అతఁడు ముక్తసరిగాఁ - "బదియేవురు గొడుకులు వుట్టిరి" — అని యన్నాఁడు ఖనీనేత్రుఁడు రాజ్యమునకువచ్చినాఁడు. వాని పరిపాలనముఁ బ్రజలకు గిట్టలేదు "నాఽన్వరజ్జంత తంప్రజాః"- ఆ ప్రజలు ఆరాజును దొలఁగించి-వాని పుత్రునభిషేకించిరి. ఇక్కడ-దిక్కనామాత్యుఁడొక చిన్న మార్పును జేసెను ఖనీనేత్రునిఁ దొలఁగించినది ప్రజలుగాదు మంత్రులు

సీ॥ మంత్రి విద్వేషంబు మాన్యపరా భవం
బును, ప్రజాపీడనంబులును గలిగి
మొక్క లీదగుటయు ముచ్చిలి మంత్రులా
తనిబాపి యతనినందనుని రాజ్య
మునకుఁ బట్టము గట్టికొనిరి—

(అశ్వ. 1.16)

రాజ్యమునుండి తొలఁగించుటకుఁగల కారణములలో ముఖ్యమైనది—మంత్రులతోడిద్వేషము. తరువాతి కారణములు-మాన్యపరాభవము - ప్రజాపీడ మంత్రులు వానిని—"ముచ్చిలి" - రాజ్యమునుండి దొ గించిరట। ఇట్టి రాజకీయములలోఁ దిక్కన-సిద్ధహస్తుఁడు. తరువాత వానికొడుకు - రాజ్యమునకు వచ్చెను. మూలానుసారముగ నాతఁడుధర్మప్రవృత్తుఁడు, ధర్మముతో ధనమెట్లు జెడును? అమాత్యుఁడు దానికొక చేర్పును జేర్చినాఁడు,-"సతతదాన తత్పరుఁడై కలధనము లెల్ల విప్రులకు నిచ్చినాఁడు అతఁడే కాలాంతరమునఁ" గరంధముఁడయ్యెను. శాత్రవులొడిచిన రాజ్యమును దపశ్శక్తితో సంపాదించినాఁడు. తెనుఁగు భారతము ననుసరించి-'కరంధముని'-మనుమఁడే-మరుత్తు సంస్కృతమున మరి యిర్వురు రాజులున్నారు. కరంధమునికొడుకు - కారంధముఁడు. వికుక్షియాతని కుమారుఁడు. కనుక — కరంధముఁడు - మరుత్తునకు ముత్తాత. మూలములోఁ గరంధముఁ డశ్వమేధము జోలికిఁ బోలేదు ఇంద్రునితో స్పర్ధయు నాతనికిలేదు. కారంధముఁడును జన్నములు వేల్వలేదు. ఇంద్రాదనవరః - యను విశేషణము మాత్రమే యాతనికున్నది యజ్ఞములు దలపెట్టిన రాజు అవిక్షి. అతని కుపద్రష్ట యంగిరసుడు, ఆ మహారాజు నూఱు యజ్ఞములు జేసెను. తెనుఁగులోఁ-గరంధముఁడే యజ్ఞములారంభించెను అవి పెక్కులు, ఉపద్రష్ట యంగిరసుఁడే కనుక కరంధముని జన్నములే వాసవునితోడి పగకు దారితీసినది. కారంధమునకు వేసిన-'యింద్రాదనవరః' అను విశేషణము-అమాత్యుని యూహకు బలమిచ్చెనేమో। కనుక యింద్రునితో పగ యమాత్యుని కవిత ననుసరించి-కరంధమునినాటినుండి; మూలమున వికుక్షినాడనుండి; మరుత్తుడు-దనయజ్ఞము కుపద్రష్టగానుండమని బృహస్పతిని ప్రార్థించియుండెను. - "వత్తు" నని యాతఁడు మాట చెప్పినాఁడు. ఇంతలో-వాసువునకు రిమ్మరేగినది. అతఁడు మరుత్తుని యజ్ఞము జేయింపరాదని - బృహస్పతిని నిర్బంధించెను. వీరి పగలు

రెండు-నాల్గు తరములనుండియున్న విగదా! అంతేగాదు. మరుత్తు, వంశకీర్తిని బోగొట్టలేదు. వాసవతుల్యుఁడైనాఁడు. వారిర్వురినడుమ సామాన్యముగ గీచులాట లుండెడివి - "వాసవోఽపి మరుత్తేన స్పర్థతే", ఎట్లైనను మరుత్తునకన్న దాను గొప్పవాఁడ ననిపించి కొనవలెనని బలవైరి ప్రయత్నము. అందుకై యాతఁడు యతమానుఁడగుచుండెను. కాని, సాధ్యమగుటలేదు. ఇది యాతని మనస్సులో మెఱమెఱ, అపుడు - బృహస్పతినింటికి బిలిపించికొన్నాఁడు: - "సమాహూయ బృహస్పతిం-", తెనుఁగులో నతనియింటికే దేవేంద్రుడువోయినట్లున్నది. మంత్రి నివాసమునకుఁ బోవుట యనుచితముగదా!, కాని-వాసవుఁడు 'చింతాసక్తుఁడు,' అది తరతమభావముల గమనింప నిచ్చుటలేదు.

పైఁగా - బృహస్పతితోఁ బని. ఈ మాటలన్నియు 'తచ్చింతాసక్తుండై'- అన్న దాని పొట్టలోనున్నవి, మూలమునందు - వారి సంభాషణ - సుమారు పది శ్లోకములవరకున్నది, మరుత్తునకు - దైవకర్మలుగాని - పిత్ర్యములుగాని - చేయింపరాదని దేవేంద్రుఁడు షరతు పెట్టినాఁడు. అది - తిక్కన కంతగా గిట్టి నట్లులేదు. దానినిఁ దొలఁగించెను. పైఁగా - మూలములో దేవతల నందరిని దోడు తీసికొనిపోయినట్లున్నది, ఏకాంతమున సంభాషించినట్లు అమాత్యుఁడు మార్చెను. ఇదియే యుచితముగఁగనుపించుచున్నది. మూలమున వారి సంభాషణ మీ క్రిందిది.

శ్లో॥ అహంహి త్రిషులోకేషు సురాణాంచ బృహస్పతే
ఇంద్రత్వం ప్రాప్తవానేకో మరుత్తస్తు మహీపతిః॥

శ్లో॥ కథంహ్యమర్త్యం బ్రహ్మం స్త్వం యాజయిత్వాసురాధిపం
యాజయేర్మృత్యు సంయుక్తం మరుత్తమవిశంకయా॥

శ్లో॥ మాంవావృణీష్వ భద్రంతే మరుత్తంవా మహీపతిం
పరిత్యజ్య మరుత్తంవా యథాజోషం భజస్వమాం॥

శ్లో॥ ఏవముక్తస్స కౌరవ్య దేవరాజ్ఞా బృహస్పతిః
ముహూర్త మివ సంచింత్య దేవరాజాన మబ్రవీత్॥

శ్లో॥ త్వం భూతానా మధిపతి స్త్వయిలోకాః ప్రతిష్ఠితాః
నముచే ర్విశ్వరూపస్య నిహన్తా త్వంబలస్యచ

శ్లో॥ త్వమాహ జహర్థం దేవానా మేకో వీరశ్రియం పరాం
త్వం బిభర్షి భువం ద్యాంచ సదైవ బలసూదన॥

శ్లో॥ పౌరోహిత్యం కథంకృత్వా తవ దేవగణేశ్వర!
యాజయేయమహం మర్త్యం మరుత్తం పాకశాసన! ॥

శ్లో॥ సమాశ్వసిహిదేవేంద్ర! నాహంమర్త్యస్యకర్హిచిత్
గ్రహీష్యామి స్రుపంయజ్ఞే శృణుచేదం వచోమమ॥

తిక్కన యీ సంభాషణమునంతయు నొక్క సీసపద్యములోఁ జెప్పినాఁడు. అది యీ క్రిందిది —

సీ॥ అనఘ మరుత్తుండు నినువరింపఁదలంచుఁ
దనయజ్ఞమున కుపద్రష్ట గాఁగ
నమరాధిపతియగు నట్టి నాకును, జేసి
యుపదర్శనంబింక నొక్క మర్త్యు
నకుఁజేఁత నీ పెంపునకు హానిగాదె, నన్
విడిచి యాతని యజ్ఞవిధులు నడపుఁ
డాతనిఁ దొఱఁగి మదాప్తత మెఱయు పె
క్కాఁడంగనేటికి ననుడు నతని

తే॥ పలుకులకునవ్వి, యా బృహస్పతి మహాత్మ!
యెఱుఁగనే నిన్ను, నన్ను నీ వింతసెప్ప
నేల, సర్వలోకముల కధీశుఁడైన
నీ గురుండౌరు నాసించునే మహేంద్ర! ॥

"నీ పెంపునకు హానిగాదె!" అని యారంభించి-బృహస్పతిని కొండపై కెక్కించినాఁడు, దేవరాజు మాటలు విని— "ముహూర్తమివ సంచింత్య" అని మూలమందున్నది తెలుగువాఁడైన బృహస్పతి - యతని పలుకులకు నవ్వినాఁడు, సంస్కృతములో వాసవుఁడు గూడఁ దన్ను పొగడుకొనెను. దాలని దానికి - బృహస్పతియుఁ బ్రస్తుతించెను. ఈ భాగము లన్నియుఁ దిక్కన్న తీసివేసినాఁడు. "మహాత్మ! యెఱుఁగనే నిన్ను" అని, యొక్కమాటతో ముందునకుఁ బోయినాఁడు, "నన్ను నీ వింత చెప్పనేల" అని, యాత్మవికత్థనమును నియమించికొన్నాఁడు ఈ సందర్భమందే.

శ్లో॥ హిరణ్యరేతానోష్ణస్స్యాత్ పరివర్తేత మేదినీ
భాసంతు న రవిః కుర్యాత్, నతు సత్యం చలేన్మయి॥

యీ శ్లోకమును - అందమైన తెనుంగు బాసలోఁ దిక్కన పరివర్తించెను. ఆ పద్యమిది—

ఆ. వె॥ అగ్ని సల్లనైన, నబ్జమిత్రుఁడు మైల
పడ్డ నుర్వి నొరలఁబడిన, మేరు
నగము సంచలించినను, బొంకు వొరయునే
నాదుపలుకు నెమ్మనమున నమ్ము॥

తర్వాత - వ్యాసశక్రుఁడు విగతమత్సరుఁడై పోయెనట! మాత్సర్య మెట్లుపోవును? అది యెప్పటి కుండనేయున్నది. తాత్కాలికముగా - బలవైరికొక తృప్తి యేర్పడినది. అందుచేత- "ప్రమదంబున దేలిన చిత్తముతోడ - సముచలీలతోఁ బోయినాఁ" డట!

మరుత్తుఁడు బృహస్పతిని సమీపించెను. అతఁడు వాగ్మి, "భగవన్! నిన్ను పూర్వమభిగమించియే యజ్ఞమేర్పాటొనర్చికొంటిని. యజ్ఞమునకభిసంధి సమస్తమును ముగిసినది. దయచేసి - యుపద్రష్టగా రావలిసినదని- "ప్రార్థించినాఁడు, ఈ సంస్కృతమును తెనుఁగులో - మరి కొంత స్పష్టీకరించినాఁడు తిక్కన్న, "నీకు నెఱిఁగించి నీ పంపున యేను సంభారములనెల్ల సంఘటించి - యజ్ఞాచరణమున కమరియున్నాఁడ" ననుచున్నాఁడు "నీ పంపునన - అను నర్థము - క్రొత్తదేమియుఁగాదు "పూర్వమభిగమ్య" అను దానియందే యా భావమున్నది, కాని - యిక్కడ - వాచ్యముగ విప్పిచెప్పుటలోఁ దిక్కన్నగారి గడుసుఁదనమున్నది. అటుతరువాత బృహస్పతి- "వృతోఽస్మి దేవరాజేన" అన్నాఁడు ఎప్పుడు వృతుఁడైనాఁడు?. మరుత్తుఁడు - యజ్ఞసంభారములు గూర్చికొనుటకుముందా! తరువాతనా? ఇంద్రుఁడేమన్నాఁడు- "అనఘ! మరుత్తుండు నినువరింపఁదలంచు" నని. అనగా - మరుత్తుఁడు జన్నమునకు సిద్ధపడుచున్నపుడు - వృద్ధశ్రవునకు సపసవగా వార్తలు వెళ్ళినవి. కరంధమున కంగిరసుఁ డొనర్చిన పౌరోహిత్యమింద్రునకుఁ దెలియును కనుక - మరుత్తుఁడు-బృహస్పతి నడుగును. ఇది వడనివ్వరాదు. తర్వాత నింద్రుఁడు బృహస్పతితో మాటాడినది, అందుచే - బృహస్పతి మరుత్తునితోనన్న "వృతోఽస్మి" అనుమాట-దుర్బలము. తిక్కన- "మున్న వరియించినవాఁడ" ని స్పష్టము చేసినాఁడు, దీనితో బృహస్పతి

చేసిన ప్రతారణమునకొక బలము వచ్చినది. అంతతో నాగలేదు. మాటలలో "బొమ్మగద్దకు" వచ్చినది, బృహస్పతి యన్నాఁడు:—

శ్లో॥ అమర్త్యం యాజయిత్వాఽహం యాజయిష్యే కథంనరం
మరుత్తః గచ్ఛ వా, మావా, నివృత్తోస్మ్యద్యయాజనాత్

మూలములో దేవగురుని యుత్తరము గట్టి తెగవేసినట్లున్నది. తానింద్రునకు జంకి మరుత్తుని బ్రతారించెను అది యతఁడెఱుఁగను మరి - కదినోత్తరముదన వ్యక్తిత్వముపై దెబ్బదీయును. తిక్కన దీనిని గొంత మృదువుగాఁ బ్రవర్తింపఁ జేసినాఁడు.

చ॥ విని ధిషణుండమర్త్యులకు విన్ననువొప్ప గ్రతుప్రయోగముల్
మనము దలిర్పగా నడపి మర్త్యునియాగమునొజ్జగాగ జా
ల నిదినిజంబ, యింక ననులాప మొనర్పకపొమ్ము. వేఱయొ
క్కని నుపదర్శనంబునకు గైకొనుమారసి నీవు నావుడున్॥

మరుత్తున కాసలుడిగిపోయెను. దేబెమొగముతో వచ్చుచున్నాఁడు. నారదుఁడు గలిసి-సంవర్తుని వరియింపుమనెను. అతఁడెక్కడుండును? ... వారాణసిలో. "పురద్వారంబునందు శవంబు నిడికొనియుండుము. దానినిఁజూచి, నివర్తించువానిని సంవర్తుగా నెఱుఁగు" - మని నారదుఁడు జెప్పినయుపాయము. "సరే" - యని, మరుత్తుఁడు సమ్మతించినాఁడు. అతఁడువారాణసి జేరెను. పురద్వారమునఁగాచి కొన్నాఁడు. శవమునొక దానిని దెచ్చికొని సంవర్తునిరాకకై గాచికొన్నాఁడు. మూలములో "కుణపంస్థాపయామాస"-అని మాత్రమేయున్నది. ఎంత కాశియైనను - అడిగినవెంటనే శవము నెవరిత్తురు? తిక్కన్న - "దిక్కుమాలిన పీనుగొక్కచోటబడి యున్న, గని-దాని బట్టెఁచికొని," పురద్వార ప్రదేశంబు సేరనరిగి - "అని-శవలాభమునకొక కారణముజెప్పినాఁడు. సంవర్తుఁడు వచ్చెను. వ్యాసుఁడు—"కుణపం దృష్ట్వాసహసా సన్న్యవర్తత"—అన్నాఁడు సంవర్తుఁడు శవమును జూచి పరువెత్తుటెందులకు? అమాత్యుఁడాతనిని—"వెఱ్ఱివాఁడ" ని కొంత కారణమును సూచించెను. అతఁడు—శవమును జూచి - వాటువడ్డపసరము వలె బరుగెత్తినాఁడట! ఈ యుపమాన మాతలఁగుటలోని - తీవ్రతను దెలుపుచున్నది. 'సన్న్యవర్తత'-యనునది దుర్బలమైనమాట! సన్నివేశమునుమన. కన్నుల యెదుటఁ జప్పగా నిలుపును. అజ్ఞనపతి యతని పజ్ఞనఁజనినాఁడు. ఎంతకును సంవర్తుఁ డాగలేదు. ఆగుపఱకును మరుత్తుడు వెంటఁబడినాఁడు

శ్లో॥ సచతం విజనే దృష్ట్వా పాంసుభిః కర్దమేనచ
శ్లేష్మణాచైవ రాజానం ష్ఠీవనైశ్చ సమాకిరత్॥

శ్లో॥ సతథా బాధ్యమానోవై సంవర్తేన మహీపతిః
అన్వగాదేవ తమృషిం ప్రాంజలిస్సంప్ర సాదయన్॥

శ్లో॥ తతో నివృత్య సంవర్తః పరిశ్రాంత ఉపావిశత్
శీతలచ్ఛాయమాశ్రిత్య న్యగ్రోధం బహుశాఖినం

ఈ ఘట్టమున కమాత్యుని తెనుఁగు సేత యిది. "అతండు మరలిసూచి, పై ధూళిసల్లియు, నుమిసియు, వేదురుచందంబు భావింప, నా భూవల్లభుండు"

కం॥ వినయముతో గేల్మొగుచుచు
ననుగమనంబుడుగ కరుగ, నాతండును, ని
ర్జనమగు ప్రదేశమున కు
న్జని యొక వటవిటపి సీడ జతికిలఁబడియెన్॥

"పరిశ్రాంతః"-అనుట - తెనుఁగులో-"జతికిఁ బడుట"-గానైనది. ఈ పదము సంస్కృతమునకు గేవలమనువాదముగాదు. మరి సందర్భశుద్ధిగలిగిన పదప్రయోగము. అటు తర్వాత - వ్యాసుఁడు-"తతోమరుత్తమున్మత్తో వాచా నిర్భర్త్స్యయన్నివ"

రూక్షయాబ్రాహ్మణోరాజన్! పునః పునరథాబ్రవీత్॥

శ్లో॥ వాతప్రధానేనమయా స్వచిత్త వశవర్తినా
ఏవం వికృత రూపేణ కథం యాజితుమిచ్ఛసి॥

శ్లో॥ భ్రాతామమ సమర్థశ్చ; వాసవేనచ సంగతః
వర్తతే యాజనేచైవ తేన కర్మాణి కారయ! ॥

శ్లో॥ పూర్వజేన మమాక్షిప్తం శరీరం వర్జితం త్విదం
నాఽహంతేనాఽనను జ్ఞాతః తామావిక్షిత కర్హిచిత్
యాజయేయం కథంచిద్వై సహిపూజ్య తమోమమ॥

శ్లో॥ సత్వం బృహస్పతింగచ్ఛ! తమనుజ్ఞాప్యచావ్రజ!
తతోఽహం యాజయిష్యే త్వాం యదియష్టు మిహేచ్ఛసి॥

ఇట్లు సంవర్తునిచే ననిపించినాఁడు "పూర్వజేన మమాక్షిప్తం" - అను నర్థమును - "తన తపోబలంబున నన్ను నవమానించిన"-అని తిక్కన స్పష్ట

సంచెను." "వాసవేన చ సంగతః" - "భ్రాతామమ సమర్థశ్చ" - ఇత్యాదులు ప్రకృతమునకనవసరము. వానినన్నిఁటినిఁ దిక్కనామాత్యుఁడు వదలివేసెను.

ముంజవంతమను నొక పర్వతమున్నది. హిమవంతంబున కుత్తర భాగమున. అక్కడ ధనము కుప్పలు తెప్పలుగనుండును. ఆ ధనమును నీవు తెచ్చి కొమ్మని సంవర్తుఁడన్నాఁడు. ఎందుకీమాట చెప్పెను? నరపతి శుద్ధ భావంబున కాతఁడు సంతోషించినాఁడు. నిన్ను ధనవంతునిగాఁ జేసి యజ్ఞమును నడిపింతునని పలికెను. తిక్కన్న-"మహేంద్రుకంటెను, ధనవంతునిగానొనర్చి క్రతువు నడపుదు"-నని చెప్పించినాఁడు. మూలములో "విప్రియంతు కరిష్యామి భ్రాతుశ్చేంద్రస్య చోభయోః" - అని గలదు. దానికిముందే - "భ్రాతాపూజ్యతమో మమ"-అన్న సంవర్తుఁడు-యిప్పుడన్నను జేర్చికొనుటలో న్యాయములేదు. ఆ కొండ దెసఁగులో నింద్రుఁడొక్కఁడే యగపడుచున్నాఁడు. ముంజవత్పర్వతమందు-శివుఁడు విహరించుచుండును. అది యిట్లు.

శ్లో॥ ... . .
తప్యతే యత్రభగవాన్ తపోనిత్య ముమాపతిః॥

శ్లో॥ వనస్పతీనాం మూలేషు శృంగేషు విషమేషుచ
గుహాసు శైలరాజస్య యథాకామం యథాసుఖం॥

శ్లో॥ ఉమాసహాయోభగవాన్ యత్ర నిత్యంమహేశ్వరః
ఆస్తే శూలీ మహాతేజా నానాభూతగణావృతః॥

శ్లో॥ తత్రరుద్రాశ్చ సాధ్యాశ్చ విశ్వేஉథ వసవ స్తథా
యమశ్చవరుణశ్చైవ కుబేరశ్చ సహానుగః

శ్లో॥ భూతానివ పిశాచా శ్చ నాసత్యావపిచాశ్వినౌ
గంధర్వాప్సరసశ్చైవ యక్షాదేవర్ష యస్తథా॥

శ్లో॥ ఆదిత్యా మరుతశ్చైవ యాతుధానాశ్చ సర్వశః
ఉపాసంతే మహాత్మానం బహురూప ముమాపతిం॥

శ్లో॥ రమతేభగవాం స్తత్ర కుబేరానుచరైస్సహ
వికృతై ర్వికృతాకారైః క్రీడద్భిః పృథివీపతే॥

శ్లో॥ శ్రియాజ్వలన్ దృశ్యతేవై బాలాదిత్య సముద్యుతిః
నరూపం శక్యతే తస్య సంస్థానం వాకదాచన॥

శ్లో॥ నిర్ద్వేష్టుం ప్రాణిభిః కైశ్చిత్ ప్రాకృతైర్మాంసలోచనైః
నోష్ణంన శిశిరంతత్ర నవాయుర్నచ భాస్కరః॥

శ్లో॥ న జరా క్షు త్పిపాసేవా నమృత్యుర్న భయం నృప
తస్యశైలస్య పార్శ్వేషు సర్వేషు జయతాంవర! ॥

శ్లో॥ ధాపతో జాతరూపస్య రశ్మయ స్సవితుర్యథా
రక్ష్యంతే తే కుబేరస్య సహాయైరుద్యతాయుధైః॥

శ్లో॥ చికీర్షద్భిః ప్రియంరాజన్ కుబేరస్య మహాత్మనః
తత్రగత్వాత్వ మన్వాస్య మహాయోగేశ్వరం శివం
కురుప్రణామం రాజర్షే! భక్త్యా పరమయాయుతః,
తస్మై భగవతే కృత్వా నమశ్కార్వాయ వేధసే॥

వ్యాసుఁడు వర్ణించిన శివవిహారము గొప్పగనే యున్నది. కాని-ప్రకృతమున కనవసరము. కథకంటె-యుపకథ పెద్దగ నగును. ఈ సందర్భము నంతయు నమాత్యుఁడు—

"శివుండు శివా సహాయుఁడై-సురసిద్ధ గరుడ గంధర్వాది-సమస్తభూత జలంబు సేవింప విహరించుచుండు. (1-58)

కం॥ మరణ జరారోగముల
గ్గిరి యేడిరవులను లే వఖిలగుల్మలతా
తరువులగు సుమఫలంబులు
గర మొప్పుచు నుండునెల్ల కాలములంమన్॥ (1-59)

తే॥ అనగంబు పార్శ్వంబుల నరుణ కిరణ
రుచివితానంబు ననుకరించుచు వెలుంగు
శుద్ధకాంచనమయ శిలాస్థూలవాలు
కాప్రభాజాల మాశ్చర్యకారియగుచు॥ (1-60)

అని! యెక్కువగా సంకుచించినాఁడు. మూఁడవపద్యము ప్రకృతోపయోగి, ఈ ఘట్టమున వ్యాసుఁడొక యష్టోత్తరశతమును వ్రాసెను. దానిపై - మరికొన్ని ప్రార్థనా శ్లోకములు. తెనుఁగులో నీ విస్తృతియంతయు నొక సీసపద్యమై నిలిచినది. సంవర్తుఁడు - మరుత్తుఁడును భారవహులతోఁ బసిడి - త్రవ్వితండవఁలు దెచ్చిరి, ఈవార్తబృహస్పతికిఁదెలిసెను, ఆతనికి దుఃఖమైన.ది "అంగంబుకృశంబై

వెలరు వారునట్టిపగ" ను బొందినాఁడు, మూలములో "సంవర్తోవసుమానితి" యని దుఃఖకారణము చెప్పఁబడినది. బృహస్పతి వంటివానికిఁ బీనుఁగైయున్న తమ్ముని యందు "వాఁడు భాగ్యవంతుఁడగునేమో!" యని దుఃఖించుట సముచిత ముగాలేదు, తిక్కన్న దానిని తొలఁగించెను, సంక్రందనుఁడు – బృహస్పతి దుఃఖమును గమనించినాఁడు, అతఁడడిగెను.

ఆ॥ తెలివునొంది యున్నదియె నీదుచిత్తంబు
సురల బ్రదుకు తెరువు సరసినడపు
చున్నవాడవే! సముత్సాహమున వారు
నీకుఁ బ్రియమొనర్చి నేర్చిమంద్రె॥ (1-15)

అని యడిగెను, బృహస్పతి ముక్తసరిగా - "సర్వంబుసంపన్నంబ" అన్నాఁడు! ఆతనికి చిత్తశాంతిలేదు, తన దుఃఖమునకెల్ల నొకరీతిగా నింద్రుఁడీ కారణము ఎట్లుచెప్పను? మరల నింద్రుఁడు—

కం॥ నీయొడలు డస్సి వెలవెల
నై యున్నది, నీకునిట్టి యధికపువగపుం
జేయఁగ వెఱవని నీచుల
జేయుదు దండితులఁగాగఁ జెప్పుము ప్రీతిన్॥

అన్నాఁడు, అప్పుడు తన విరోధియైన సంవర్తుఁడు-మరుత్తునకు యజ్ఞమొనరించు చున్నాఁడు ఆ ప్రయత్నమును నిలుపవలె" నని వచించెను, ఈ సందర్భమున నున్నమూలమిది—

శ్లో॥ కచ్చిత్సుఖం స్వపిషిత్వం బృహస్పతే!
కచ్చిన్మనోజ్ఞాః పరిచారకాస్తే
కచ్చిద్దేవానాం సుఖకామోఽసి విప్ర
కచ్చిద్దేవాస్త్వాం పరిపాలయంతి॥

శ్లో॥ సుఖం శయే శయనేదేవరాజ!
తథా మనోజ్ఞాః పరిచారకామే
తథాదేవానాం సుఖకామోఽస్మినిత్యం
దేవాశ్చమాం, సుభృశంపాలయంతి॥

శ్లో॥ కుతోదుఃఖం మానసందేహజంవా
పాండుర్వివర్ణశ్చకుతస్త్వమద్య

ఆచక్ష్వమే బ్రాహ్మణ యావదేతాన్
నిహన్మి సర్వాం స్తవ దుఃఖకర్తృకాన్॥

ఇంద్రుఁడు వేసిన ప్రశ్న - బృహస్పతిని వేయవలసినదిగాదు. అట్లే యింద్రుని వచనములను వదిలించి-బృహస్పతి జవాబుచెప్పుటయును. దేవగురుని మనోగాంభీర్యమును గించపఱచుచున్నది.—"సర్వంబు సంపన్నంబు" - అను నతని మితవాక్యములలో నెంతయో శోభయున్నది. మరుత్తుని యజ్ఞమునుండి మరల్పుటకు - అగ్నిదేవుఁడు వచ్చెను — "బృహస్పతి యే నీ యజ్ఞమును జేయించును సంవర్తుని విడువు"—మని యాతఁడు చెప్పినమాట. ఈ పథకము సంవర్తుని విభేదింపఁజేయుటకు, మరుత్తుఁడు యింతకుముందు-తాను బృహస్పతిని బ్రార్థించుటయు-నాతఁడు దిరస్కరించుటయు - "బృహస్పతే రంజలి రేషః"- అన్నాఁడు. తిక్కన దీనిని.

ఆ॥ "అనఘః యేడు మ్రొక్కులా బృహస్పతికి మ్రొ
క్కెదనతండు నన్ను నదయవృత్తి
నపహసించి, తాను యాజకత్వమునకు
నెట్లు జొరకయున్న నేను బోయి"

అన్నాఁడు, కోపముతోడి విసుగేర్పడినప్పుడు అంధ్రులు నీ కేడు మ్రొక్కులు నాయనా!—"యనుట పరిపాటి, తిక్కన్న దానినట్లే పెట్టినాఁడు. ఇది యొక కథ!,

ఇంతకును దిక్కన్న శిల్పమేమి ! మూలకథను పూర్తిగా విడిచిపోడు, అధికప్రసంగములు సేయఁడు, ఆతని రచనలో అవసరమైన తీర్పులు తీర్చును కావలసిన చేర్పులు చేర్చును. అంతేఇట్లే — తక్కిన కథలలోను జూచికొన వచ్చును.

ఒక్కొక్కరి దొక్కొక్క శైలి, మొదలువెట్టిన మెంటనే-'వ్యావృత్తవదన' మైన పెద్ద సమాసముతో-శ్రీనాథుఁడు సాక్షాత్కరించును. "కొంటె కోణంగి"-పదములతో-రామకృష్ణుఁడు; 'అలతియలతి కునియ-లతో-కాహళ సంధించినట్లు తిక్కన; అతఁడు సంస్కృతమును వాడఁడు. వాడినను-అవి, తెలుఁగులవలెనే యుండును. నన్నయ యక్షర రమ్యతయుఁ గొట్టవచ్చినట్లగుపించును. నన్నయ శ్రీనాథులిర్వురును-గీర్వాణ ప్రియులైనను-వారి సంస్కృతములో భేదమున్నది. నన్నయ సంస్కృతము - వాసంతవనము. శ్రీనాథుని వాక్కు భేరి. శైలిలోఁ

దిక్కన్నయే సేయఁగల కొన్ని చమత్కారములున్నవి. వానినట్లే గ్రహింపవలె నంతే. తత్సజాతీయము లేర్పఱచికొన్నను - ఋా సంతాన మమాత్యులదని వెంటనే దెలియును. చూడుఁడు.

చ॥ మనసునుదానవాయువును మానిసిఁ గూడి వెలార్చువాక్కునా
త్మనివలనన్ భవద్వచనమున్, జనతాసుభవంబు చొప్పయై
నను వినుకార్యమున్ గుఱిచినందగ వాగను వర్తనంబుసే
యన వలసెన్, మనంబునకు నమ్మెయిగల్గుట నట్లు సెప్పితిన్॥
(అ. 2-17)

ఇందలి "అమ్మెయిగల్గుట నట్లుసెప్పితిన్" అనునది అమాత్యులశయ్య, అట్లే—

చ॥ అనివసుదేవసూనుఁడు సమాదరమేదురచిత్తవృత్తిఁజె
ప్పిన విని వారి యుల్లముల పెంపిటులుండునె, వారలెవ్వరో
వినుటకు నాదు డెందమున వేడ్కజనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచివవ్వచున్॥
(అ. 2-221)

అను పద్యమందలి వారి యుల్లముల పెంపిటులుండునె!" అనునదియును "నాదు కనుమనంబుదనిపె" కన్నొకటి దనిసిన నాతనికిఁ దృప్తిలేదు. మనసును దనియ వలెను. ఇట్లే - యనుకూలమున్నచోట నంతయు-నాతఁడు రెండుమూఁడింద్రి యములఁగూడ గట్టికొనుచుండెను, ఉదంకుఁడు_తాను చెప్పినట్లే - కుండలములు గొనిపోయి, గురుపులకు సమర్పించినాఁడు, అప్పుడాతని గురువు గౌతముఁ డిట్లనెను—

ఉ॥ నీ చరితంబు చిత్రమహనీయము, మిత్రసహక్షితీశ్వరున్
నీచతబాప, నాగమపనీతము సేసిన కుండలద్వయం,
బాచతురత్వ, మాబలిమి, యాదృఢనిశ్చయమట్టులొప్ప ధ
ర్మోచితలీలఁదేర నొరుఁడోపునె! యేనునిజంబపల్కితిన్॥
(అ. 3_117)

పై పద్యమందలి "ఆ చతురత్వము - ఆబలిమి - ఆ దృఢ నిశ్చయము" మన యూహకే వదలివేసినాఁడు, చెప్పిన కథనుబట్టి మన మూహించికొనవలెనన్న మాట, ఉదంకుని చరిత్ర నన్నభట్టులు గూడ వ్రాసిరి. ఈ యిర్వురికిఁ బోల్చికొని చూచినప్పుడు-మనకు వారి మనస్తత్వములు - అద్దములోపలెఁ బ్రత్యక్షమగును,

వృత్తరచనలో నిర్వహించుటకుఁ గష్టములైనవి యతిప్రాసలు; ఎంతసమర్థుఁడైనను-యెక్కడో యొకచోటఁ గుంటువడును. 'యతిప్రాసలు లెమ్మ'ని సరిచేసికొందుము, అమాత్యులలోనట్టి యదుకులు-లేనేలేవనునంత తక్కువ, సమయమునకు సరిగా నవి 'సిటీబస్సు' వలె గనుపించి యదుకుకొనును

కథచెప్పికొని పోవునపుడు వ్యాసునకుఁ బూర్తిగా దానిపైననే చూపుండును. చిన్న చిన్న విషయములపై మనసుంచడు. తిక్కన వీనినన్నిటిని గమనించును, ధర్మరాజు దుఃఖముతో నేలకు వాలినాఁడు ఎట్లు? "వ్యాధవిద్ధఇవద్విపః" అని వ్యాసుఁడు అజాతశత్రువునకు వ్యాధునితోడి సంబంధము దిక్కన్నకు నచ్చలేదు, "మహోగ్రబాణపాతంబున మ్రగ్గునేనుంగు విధంబున" అని వ్యాధుని వెనుకకు నెట్టివేసినాఁడు, ధర్మరాజుతో మాట్లాడఁదలఁచి "కదిసికూర్చున్నవాడు-తెనుఁగులోని ధృతరాష్ట్రుఁడే. జనకునికాలములో - నొకబ్రాహ్మణుడు తప్పుచేసెను." "నీవునా విషయమున నుండఁదగ"- వని నృపు నాజ్ఞాపించినాఁడు.—"నీ విషయమెంతవట్టు?"-తెలిపినచో వేరుకడ కేగెదనని-విప్రుని యుత్తరము, జనకుఁడు మూర్ఛవోయెను" ఈ భూమిపై నాకు మమత్వమేర్పడినదే — అని యాతని బాధ అప్పుడు - బ్రాహ్మణప్రవరుఁ "డల్లననవ్వినాఁడ"ట. ఈ నవ్వు తిక్కన నవ్వినది, ధర్మరాజు అశ్వమేధ యాగమొనరించెను. రివాజు ప్రకారము-అర్జునుఁడశ్వ రక్షకుఁడుగా వెడలినాఁడు, త్రిగర్తదేశాధీశ్వరులతో యుద్ధము జరుగుచున్నది. వెనుకకుఁ బొమ్మని కవ్వడి సలహాచెప్పెను. వారు వినలేదు. సూర్యవర్మ బాణప్రయోగ మొనర్చెను, ఆ బాణపాతమునకు - "ప్రజహాస ధనంజయః" — అని మూలము.

ఇది తెనుఁగులో-చక్కని యలంకారమైనది—

చ॥ "వఱవదు పొందఁగంగ నిలువంబడకేపున సూర్యవర్మ య
బ్బలియుని మీఁద గ్రూరశర పంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పము
మ్ముల, నది, యెఱ్ఱనవ్వు తనమోమును దమ్మికి లేతయెండయై
చెలువముచెన్ను పెంతలుగఁజేయఁగ నా విజయుండు భూవరా!"
(అశ్వ 4-8)

ఉదంకునకుఁ గృష్ణుఁడు దన విశ్వరూపమునుఁ జూపెను. వ్యాసరచన "విస్మయంచయ యౌవిప్రః తంద్రుష్ట్వా పరమేశ్వరం"— అని గలదు. తిక్కన యుదంకునికి సంప్రమోదము గల్గినది. భీతి యేర్పడినది.

విస్మయోదయమయ్యెను — "ఈ మూఁడుభావములును బెనఁగొని" — నమః పురుషోత్తమాయతే - "యను నుద్గారమ్ములైనవి. పరీక్షిత్తునకు సంవత్సరము గడచినది. బంధుగులందఱు గలసికొన్నారు, వారు - "సౌహార్దంబును - సౌఖ్యంబును. సౌజన్యంబును" — మెరయఁగలిసికొనిరట! "పట్టణమభినవోదార చారుత్వ"మున నున్నది. ఇట్టి చేర్పులన్నియు నమాత్యుఁడే చేయుచుండును. అర్జునుఁడు హయముతో — హస్తినాపురికి వచ్చినపుడు - జనులాతని బొగడుచు "నఱ్ఱులెత్తి"చూచిరట!, ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుఁడై యెదురుకుఁ బోవుచున్నాఁడు. కుంతియు వెంటనున్నది పాంచాలీ ప్రభృతులైన స్త్రీలందరేడ్పుచున్నారు.

"అయ్యవస్థ జూదంబునాడు పాండవులు పురంబువెలువడిన దశం బోలియున్నది" ఇట్టి చేర్పులెన్నియో-మనకడుగడుగునను గన్పించును కాశ్యపుఁడను నొక బ్రాహ్మణుఁడుండెను. అతఁడొక సిద్ధునాశ్రయించినాఁడు. శిష్యత్వము మొదలుపెట్టెను. ఆ గురు వాతని "వినయసుందరా!" — యని సంబోధించెను. అనఁగా - నితని వినయమతని కర్థమైనదన్నమాట!, భగదత్తుని కుమారుఁడు అర్జునిపై శరమువేసెను అప్పుడాత "డల్పకోపసుందరుఁ" - డైనాఁడట!, నన్నయ భట్టులును — "పురందర! సర్వలోకసుందర!" అని యెక్కచోనన్నారు. అల్పాల్పమైన లీలగానది - తిక్కన మనసుకో భాసించెనేమో! దానిని వారికంటెను-సార్థకముగా సాధించినాఁడు "సౌఖ్యంపునిట్ట "మీదట తనువు" - ఇత్యాదులీతని శబ్దజాలము, లసామాన్యములు. అతని రచనయే యట్టిపదములతోఁ బుట్టినది "అద్భుతమున బొంది" - "గారవమున పేర్మి మొదలైన చిత్రకారకములాతని సొత్తు. ఒకటి రెండు చోటులమాత్రము నాకు నవ్వు వచ్చినది. ఒకానొక బ్రాహ్మణుఁడు అతఁడు సామాన్యుఁడు. భార్య" యధ్యాత్మికబోధగావింపు - "మని యాతని సమీపించినది. బాగున్నది. ఆమె మందహాస విభాసియై" - వచ్చినదట! సరే! ఎంత చిన్న సంసారమైనను గృహిణికామాత్ర మలంకారముండదా" - యనుకొన్నాను. "చారుముఖీ!" అని యాతఁడు సంబోధించెను. "ఈ పాడిసరసము గూడ దగునులే"-యనుకొంటిని - "వనజనిభలోచనా" - అనసరికి-ఫక్కుమని నవ్వువచ్చినది. యతిప్రాసల అచ్చు కట్టులో సాగవలసిన కవిత్వములోనే యీ రోగమున్నది. దానికెంత సమర్థుఁడైనను - తిక్కన్న మాత్రమేమందు వాడగలఁడు?

2-8-74 }
హైద్రాబాదు }

పుట్టపర్తి నారాయణాచార్యులు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము

శ్రీనామకపార్వత్యభి
ధానక మాధుర్య ధుర్యతత్త్వాశ్లేషో
పానీతనిరంతర సాం
ద్రానందప్లావితాత్మ హరిహరనాథా.

—: శోకమగ్నుండగు ధర్మజునిఁ గృష్ణాదులు ప్రబోధించుట:—
నం. 14-1-1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లమరనదీనంద
నున కుదక కర్మం బాచరించి ధర్మనందనుండు ధృతరాష్ట్రి పురస్స
రంబుగ భాగీరథి యుత్తరించి తత్తీరదేశంబున.

3. ఉ. ఉమ్మలికంబునం బొగులుచుల్లముతోఁ బొరి శోచనంబులం
గ్రమ్మఁగ నశ్రువారి ధృతిగౌరవ మేద మహోగ్రబాణ పా
తమ్మున మ్రొగ్గునేనుఁగువిధమ్మున నేలకు వ్రాలఁ బట్టె వే
గమ్మ వృకోదరుండు మురఘస్మరుపంపున నమ్మహీశ్వరున్.

4. ఆ. పట్టి యతఁడు దనదుపైచీర యాస్తర
ణంబు సేసి భూస్థలంబునందుఁ
బెట్టె మానసములు పెద్దయు నలఁదురి
యర్జునాదిసోదరాలి వొదివె.

5. వ. కృష్ణుం డుచితవచనంబుల నాభూపాలుం బ్రబోధించె నప్పుడు ధృత
రాష్ట్రుండు గదిసి కూర్చుండి యక్కురుపతితోడ.

6. సీ. క్షత్త్రధర్మంబునఁ గైకొంటి మేదిని
యుమ్మలి కింపక లెమ్మ వత్స
యనుజవర్గము నీవు ననుభవింపుము శోక
కాలంబు గా దిది యేల పగవ
నని పల్కు విదురహితాలాపములు దన
వినకుండుటయు సుయోధనుని కీడు
నద్దుష్టబుద్ధిఁ దా ననుసరింపఁగ ధర్మ
మెడలినకతమున నింత పుట్టె

ఆ. ననియుఁ దెలియ నాడి తనకు గాంధారికి
వగలు మిగులఁ బొగుల వలయుటయును
నుగ్గడించి నన్ను నొంటి వగ్గులఁ గనుం
గొనుము వంత దీర్పు మనియె నధిప.

7. వ. అనిన విని యూరకున్నం గని శౌరి యక్కౌరవపతితో బంధువులు శోకంబు నొందిన మృతకోటికిం బరితాపంబు వాటిల్లు నట్లుం గాక భవదీయజ్ఞాతులు సమరంబున ననివర్తులై యూర్ధ్వలోకవర్తు లైరి వారికి శోకింపం బనియేమి శోకించిన వారలు మగిడి వత్తురే యని పలికి వెండియు.

8. క. విన వలయు వాని నెల్లను
జననాయక వింటి వీవు శాంతనవునిచే
వనట యుడుగు మిఁక దుర్మతి
యను బోలెను వగచుచుండు టుచితమె నీకున్.

9. వ. వ్యాసనారదాదులును నిన్ను బోధించిరి వారివాక్యంబు లూహింపుము.

10. చ. అతులిత దక్షిణాన్వితమహాధ్వరకర్తవు గమ్ము దేవతా
పితృనివహంబులం గరము ప్రీతియు భక్తియు నుల్లసిల్ల న
ర్చితములు సేయు మూర్విఁ బ్రజఁ జేకొని రక్ష ఘటింపు బంధు సు
స్థితు లొనరింపు మెప్డు నతిథి వ్రజపూజ లొనర్పు భూవరా.

11. వ. అనిన విని ధర్మనందనుండు సాత్యవతేయుమొగంబు గనుంగొని దేవా భవదీయ దయాప్రేమంబులు నాపై నెప్పుడు నత్యంతగాఢంబులై యుండు నన్నుఁ బెక్కుభంగుల రక్షించితి రిటమీఁద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియం బరుగని యట్లయినం బితామహాకర్ణులం జంపించిన క్రూరకర్మనకు శాంతి యెట్లు గలుగు నమ్మహాకల్మషం బేమిటం బాయు నయ్యనుష్ఠానంబు విధియింపుం డని పలుకుటయు నాధర్మధుర్యునకుఁ బారాశర్యుం డి ట్లనియె.

12 సీ. నిష్ఠించి యిబ్భంగి నీ కేముచెప్పిన
వాక్యంబు లెల్లను వఱదఁ గలసి
పోయెనే నీదగుబుద్ధి యిం తొప్పదో
కాక మర్త్యుఁడు గాఁడు కర్త యీశ్వ
రునినియోగమున మేలును గీడు నొనరించుఁ
గాన నీమదిఁ బాపకర్మశంక
గలిగె నేనియును యాగముల దానంబుల
నదివాపికొన రాదె యశ్వమేధ

తే. మధిక దక్షిణాన్వితముగ ననఘ చేయు
మంతతో భవదీయ చిత్తాను తాప
మంతయును బాయు రఘురామునట్లు పూరు
భరతులును బోలె దానతత్పరుఁడ వగుము.

13. చ. అన విని యమ్మునీశ్వరున కాన్నృపుఁ డి ట్లను నశ్వమేధ యా
గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము
న్నును వెడ వింటి సజ్జనమనోజ్ఞవచోమహనీయ నీవు చె
ప్పిన పలు కూఁది యాక్రతువు ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్.

14. వ. అని పలికి మునీంద్రా యొక్క విన్నపం బవధానంబుతో నవధరింపు మశ్వమేధం బధికదక్షిణాన్వితంబు గావలయు ననుట దెల్లంబుగా మీరు వాన తిచ్చితిరి నా కర్థంబు లేదు కయ్యంబున మృతులయిన నరపతుల సుతులు శిశువులును శోకాకాంతులునుం గావున వారలవలన

ధనాహరణం బత్యంతాకరణీయంబును దుర్లభంబును నైనది తొల్లి దుర్యోధనుండు మాతోడియీసునంజేసి పెక్కండ్రు రాజులను బ్రుక్కడిమూఁకలనుం గూడఁబెట్టి ధనంబు వ్యయపెట్టి భూమియు బండారంబునుం బాడు చేసె నివ్విధంబున నిర్ధనత్వంబు వాటిల్లె ధనార్జనంబునకు నొండొక వెరవు దొరకొన దిట్టిది కర్తవ్యం బని యెఱుంగ కున్నవాఁడ మంత్రులరై నాకుఁ గార్యం బెఱింగింప వలయు నని ప్రార్థించిన నమ్మహాత్ముండమ్మహీపతిం బరమాదరం బున నాలోకించి కొండక విచారించి.

15. సీ. అనఘ మరుత్తుండు యజ్ఞంబు సేసి మ
హాధనరాసుల నవనిసురుల
కిచ్చె వా రవి గడు నెక్కుడై యుండుటఁ
ద్రవ్వి తండంబులు దమగృహముల
నిడికొని పెఱధన మెల్లను నిధియుఁగా
నిమ్మైన నెలవున నిడుచు నుండి
యందఱు నేకవాక్యత దీని నెవ్వరు
గనినను నిది వారిధనము యనిరి

ఆ. మానవేంద్ర యమ్మహానిధానము దెచ్చి
వలసినట్లు నీవు వ్యయము సేయు
మనిన ధర్మతనయుఁ డతఁ డె ట్లుపార్జించె
నంతకాంచనము మహాత్మ చెపుమ.

16. క. అనుటయు నాసత్యవతీ
తనయుండు మరుత్తుపుణ్యతరచరితంబున్
వినఁ గోరుట మే లెంతయు
వినిపించెద నీను లలర వినుము నరేంద్రా.

17. వ. అని పలికి యి ట్లనియెఁ గృతయుగంబున దండనీతిప్రవర్తకుం డగు మనువునకుఁ బ్రజాని యనుతనయుం డుదయించె నతనికి క్షుతుం డుద్భవించెనాతనికి నిక్ష్వాకుండు ప్రభవించె నాభూపతికి నూర్వురు

సుతు లుదయించి రం దగ్రజుండగు వింశునకు వివింశుం డుదయించె నప్పుడమిఱేనికిం బదియేవురు గొడుకులు పుట్టిరి వారిలోనం బెద్దవాఁ డగుఖనీనేత్రుం డధికబల శౌర్యుండును నకార్యపరుండును నై సోద రులం గలపికొని నడవక పదునలువురం బెఱచి సామ్రాజ్యంబుఁ గైకొని యుండి.

18. సీ. మంత్రి విద్వేషంబు మాన్యపరాభవం
బును బ్రజాపీడనంబులును గలిగి
మొక్కలీఁ డగుటయు మ్రుచ్చిలి మంత్రు లా
తనిఁ బాపి యతని నందనుని రాజ్య
మునకుఁ బట్టము గట్టికొని రక్కుమారుండు
దమయయ్యచేటు చిత్తమునఁ దలఁచి
సచివప్రభృతు లగు సర్వజనంబుల
యాత్మల ననురాగ మావహిల్ల

తే. సత్యమును బాడియును నొప్పి నిత్యధర్మ
పరత వర్తిల్లె నమ్మహీశ్వరుఁడు సతత
దానతత్పరుఁ డై కలధనము లెల్ల
విప్రులకు నిచ్చి దారిద్ర్య వికలుఁ డయ్యె.

19. క. దానఁ గడు డస్సె నాతని
సేన యరాతు లది యెఱిఁగి చెచ్చెర బలసం
తానముతోడం బైకొని
యానరపతిఁ జెఱిచి రాతఁ డాప్తులుఁ దానున్.

20. క. వనమునకు నేఁగె సంయమి
జనములు నచ్చెరువు నొందు చందంబున న
జ్జనవిభుఁడు నియతి నట తప
మొనరించి మహాప్రభావ మొంది కడంకన్.

21. క. అమలమతిఁ గరముఁ గ్రోలుగ
నమరించి మానితతపోమయాధికశక్తిన్

దమనక్రియ యొనరించిన
నమితసుణా చెప్పఁ జిట్టి లయ్యెను దానన్.

22. వ. ఆకర్ణింపుము.

23. క. భట తురగ సామజరథో
త్కట సేనాసముదయములు బహుళరుచినము
త్కట కాంచనరాసులు న
త్కటిఁ జెందమెం జూడ నక్కజం బగుభంగిన్.

24. వ. ఇట్లు బలంబును ధనంబునుం గల్గుటయును.

25. క. ఆనరపతి రయమున రిపు
భూనాథుల మీఁద నడచి పోరుల వారిన్
సేనాయుతముగఁ జంపియుఁ
గానలకుం దోలియును బ్రకాశత నొందెన్.

26. క. కరధమనంబున నాతఁడు
కరంధముఁ డనంగఁ బరఁగి గౌరవమున వి
స్ఫురణము విభవము శౌర్యముఁ
గరుణయు ధైర్యంబు వెలయఁగా నిల యేలెన్.

27. తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి
యజనశీలత సర్వమేధాధ్వరంబు
లంగిరసుఁ డుపదర్శకుండై నయింపఁ
జేసె నన్నృపశేఖరు సంప్రీతిఁ బొగడ.

-: వేదవ్యాసమునీంద్రుండు ధర్మజునకు మరుత్తుని చరితంబు సెప్పుట :-

సం. 14-4-28

28. క. అతనినుసుమఁడు మరుత్తుం
డతులయశుఁడు విష్ణుసదృశుఁ డనఁ దగునాగా
యుతబలుఁడు ధర్మతత్త్వ
స్థితివిదుఁడు సమిద్ధ బహుళతేజుం డధిపా.

౨౯. ఉ. అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే
ధ మ్మొనరించుచుండి వివిధ స్ఫురితాలయముల్ ప్రదీప్త ఖాం
డమ్ములు సత్పదార్థము లిడం దగు తక్కును గల్గు సిద్ధపా
త్రమ్ము లసంఖ్యముల్ పసిఁడిఁ బ్రస్తుతి కెక్క ఘటించె భూవరా.

౩౦. వ. అట్లు సమకట్టి యతండు.

౩౧. చ. హిమగిరిసాను దేశమున నెక్కుడు వైభవ ముల్లసిల్ల య
జ్ఞము తగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హే
మ మొసఁగెఁ గుప్పఁ గూరలు సమగ్ర కుతూహలుఁ డై కనత్సువ
ర్ణమయ గృహక్రియోపకరణ ప్రకరంబులు నిచ్చె భక్తితోన్.

౩౨. వ. అని చెప్పి యిడి మరుత్తుని యాభిజాత్యంబును దదీయవిత్తవిశేషంబును నెఱింగించుట యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెదఁ దదంచితక్రతు క్రియాప్రకారంబునుం జెప్పెద విను మట్లు కరంధముఁడనం బరఁగి మనువంశ దీపకుం డై పేర్చినయాభూపతి నిజతపఃప్రభావంబున మహానుభావుం డగునంగిరసుండు దన కుప ద్రష్ట మయి యనేకాశ్వమేధంబులు సేయించుటం జేసి యావహిల్లిన మాహాత్మ్యంబునను మహీపతు లెల్లఁ గొలువం బూజ్య సామ్రాజ్యం బను భవించి తనవలచినయప్పుడ తనువుతోడన యూర్ధ్వలోకంబునకుం జనియె నమ్మనుజపతితనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభార ధౌరేయుం డై యతనిన పోలి ప్రజలం బాలించె.

౩౩. చ. అతని సుతుండు సూవె మనుజాధిప సత్తమ యమ్మరుత్తుఁ డా
పతి తనతండ్రిపిమ్మట గృపారతుఁ డార్యుఁడు దండనీతివి
శ్రుతమతి దానశీలుఁ డన రూఢికి నెక్కి తదీయరాజ్యసు
స్థితి వెలుఁగొందె వాసవునిఁ జీరికిఁ జేకొనఁ డీసు పెంపునన్

౩౪. క. వాసవుఁడును నవ్విభునెడ
నీసు గలిగి తన్ను మిగుల నీ నని తచ్చిం
తాసక్తుండై మంత్రిని
వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా.

౪౫. వ. అని యతనితోడ.

౪౬. సీ. అనఘ మరుత్తుండు నిను వరింపఁ దలంచుఁ
దన యజ్ఞమున కుపద్రష్ట గాఁగ
నమరాధిపతి యగునట్టినాకును జేసి
యుపదర్శనం బింక నొక్కమర్త్యు
నకుఁ జేఁత నీ పెంపునకు హానిగాదె నన్
విడిచి యాతని యజ్ఞవిధులు నడపుఁ
డాతనిఁ బొఱఁగి మదాప్తత మెఱయు పె
క్కాడంగ నేటికి నతని

తే. పలుకులకు నవ్వి యాబృహస్పతి మహాత్మ
యెఱుఁగనే నిన్ను నన్ను నీ వింత సెప్ప
నేల సర్వలోకముల కధీశుఁ డైన
నీ గురుం డౌరు నాసించునే మహేంద్ర.

౪౭. వ. అని వెండియు.

౪౮. ఆ. అగ్ని చల్లనైన నబ్జమిత్త్రుఁడు మైల
పడ్డ నుర్వి వొరలఁ బడిన మేరు
నగము సంచలించినను బొంకు వొరయునే
నా[illegible] నెమ్మనమున నమ్ము.

౪౯. క. అన విని శ్రమదంభునఁ దే
జనపిత్త్రముతోడ సమదలీలం జనియెం
దన మందిరంబునకు సుర
లసురాగముఁ బొంద నింద్రుఁ డమలచరిత్రా.

౫౦. సీ. అని యంతయును విని యమ్మరుత్తుఁడు త్రిద
శాచార్యు కడ కేఁగి యతనితోడ
నీకు నెఱింగించి నీపంపునన యేను
సంభారముల నెల్ల సంఘటించి

యజ్ఞాచరణమున కమరి యున్నాఁడ నీ
వుపదర్శనంబు సేయుటకు రమ్మ
నావుడు నింద్రుండు ననుఁ దన యాగము
నకు మున్న వరియించినాఁడు నాకు

తే. నెట్లు రావచ్చు ననియె నా యింద్రమంత్రి
యట్లు పలికిన మాతాత కనఘ నీదు
తండ్రి సంప్రీతితో నుపద్రష్ట యయ్యె
నట్ల కృప సేయు మని పల్కె నవ్విభుండు.

41. చ విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతు ప్రయోగముల్
మనము దలిర్పఁగా నడపి మర్త్యుని యాగము నొజ్జఁ గాఁగఁ జా
ల నిది నిజంబయిఁక నచులాప మొనర్పక పొమ్ము వేఱ యొ
క్కని నుపదర్శనంబునకుఁ గైకొను మారసి నీవు నావుడున్.

42. వ. అజ్జనపతి లజ్జితుండై మగిడి వచ్చి యెదుర నారదుం గని వినయం బెసంగ వినతుండై నిలిచిన నమ్ముని యతనిం గనుంగొని యెట వోయి వచ్చె దేల విన్ననై యున్నవాఁడవు నీ తెఱం గెఱింగింపు మెవ్విధంబున నైన నీ విషాదంబు మాన్చెద ననుటయు నమ్మనుజ వరుండు మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపాధ్యాయుంగా వరియింపం బోయితి నద్దేవగురుండు నన్ను దూషించి పరిత్యజించె నింక నేట్రిబదు కని పలికిన నప్పరమసంయమి యప్పుడమితేనితో బృహస్పతి ని న్నొల్లకున్న నేమి యంగిరసుని పిన్నకొడుకు సంవర్తుం డాధిషణుచేత ధిక్కరింపం బడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబు పెంపున దిగంబరుఁ డయి తిరుగుచున్నవాఁ డతనిపాలికి నరుగు మమ్మహాత్ముండు భవన్మఖంబునకు నుపదర్శనం బాచరించు ననవుడు సంతసిల్లి యాభూవరుం డిట్లనియె.

43 క. మునివర బ్రదికితి సంవ
ర్తుని నెచ్చటఁ గాంతు నెప్పరుసునం దగ నా
డిన నతఁడు ద్రోపు సేయక
ననుఁ గైకొను నెఱుఁగఁ జెప్పు నాకుం గరుణన్.

44. వ. అని ప్రార్థించినయప్పార్థివోత్తమునకు సత్తపోధన సత్తముం డిట్లనియె.

45. సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక
వర్తించు నున్మత్తవర్తనమున
నతని నెఱింగెడు నట్టియుపాయంబు
వినుము పురద్వారమున శవంబు
నిడికొని నీ వుండు మేతెంచి చూచి ని
వర్తించు వాని సంవర్తుఁ గాఁగ
నెఱుఁగుము మరలి య ట్లేఁగంగ వెనుకన
పొమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ

ఆ. నెచట నైన నీకు నేకాంత మొదవిన
శరణు సొరుము వినయభరితవృత్తి
నాదుగుఱుతు సెప్పి నా రెవ్వ రనినను
జెంద నారదుండు సెప్పె ననుము.

-:మరుత్తుఁడు సంవర్తునిఁ దనయజ్ఞమున కుపద్రష్టఁగా వరియించుట.-
సం. 14-6-27.

46. సీ. ఇప్పుడు నారదుం డెం దున్న వాఁడని
యడిగిన యట్లైన నతఁడు నాకు
ని న్నెఱింగించి యగ్నిప్రవేశము సేసె
ననుము శంకింపక యనుడు నమ్మ
హీపతి వారాణసీపురంబున కేఁగి
దిక్కుమాలినపీనుఁ గొక్కచోటఁ
బడియున్నఁ గని దానిఁ బట్టించికొని పుర
ద్వారప్రదేశంబు సేర నరిగి

తే. యచట నక్కుణపము నిడి యంతనంత
వేచికొని యుండఁగా నొక్క వెఱ్ఱివాఁడు
వచ్చి శవముఁ గనుంగొని వాటువడ్డ
పసరమునుబోలెఁ గ్రమ్మఱి పాఱుటయును.

47\. వ. వాని సంవర్తుంగా నెఱింగి యజ్ఞపతి యతనిపజ్జన చనంజన నతండు
మరలిచూచి పై ధూళి సల్లియు నుమిసియు వేఁదుఱు చందంబు
భావింప నా భూవల్లభుండు.

48\. క. వినయముతోఁ గేల్ మొగుచుచు
నను గమనం బుడుగ కరుగ నాతండును ని
ర్జనమగు ప్రదేశమునకుం
జని యొక వటవిటపినీడఁ జదికిలఁ బడియెన్

49\. వ. డప్పి భావించుకొని యమ్మహాత్ముం డట్లు గూర్చుండుటయు

50\. సీ. ఆ రాజు సేరి సాష్టాంగప్రణామంబు
సేసి నిల్చిన నను~ జెప్పి నిన్ను
ననఘ పుత్తెంచిన యతనిపే రెఱిఁగింపు
నిజమైన సిద్ధించు నీమనోర
థంబు బొం కగునేనిఁ దల యేడు వ్రయ్యలై
పడు దని యమ్ముని వలుకుటయును
నారదుఁ డెఱిఁగించె నాకు మి మ్మని నిజ
మాడిన సంవర్తు డాతఁ డెచట

తే. నేమి తెఱఁగున నున్నవాఁ డెఱుఁగవలయుఁ
జెప్పు మనుడు మీ తెఱఁగెల్లఁజెప్పి నన్ను
నిందుఁ బుత్తెంచు నపుడ యయ్యాద్యధర్మ
పరుఁడు సౌదఁ జొచ్చె నని చెప్పె నరవరుండు.

51\. వ. చెప్పిన నప్పరమముని యప్పుడమితేని యాననం బాలోకించి.

52\. క. నను~ గానఁగ నీ వచ్చిన
పని యెయ్యది యనిన నాన్నృపతి నాయజ్ఞం
బునకుఁ గృప మీర ఋపద
ర్శనముం జేయంగ వలయు సంయమినాథా.

53. వ. ఏను మరుత్తుం డనువాఁడ భవదీయజనకుం డుపాధ్యాయుండుగాఁ గ్రతుకర్త యైన కరంధముని పౌత్రుండ ననుటయు సంవర్తుండు సంప్రీతి నాతనితో నీవు నీకార్యంబు నాకుం జెప్పితి నాతెఱంగు వినుము మాయన్న యగు బృహస్పతి దనతపోబలంబున నన్ను నవమానించిన మదీయగృహధనాదివస్తువు లెల్లను విడిచి యిట్లు దిరిగెద ననుబోఁటి పేద నీ కుపద్రష్టయైన నయ్యేడు పెంపునుం గలదె యమ్మహాత్ము నీవు వరియింపు మట్లుగాక యేన కావలయు ననుతలంపు గలదేని.

54. ఆ. అన్న నాకు మాన్యుఁ డాతండు వనుపంగ
నాచరింతు నీదు యాగమునకు
నౌజ్జితనము వేగ ముర్వీశ యగ్గురుఁ
గని యనుజ్ఞ వడయు మనిన విభుఁడు.

55. సీ. అతనికడకు ము న్నరిగితిఁ గృపవుట్టఁ
బలికితి నతఁడు నాపలుకు సరకు
గొనక యమర్త్యయాజనము ననుష్ఠించు
నేను మర్త్యుని యొజ్జ నేల యగుదు
ననియె నాతోడి యీసున వాసవుఁడు గురు
నుడిపినకతనమునఁ గడఁగి గురుఁడు
నను ధిక్కరించె నిం కనఘ యందేమని
పోదు మీ మాహాత్మ్యమునను వాస

ఆ. వుని నతిక్రమింతు నని నమ్మి యున్నాఁడఁ
గైకొనంగవలయుఁ గరుణ వెలయ
ననిన మునియు నట్ల యయ్యెడుఁగా కని
పలికె మఱియు నానృపాలుతోడ.

56. తే. అయ్యెడుం గాక యిపుడు నీ కనుచు నీవు
సంచలించినయప్పుడు శాప మిత్తు
నీకుఁ గీడును బాటిల్లు నింత దలఁచి
సుస్థిరుండవు గావలె సుజనవర్య.

57. వ. ఏను నీయధ్వరంబున కుపదర్శనంబు సేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ బ్రద్వేషించి రోషంబు వాటింతురు దానికి నులికి నీవు సంచలించిన మదీయశాపంబునం గీడు వచ్చు నింతదలంచి సుస్థిరనిశ్చయుండవు గావలయు విచారించుకొమ్మనిన నమ్మహసీయుతో నమ్మహీనాథుండు.

:- సంవర్తుండు మరుత్తునియజ్ఞమున కుపద్రష్ట యగుట :-
సం. 14-7-23

58. సీ. నీకృప గాంచితి నాకు నింకొండు వి
చారంబు లేటికి సంయమీంద్ర
యాదివస్పతియు బృహస్పతియును నేల
పశుపతి విద్వేషపరతఁ గలఁచె
నేనియుఁ గలఁగుదునే యని పలికి మీ
సంగతి వాసిన సరసిజాప్త
చంద్రతారక కులాచలములు గల యంత
కాలంబు బుణ్యలోకములు లేక

తే. పోవు నని శపథము శుద్ధభావవృత్తిఁ
బలుకుటయు మెచ్చి యమ్మునిపతి మహేంద్రు
కంటె నిను ధనవంతునిగా నొనర్చి
క్రతువు నడపుదు నని చెప్పి ప్రముద మెసఁగ.

59. వ. మఱియు నిట్లను నెత్తెఱంగున నేను ధనవంతుండ నగుదు నంటేని వినుము హిమవంతంబునుత్తరభాగంబున ముంజవంతం బను పర్వతంబు గలదందు శివుండు శివాసహాయుండై సుర సిద్ధ గరుడ గంధర్వాది సమస్తభూతజాలంబు సేవింప విహరించుచుండు.

60. క. మరణ జరారోగము ల
గ్గిరి యేడికువులను లే వఖిలగుల్మలతా
తరువులఁ గుసుమఫలంబులు
గర మొప్పచు నుండు నెల్లకాలములందున్.

61. తే. అనగంబుపార్శ్వంబుల నరుణ కిరణ
రుచివితానంబు ననుకరించుచు వెలుంగు
శుద్ధకాంచన మయ శిలాస్థూలవాలు
కాప్రభాజాల మాశ్చర్యకారి యగుచు.

62. వ. మన మయ్యెడకుం బోయి.

63. సీ. శ్రీకంఠు రుద్రుని శివుఁ బూషదంతఘ్ను
హరునిఁ గపర్ది శంకరుని నంత
కాంతకు వరదుని నాదిదేవునిఁ ద్రిలో
చను సహస్రాక్షుని శాంతమూర్తిఁ
జీరవాసుని ధన్విసిద్ధు దండధరు మృ
గవ్యాధుఁ పక్షిషిఁ గనక బాహుఁ
బశుపతి వృష భూతపతి మాతృభక్తుని
నజు నగ్నివక్త్రుని నభవు భవుని

ఆ. భక్తిఁ బ్రస్తుతించి ప్రణతులఁ దేల్చి త
త్కరుణ వడసి పసిఁడి ద్రవ్వి తండ
ములు నృపాల పెక్కు మోపులు దెత్తము
రష్ము భారవహులఁ దెమ్ము చాల.

64. క. అని పలికి యమ్మహాత్ముఁడు
గానిపోవఁగఁ బోయి శివునకుంకితకరుణం
గనక మసంఖ్యము మోపులు
గొని వచ్చె నతండు మంచుకొండ యివులకున్.

65 వ. ఇట్లు మహాధనవంతుండై మరుత్తుండు సువర్ణ మయంబులుగా యజ్ఞ
వాటంబును భాండప్రముఖసకలక్రియా సాధనంబులును శయ్యాస
నాదులుంగావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషం బగు విభవం
బెసంగ యజనంబున కుపక్రమించుటయు బృహస్పతి యంతయు
నెఱింగి యంగంబు గృశంబై వెలరువాఱునట్టి వగం బొందిన
సంక్రందనుండు నూచి యవ్వాచస్పతి కి ట్లనియె.

66. ఆ. తెలివు వొంది యున్నదియె నీదు చిత్తంబు
సురల బ్రదుకుతెరువు లరసి నడపు
చున్నవాఁడవే సముత్సాహమున వారు
నీకుఁ బ్రియ మొనర్చి నేర్చి మఁద్రె.

67. వ. అనుటయు నాచార్యుండు సర్వంబు సంపన్నంబ యనిన ననిమిషపతి
యతనితోడ.

68. క. నీ యొడలు దప్పి వెలువెల
నై యున్నది నీకు నిట్టి యధికపు వగపుం
జేయఁగ వెఱవని నీచులఁ
జేయుదు దండితులఁ గాఁగఁ జెప్పుము వారిన్.

69. వ. అనవుడు నాచార్యుం డట్టిది లేదు మరుత్తుండు మహనీయం బగు
మఖంబొనరింప నుద్యోగించినవాఁ డతనికి మద్విరోధియగు సంవ
ర్తుండు యాజకుం డయి యది నడపు వాఁడయ్యెనని వింటి మద్వి
షాదంబునకు మూలం బిది యట్లు గా కుండం జేయవలయు నజ్జన
నాయకు నియమించి సంవర్తుని యాజకత్వంబు నవశ్యంబును మాన్చు
నది యని పలికినం బాకశాసనుండు పార్శ్వంబున నున్న యగ్నిదేవు
నాలోకించి నీవు మరుత్తు పాలికిం బొమ్మతండు క్రతుకరణంబున
కుత్సహించినవాఁడు తదీయం బగు నుపదర్శనంబు బృహస్పతి
యాచరించువాఁడుగా సంఘటించి రమ్మని నియోగించిన.

70. ఆ. అట్లు సేయువాఁడ నని యగ్ని నిజతను
స్ఫురణ మతిశయిల్ల నరుగుటయును
నల్ల మచ్చెరువున నూన మరుత్తుండు
ప్రణతి యాచరించి భక్తితోడ.

-: *అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట* :–

సం. 14-9-11

71. సీ. సంవర్తుఁ నిలిచి యాసనపాద్యముఖ్యోప
చరణముల్ నడిపించి పరిసరమున

నన్న నయ్యనలుఁ దయ్యుర్వీశ్వరుని తోడ
బలవైరి వనుప నీపాలి కనఘ
యరుగుదెంచితి దూతనైయన్న నవ్విభుం
డవ్వాసవుండు సౌఖ్యమున వెలుఁగు
చున్నాఁడె యమరసముత్కరం బతనికిఁ
బ్రియ మాచరించి వర్తించుచున్నె

ఆ. యాదరంబు గలదె నాదెస నానహ
స్రాక్షునెమ్మనంబునందు హవ్య
వాహ యనుడు నతఁడు వసుమతీ పతికి ని
ట్లనియెఁ గౌరవాన్వయాగ్రగణ్య.

72. క. సురనాథుఁడు దద్దయు సుఖి
సుర లాతనికిం బ్రియంబు సొలయక యొనరిం
తురు నీదెస నాదర మ
ప్పురుషవరున కగ్గలంబు భూపవరేణ్యా.

73. వ. నా వచ్చినపని సెప్పెద నాకర్ణింపుము.

74. క. నీజన్నమునకు ధిషణుఁడు
యాజకుఁడై మర్త్య నిన్ను నమరత్వదశా
భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి
రాజితముగ నాచరింపు క్రతు కార్యంబున్.

75. వ. ఇది యింద్రుండు నీతోడం జెప్పు మన్నకార్యం బనుటయు నవ్వసుధా
నాథుం డమ్మహాత్ము తోడ.

76. ఆ. అనఘ యేడు మ్రొక్కు లాబృహస్పతికి మ్రొ
క్కెద నతండు నన్ను నదయవృత్తి
నపహసించి తాను యాజకత్వమునకు
నెట్లుఁ జొరక యున్న నేను బోయి.

77. క. అనుజుం డతనికి ననుపెను
పొనరిన సంవర్తు భక్తి నొదఁ బిలిచి తగం

గొనివచ్చితి మత్క్రతు యా
జన మీ యోగీశ్వరుండ చాలుం జేయన్.

78. ఆ. అనిన నగ్నిదేవుఁ డమరగురుం డుప
ద్రష్ట యైన వజ్రధరుఁడు నీకు
నలఘు పుణ్యలోకములు సులభ్యములుగ
లీలఁ జేయునట్లు మేలు గాదె.

79. క. అనవుడు సంవర్తుఁడు గడుఁ
గనలి యనలుతోడ నిట్టిగతి నీ వింకా
డిన మద్దారుణ దృష్టిని
నినుఁ గాల్తున్ మగుడు మిప్పనికిఁ దిరుగకుమీ.

80. చ. అనుటయు భీతి నగ్ని యమరాధిపుపాలికిఁ బోయి యే మరు
త్తునిఁ గని నెమ్మి నీ దగుక్రతుక్రియకున్ గురు యాజకుండుగాఁ
గొను మని చెప్పితిన్ విని యకుంఠితనిశ్చయుఁ డైనయవ్విభుం
డనిమిషమంత్రికిన్ వెఱతు నాతని తమ్ముని఼ఁ గోరి తెచ్చితిన్.

81. వ. ఈ యోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుం డను పలుకు
వలికి సంవర్తుం జూపె నే నంత నిలువక పురుహూతునకుం బ్రియం
బొనరించిన నీకుం బుణ్యలోకంబులు సిద్ధించునట్లు చేసిన మే లని
తఱిమి చెప్పినను నప్పుడమితేఁ డొడంబడండ.

82. చ అన విని యింద్రుఁ డి ట్లనియె నగ్నికి నిమ్మరి వోయి చెప్పు మ
జ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁ జేయక తక్కె నేని నేఁ
బనిచెద వజ్రమున్ జమునిపాలికి నన్నర నాథు వేగమే
యనుచుట కింత యెల్లిదమె యాతనికిన్ మనయాజ్ఞ యారయన్.

83. వ. అని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి.

84. సీ. ఇంక వచ్చిన దారుణేక్షణదగ్ధుఁ గా
వింతుఁ జుమ్మీ యని విపుల కోప

మూర్తియె పలికె సంవర్తుండు గావున
వెఱతు నే నటవోవ వే ఱొకండు
పోవుఁ గా కనవుడు దేవేంద్రుఁ డన్యుల
నీవు దహింతు గా కేవిధమున
నొరులు నిన్ను దహింతురో పేదమాట యి
ట్లాడుదే యనుటయు నగ్ని వలుకు

ఆ. మూఁడు లోకములును వాఁడిమగంటిమి
నేలుచున్నవాని నెట్లు వృత్రుఁ
డాక్రమించె నిన్ను నదియును గాక ప
ర్జన్య మఱియు వినుము బ్రహ్మబలము.

85. సీ. సయ్యాతిక్రతువున నయ్యాశ్వినుల సోమ
పానంబు నీ కొదఁబాటు గాక
పాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు
వారికిఁ గా సురవర్గ సహిత
ముగ నిన్ను బాధితుండుగఁ జేసె నిజమంత్ర
బలమున దాని కీవలిగి వజ్ర
మెత్తెఱఁగొని యమ్మునీశ్వరు సాధింపఁ
గడఁగిన నగుచు బెట్టిడఁబెఁ గావె

తే. యతఁడు పుచిసెఁడు నీరనయప్పు డతనిఁ
దెలచి సోమమాశ్వినులకుఁ గలుగఁ జేసి
తరయ నెందుకు బ్రహ్మబలాతిశయముఁ
గడచి నట్టిబలంబులుఁ గిలవె యనఘ.

86. క. అనవ్వడు బ్రహ్మబలము గడు
ఘనమగు టెఱుఁగుదు మరుత్తుఁ గాఱియఁబెట్టం
జనదే నా కని శక్రుఁడు
పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్.

87. వ. పనుచునప్పు డతని కి ట్లనియె.

88. తే. నీవు వోయి మరుత్తుని నెమ్మిఁ గాంచి
గురుని నీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు
నట్లు చేయక యున్న వృత్రారి క్రోధ
దీప్తుఁడై కులిశంబుఁ బుత్తెంచు ననుము.

89. వ. ఈ మాట సంవర్తుని సన్నిధిన యాడు మని పలికిన నా ధృతరాష్ట్రుం
డియ్యకొని చని సంవర్తసహితుండై యున్న మరుత్తునిం గని తాను
గంధర్వేంద్రుఁడనియును ననిమిషపతిపంపున వచ్చితి ననియునుం జెప్పి
యప్పుడమిఱేనితో మఱియు ని ట్లనియె.

90. చ. వినుము మదీయబుద్ధి పృథివీవర యాజకుఁగాఁగ నీమఖం
బునకు బృహస్పతిం గొనుము పూర్వదిశాపతి కవ్విధంబు ప్రీ
తి నొసఁగు నట్లుసేయ కపధీరణ చేసిత యేని వజ్రముం
బనుచు నతండు నీవయి సభాసదులున్ వినఁ జాటి చెప్పితిన్.

91. సీ. అనిన మరుత్తుఁ డయ్యమరగురుండు నా
యాగంబు నడపుట కాత్మ రోసి
రాకున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి
నింక నట్టులు సేయ కెట్లు వచ్చు
ననఘ మిత్రద్రోహ మధికపాపముగాదె
యిది నీవెఱుంగు దయ్యింద్రుఁ డెఱుఁగు
సిద్ధ సాధ్యాది ప్రసిద్ధులు నెఱుఁగుదు
రిమ్మాట గురునకు నియ్యకోల

తే. యనుడు గంధర్వుఁ డదె విన నయ్యె వజ్ర
ఘోరనాదంబు నీకోర్వఁ గొలఁది యగునొ
కాదొ నీవ యెఱుంగుదు మేదినీశ
యనుటయును నృపుఁ డాలించి విని భయమున.

92. వ. సంవర్తు నాలోకించి.

93. క. కులిశము వచ్చుచునున్నది
యలు కొందెడు నా మనంబు ననఘచరిత స

భ్యులు సంత్రాసము నొందిరి
తలకొని రక్షింపవలయు దయ మ మ్మెల్లన్.

94. వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు.

95. సీ. ఇంద్రుని దెస భయం బించుకేనియు వల
దతఁడు న న్నెఱుఁగఁడే యధిప వినుము
సంస్తంభవిద్యా ప్రశ స్తవైభవమున
వజ్రంబు నతఁడు నవ్యాసవాది
దైవతంబులయాయుధంబులు నాచేతఁ
బ్రతిహతిం బొందు దుష్పవనచండ
వృష్టి ప్రముఖ మహావికృతుల బాధింతు
ననుడు ప్రమోయుచు నిదె యరుగుదెంచె

ఆ. బెదర మెవ్విధమున భీతి దొఱంగుదు
ననియె నృపతి యాతఁ డల్ల నగుచు
దాని సరకుగొనకు తగువర మడుగు నా
తపముపేర్మి నిత్తు ధరణినాథ.

96. చ. అనిన మరత్తుఁ డి ట్లనియె నాతనితో భయమెల్లఁ బాసె నే
నిను వర మర్థివేఁడెద మనీష విరోధము దక్కి యధ్వరం
బున కిట వచ్చి దైవతవిభుండు నిజోచితహవ్యభాగముం
గొనియెడు నట్లుగాఁగ మునికుంజర చిత్తమునం దలంపవే.

97. క. తమ భాగంబులు దక్కిన
యమరులునుం బ్రీతిఁగొనఁగ యాగంబు ప్రయో
గము సుప్రణీత మయి లో
క మనోజ్ఞము గాఁగ వలయుఁ గారుణ్యనిధీ.

98. క. అనుటయును మదాహ్వానం
బున నింద్రుఁడు సోమపానమున కేతెంచుం
జనుదెంతు రతనితోఁ ద
క్కిన యమరులుఁ దొడఁగు యజ్ఞకృతికి నరేంద్రా.

—: మరుత్తుని యజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట :—

సం. 14-10-19

99. వ. అని పలికి దవ్వులన యవ్వజ్రంబు వారించి గంధర్వునకు వీడుకోలు సేయించి యయ్యోగీంద్రుండు దేవేంద్రుని దేవతలనుం బిలచె నమ్మహాత్ముని మహనీయ మంత్రశక్తి నాహూతులైన యప్పురుహూతప్రభృతిబృందారకులు ప్రియంబున నరుగుదేర నమ్మునిపతి యనుజ్ఞ నజ్ఞనపతి వారల నెదుర్కొనుసు తెఱంగు నడపి తానును గూడ నడచి వారికి నర్ఘ్యపాద్యాదిపూజనంబులు విధివిహిత ప్రకారంబునం జెల్లించె నమ్మరుత్తుండును మరుత్పతికిం బ్రణమిల్లి దేవా నీవు విజయంచేసి నా జన్నంబు సఫలంబు సేసితి కృతార్థుండనైతిం గృపాధామ నామీఁది యలుక మాని నన్నుం జల్లనిచూడ్కిం జూడు మని ప్రార్థించి సంవర్తుం జూపి యిత్తాపసపతి బృహస్పతి స్వరూపంబ కావునం గ్రతుయాజకుండు గాఁ బ్రతిగ్రహించితి నని విన్నవించుటయు నని మిష నాథుండు నీవలనం బ్రీతిం బొందితి నీతం దయ్యమరగురు ననుజుండతని యట్లగుటకు సందియం దేమియనుచు వికచవదనుండై కనుంగొనిన నమ్మునివరుం డా దివిజవరున కిట్లనియె.

100. ఆ. అఖిలలోకభర్త వమరేంద్ర నీ విట్టి
యాదరమున వచ్చు టరయ నాత
పంబు ఫలముగాదె పావనమూర్తి యీ
రాజు క్రతువుఁ బుణ్యరాశి యయ్యె.

101. చ. సకలవిధానదక్షుఁడవు సర్వము నారసి చేయఁబంపు నీ
సకృప విలోకనంబులను సార్థము లై క్రతుమంత్రతంత్రముల్
వికలత లేక చెల్లు జనవిశ్రుతుఁ డీనృపుఁడున్ భవద్దయన్
సుకృతులలోనఁ బెంపు గని చూడఁ గనుం దగఁ బుణ్యలోకముల్.

102. వ. అని యిట్లు నిభృతుం డై యభివర్ణనపూర్వకంబుగా సంభాషణం బాచరించిన.

103. సీ. భూరిహర్షంబునఁ బొంది పురందరుం
డమృతాశనులఁ గలయంగఁ జూచి

యజ్ఞవాటం బుదాత్తాభిరామంబుగఁ
జేయుంపుఁ డప్సర స్త్రీజనంబు
నాట గంధర్వులపాటఁ జెల్లింపుఁడు
నావుడు వా రట్ల నడపి మఱియు
సకల కర్మములకు సాహాయ్య మాచరిం
పంగ వే ఱొకయగ్నిభంగి వెలిఁగి

తే. లసిత సముచిత పీఠ మలంకరించి
వేడ్క సంవర్తముని హవిర్విధి యొనర్ప
యాగ ముజ్జ్వలమును సుప్రయోగకంబు
నగుచు నొప్పారె భరతకులాగ్రగణ్య.

104. తే. ప్రీతి బేర్వేరఁ బిలిచి చేసేత సోమ
మమ్మహాయోగి యంది యీ నెమ్మిఁ బాన
మాచరించి సహస్రనేత్రాదు లైన
యమరు లానందమునఁ దేలి రధిపముఖ్య.

105. వ. ఇట్లు మరుత్తుండు మరుత్ప్రతికిం బరమ తృప్తి గావించి యామంత్ర
ణంబు సేయ నయ్యందఱు నభినందించి నిజనివాసంబులకుం జని
రజ్ఞనాథుండు.

106. చ. యజనము సెల్లుకాలము సమాప్తతఁ బొందిననాఁడు తద్దయ
క్కజ మగుభంగిఁ బ్రస్ఫురిత కాంచనరాసు లనేకముల్ బహు
ద్విజులకు భక్తియుక్తియును వేడుకయున్ వినయంబు నొప్ప సం
భజన పరాత్ముఁడై యొసఁగెఁ బౌరవవంశ పయోధిచంద్రమా.

107. తే అంతఁ బోవక హేమమయత్వ మహిత
యజ్ఞవాట భాండాది పదార్థములును
బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు
హిమగిరి ప్రాంతమునఁ గ్రతు వెలమిఁ జేసి.

108. వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుం డై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టి
తవసుంధరావలయంబునం బుణ్యపరత వెలయం బాలించె బ్రాహ్మ

ఋలుఁ దమ యోపినంతయుం బసిండి ద్రవ్విఁ తెండంబులు దెచ్చుకొని తక్కినదాని నచ్చట నొక్కెడ నిధిగా నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెవ్వరేనిం గని రిది యక్కనినవారి ధనంబ యని రమ్మహా కాంచన సంచయంబు గొని వచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున సకల దేవతలం దృప్తులం జేయు మనియె నట్లు వేదవ్యాస మునీశ్వరుండు సెప్పిన వచనంబులు వినియును బంధువిషయశోకంబునం గ్రమ్మఱం దలిపి నొందియు నొందక ధూమంబు వొదివిన యనలంబునుం బోలె నున్న పాండవాగ్రజుం గనుంగొని కమల నాభుండు.

109. తే. వంకయైనతలం పెల్ల వసుమతీశ
యరయ మృత్యుపదం బగు నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్యమేల
యీ ఱతాఱ తలంపుల బీఱువాఱ.

110. క. కర్మానుష్ఠానంబును
నిర్మలముగ నడపఁ బడదు నీచే వినుమో
ధర్మతనూభవ వగయును
నిర్మూలము సేయ విది మనీష గలిమియే.

111. వ. వగ నిర్మూలము సేయమి యెట్లంటేని నీ వంతశ్శత్రువు నెఱుంగవు గాదె కావున నేతద్విధయం బైన యొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము.

-: శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట :-

నం. 14-11-7

112. సీ. అవని యెల్లను వృత్రుఁ డాక్రమించి తదీయ
గుణ మగుగంధంబు గొనిన వజ్రి
వానిపై వజ్రంబు వైవఁ గ్రమంబున
నంబుతేజః పవనాంబరముల
యందుఁ బ్రవేశించి యందుల రస రూప
సంస్పర్శ శబ్దముల్ చందవిక్ర

ముం డైన యతఁడు సముద్ధతిఁ గొనఁగొనఁ
దోడ్తోడ నమ్మహేంద్రుండు గులిశ

ఆ. నిహతి వెలువరింప నిర్భరవేగుఁ డై
యతనిలోను సొచ్చె నసుర దాన
మూర్ఛ వోయె దివిజముఖ్యుండు బోధితుఁ
జేసె మంత్ర విధి వసిష్ఠుఁ డతని.

113. వ. అట్లు వసిష్ఠప్రయుక్త మంత్రశక్తిం బ్రబుద్ధుం డైన వృద్ధశ్రవుండు శరీరాంతర్గతుం డైన వృత్రు నదృశ్యుం బైన వజ్రంబున వధియించె నవ్వాసవుం డీధర్మరహస్యంబు తెఱంగు మునుల కెఱింగించె మునులు నాకుం జెప్పిరి మానవేశ్వర దీని నీవు దెలిసికొను మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు నిట్లనియె.

114. సీ. శారీరమును మానసంబును నారెండు
దెఱఁగు లై వ్యాధి వర్తించు నందు
విను వాతమును బిత్తమును సమ
త్వంబుఁ బొందిన యప్డు స్వస్థు డగు న
రుం డవి మూఁడునొక్కం డైన వికృతి నొం
దిన శరీరవ్యాధి యనఁగఁ బరఁగు
సత్త్వ రజస్తమస్సమత సుస్థితి విష
మత మనోవ్యాధి యీ ద్వితయమునకు

ఆ. నొంటి దోఁచు టెపుడు నొదవ దన్యోన్య సం
జనక జన్యభావ సత్తఁ జేసి
వికృతికాల మొకటి నొకటి దోఁచునది వా
తాదులందు గుణములందు నధిప.

115. వ. ఇది సూక్ష్మ కర్మానుష్ఠాన ప్రకారంబు దీని నీ వలవరింపవు గావునం గర్మానుష్ఠానంబును నిర్మలంబుగా నడపం బడ దంటి నని పలికి మఱియును.

116. క. వాతాదులందు గుణములు
నీతెరువునఁ దక్కువగుట యెక్కు డగుట నీ
చేతఃప్రసక్తిఁ దోఁచి నృ
పా తెలియఁగ వలయు సమత పరశాంతికినై.

117. సీ. అమ్మెయి గాక వాతాదులు సత్త్వము
ఖ్యములును దివిచినఁ గలఁగు దేని
నది నీ స్వభావ మే మనఁగల దింకను
జెప్పెద నవధాన మొప్ప వినుము
సభ కేకవస్త్ర రజస్వలఁ బాంచాలిఁ
గొని రాక మఱపు కాననములోన
నిడుములు గుడుచుట నెద్దఁ బెట్టకు జటా
సురసైంధవాదుల దురితకృతులు

తే. తలఁపకుము మాత్స్యపురమున దైన్యపడుట
బుద్ధి సేయకు భీష్మాదియుద్ధతంత్ర
మారగంగ యుద్దంబు గా దందుఁ బుట్టు
కీడు మే లేమియును జిత్తగింపకుండు.

118. వ. దాని నెట్లు యుద్ధంబు గాదనియె దంటేని నది మిథ్యాయుద్ధంబు
సత్యయుద్ధం బాకర్ణింపుము.

119. ఉ. అమ్మెయి బంధు మిత్త్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లే
దమ్మహనీయ యుద్ధమున కాత్మయ తోడు మనంబు శత్రుఁడీ
వెమ్మెయి నైన శాంతి ఘటియింపుము లోపగఁ దీర్పుమెందు శాం
తమ్మ చుమీ మనోజయము దాన వెలుంగుము శాంతబుద్ధివై.

120. తే. అంతరం బగు నిక్కయ్య మధిప గెలువ
కిట్ల యేగతిఁ బోయెదో యెఱుఁగ దీని
నీవ కనికొని సద్బుద్ధి నిశ్చయ ప్ర
వీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల.

121. వ. అని చెప్పి కౌంతేయాగ్రజునితోఁ గృష్ణుండు వెండియు ని ట్లను
రెండక్షరంబులు మృత్యువు మూఁ డక్షరంబులు బ్రహ్మం బవి
యెయ్యవి యంటేని వినుము మమ యను నవియును నమమ యను
నవియును నైయుండు భూతంబులచేతం గానం బడక యా బ్రహ్మ
మృత్యువులు పోరుచుండు.

122. క. తత్త్వ మనశ్వర మశరీ
రత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్వంబు హింసకత్వము
వాత్త్వికమై లేదు దేహ దళమున నృపా.

123. క. శరధి పరివేష్టిత క్షితిఁ
బరిపాలించినను దానిపై దృఢ మమతం
బొరయక వర్తించిన న
ప్పురుషుని దురితంబు లెట్లు పొందఁగ నేర్చున్.

124. క. వనమున వన్యాహారం
బున వర్తింపఁగఁ బదార్థములపై మమతన్
మనమున విడకుండిన న
మ్మనుజుఁడు మృత్యు ముఖవర్తి మనుజాధీశా.

125. క. వెలిపగఱగెలుపు గెలుపే
యలఘుమతిన్ గెలువవలయు నభ్యంతర శ
త్రులఁ దద్విజయము మోక్షము
నలవఱుపం జాలు నొంట నమ్మఁ గనునే.

126. క. విను మంతశ్శత్రులలో
మనుఁ దగఁ గాముఁడు నిరస్తకామం బగువ
ర్తనము విరల మధ్యయనయ
జనదానంబులును గామసహితములు గదా.

127. వ. ఇవ్విషయంబునం గామగీత లనువాక్యంబులు గలవు వాని
నాకర్ణింపుము కాముండు లోకంబు నుద్దేశించి యి ట్లనియె.

128. క. అనపాయుం డగునెవ్వం
డును నను బాధింపఁజాలఁడు ప్రయత్నము సా
ధన మగునె వేదవేద్యుం
డ నయి పరఁగుచున్న నాయెడను విహతికి నై.

129. క. ధృతి నెవ్వఁడు నన్నుం బ్రవి
హతుఁ జేయగఁజూచు భావ మగుదు నతని కే
నతఁ దది యెఱుఁగఁడు గాన వి
హతి బొం కైపోవఁగా జయము లేకుండున్.

130. క. ననుఁ దపమునఁ బ్రహరించెద
నని యెవ్వఁడు దొడఁగు నతని కాతపము ఫలం
బునదెసఁ గోరికనై యే
జనియింతుం జెఱుపఁగా వశమెయెవ్వనికిన్.

131. క. నను మోక్ష మూఁ ది చెఱిచెద
నని యెవ్వఁడు దలఁచు వానియందే మోక్షా
ర్థనమై యునికి నవధ్యుఁడ
సనాతనుఁడఁ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్.

132. క. అని యివ్విధమునఁ గాముఁడు
దనుఁ జెఱుపఁగ రామిఁ జెప్ప తలఁపొందినఁ జె
ప్పినభంగి నెచను దోఁచెను
విను మవధానమునఁ బాండవేయప్రవరా.

133. చ. పనివడి పూఁచి పట్టమి సుబంధుర ధైర్యము నిర్వహింతునే
ననుమతి సొన్నకుండుట సమగ్రతపంబున తత్క్షేచ్ఛ లే
కునికి విమోక్షతృష్ణ భర మొందమికాము నడంచుఁ గాన ని
య్యనువులు లేమి సువ్వె యనపాయత గా నతఁ డాడె భూవరా.

134. క. విను పెక్కు లేల కోరిక
మనమునఁ జొరనీకయున్న మడియుం గాముం

దనవద్య యశ్వమేధం
బొనరింపుము గోరకుండు మొక్కటియు మదిన్.

185. ఆ. అశ్వమేధ మఖమునం దట్ల యనఘ య
లోలుపత్వ గుణవిశాలబుద్ధి
శాలి వై ఫలాభిసంధి లే కక్కాము
ధర్మగాఁ బొనర్పు ధర్మతనయ.

186. క. చచ్చిన బంధులఁ గొని రా
వచ్చునె తలఁపకుము నీవు వారిం గ్రతువుల్
విచ్చలవిడిఁ జేయుము నిను
మెచ్చు జగంబు సమకూరు మీఁద సుగతియున్.

187. వ. అని యిట్లు కృష్ణుండు సెప్పెఁ బారాశర్యుండు బోధించె దేవస్థానుండు నారదుండును హితవచనంబు లుపదేశించిరి భీమాదులు నలువురును ద్రౌపదియును దగినమాటలు సెప్పిరి శాస్త్రచక్షుర్మహితు లైన మహీసురులు యోగ్యవచనంబు లుపన్యసించి రివ్విధంబున నందఱ వాక్యంబులు నాకర్ణించి శోకంబు విడిచి యాభూకాంతుండు ధరణీపాలనాధ్వర కర్మంబుల కియ్య కొని యకుచిత్వనివృత్తి కై గంగాతీరంబునఁ గొన్ని దినంబులు నిలుచు వాఁడయి మునివర్గంబునకు బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి.

188. క. మీ కారుణ్యంబున నా
శోకం బంతయును బాసె సుమనస్కృత సు
శ్లోకాత్ములార కలిగెన్
నాకున్ విచ్చేయుఁ డింక నను మఱవకుఁ డీ.

-:వ్యాస నారదాది మునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట:-
సం. 14-14-8

189. వ. అని పలికి విశేషించి వేదవ్యాస మునివరు పాదంబుల కెఱంగి తత్ప్రసాదంబునం గందువ గనిన కనకమ్ము మిమ్మునుఁ బురస్క

రించుకొనిపోయి చేకొనంగలవాఁడ నప్పటికి సన్నిధి సేయవలయు నప్పెన్నిధికి నాశ్రయం బైన హిమగిరి మహీధరంబులలోన నెల్లను బరమాశ్చర్య నిధి యని చెప్పుదురు గావున భవదీయ రక్షగానియె చుండి యందు నాపోవుటయని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ బెక్కులు కళ్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్య వంతులకుఁ గాక యిట్టివారి కారుణ్యంబు దొరకొనునె మీ కరుణయ నన్ను భాగ్యవంతుం దని తెలిపెడు నని బహుప్రకారంబులం బ్రస్తుతి సేసెనట్లామంత్రితులై యమ్మహాత్ములందఱుఁ గృష్ణార్జునామంత్ర ణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి పదంపడి భీష్మునకుం బరలోక క్రియలు ధృతరాష్ట్రసహితుండై యాచరించి కర్ణప్రభృతి కురు ప్రకరంబునకు నూర్ధ్వలోక సాంద్రసౌఖ్య సిద్ధ్యర్థంబుగా నానావిధ దాన విధులు నిర్వర్తించి కృతకృత్యుం డై కపవయ దినంబుల కచ్చోటు గదలి పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరంబున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమాద్యనుజులు మోదంబునొంద జనులు నభినందింపఁ బెంపారి వసుంధరాపరిపాలన ధురంధరుండయ్యెనని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

-:ధర్మజుఁడు ధరణిం బాలించునవుడు కృష్ణార్జునుల వర్తించు విధము:-

సం. 14-15-1

140. తే. ఇవ్విధంబున ధర్మజుం డెలమి ధరణి
పాలనము సేయఁగాఁ గృష్ణపార్థు లెట్టి
తెఱఁగువార లై యెచట వర్తించి రెఱుఁగఁ
జెప్పవే నాకు సజ్జనసేవనీయ.

141. వ. అని యడిగిన వైశంపాయనుం డి ట్లనియె.

142. సీ. ధర్మజుం డిమ్మెయి ధర్మజిఁ బాలింపంగ
ననఘ యింద్రప్రస్థమున వసించి
కృష్ణుండుఁ గ్రీడియు గ్రీడాపరత సరి
త్కాననన పర్వత సానుదేశ

ములఁ జరించుచు విప్రపూజలఁ బుణ్య క
థాశ్రవణముల సత్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దువుచ్చుచుఁ దమ పూర్వవృత్తము లైన
సమరతంత్ర ప్రముఖములఁ జెప్పి

తే. కొనుచు నుండుదు రాత్మీయతనయు నరుఁడు
దలఁచి వగచిన శోకంబు దలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణివరుఁడు దేర్చు
సముచితోక్తుల ధర్మజుశాంతి వొగడు.

143. క. విను మయకృతసభఁ గ్రొత్తగఁ
గని యచ్చో నొక్కయెడ సకౌతుకనానా
జనపరివృతు లై యుందురు
రనూనవిభవమునఁ బ్రమద మారఁగ వారల్.

144. వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో ని ట్లనియె.

145. సీ. సమరంబు ధర్మవిజయ పరికీర్త్యంబు
గాఁ జేసి భూమి నిష్కంటముగఁ
బాలించుచున్నాఁడు ప్రజ ప్రీతి నొందంగ
విద్వజ్జనంబులు వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను వినుతింప నెగడెడు
శాంతియు సమతయు సకలజనముఁ
గొనియాడు సిద్ధులు మునులు సేవింతురు
ధర్మనందనుఁ డి ట్లుదాత్తుఁ డగుటె

తే. యతని కున్నతి గావించి రనిలజుండుఁ
గవలు నెంతయు నీచేతి గాండివంబు
లీల గల్గి మహాధర్మశాలి సత్య
నిత్యుఁ డమ్మహీపతి గృతకృత్యుఁ డయ్యె

146. వ. అని యగ్గించి యతని యాననం బాలోకించి.

147. ఉ. నీవలనన్ మహాత్మ విను నిర్భరచిత్తుఁడ నైతిఁ జూతఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్రభూతగుణున్ బలదేవు వత్సలన్

దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని మద్గతరాగసాంద్ర స
ద్భావుల సర్వయాదవులఁ బార్థ ననుం దగ నన్పి పుచ్చవే.

148. క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ
గౌరవపతికిఁ దెలుంగు కార్యజ్ఞానో
దారుఁడ వగు నీ వౌచి
త్యారూఢము గాఁగఁ జెప్పు మగుసమయమునన్.

149. అట్లు గావున ధర్మరాజానుమతంబునం జనువాఁడఁ గావలయు వినుము.

150. తే. అవ్విభుఁడు వోయి వత్తుగాకనక పోను
మేనుఁ బ్రాణంబుఁ దనయులు మిత్త్రగణము
బంధులును నర్థచయము నప్పార్థివేంద్రు
సొమ్ము తదనువర్తనము వ్రతమ్ము నాకు.

151. వ. కావున.

152. క. మనము కరినగరమునకుం
జని పుణ్యాత్ముని నజాతశత్రుని నెలమిం
గని తగునవసరమున ని
ప్పని విజ్ఞాపించి యతని పనిచిన భంగిన్.

153. క. నడతము పోద మనుడుఁ గ
వ్వడి గొండొకవడి విచారవన్మానసుఁ డై
కడుమే లటు సేయుద మని
యొడఁబాటుం బలుకు పలికి యొయ్యన పిదపన్.

154. వ. అమ్మహాత్మునితో ని ట్లనియె.

155. చ. అనికిఁ దొడంగునప్పుడు మహాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి తే
మనమున వానియర్థములు మాధవ నిల్పఁగఁ జాల నైతి న
వ్వినుతవచస్సుధారసము వీనుల నింకొక మాఱు నింపవే.

156. క. అనిన నగుచు నొకకేల న
తనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధి తత్త్వవిహీనుం
డును శ్రద్ధారహితుఁడునై
తని చూచి ముకుందుఁ డిట్టు లను నాతనితోన్.

157. తే. బ్రహ్మవసవేదనమునకుఁ బరమహేతు
భూతములు నాఁటివాక్యముల్ బుద్ధిఁ దన్మ
హార్థములు నిల్పవైతి శక్యంబె యింక
నవ్వచనములు సెప్పంగ నలఘు శౌర్య.

-: శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము చేయుట :-
సం. 14-16-12

158. వ. ఏతద్విషయం బగునది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము నాకడకు నొక్క విప్రోత్తముండు వచ్చిన నేనును దత్త్వజ్ఞానంబు తెలియ నుపదేశింపవే యనుటయు నతండు కాశ్యపనామధేయుం డగు నొక్క ధరామరుం డొక్కెడ విజితేంద్రియుండును జ్ఞాన విజ్ఞాన శాలియుఁ ద్యక్త సంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగు నొక్క సిద్ధునిం గాంచి సంభృత వినయుండై శిష్యత్వంబున భక్తి నాశ్రయించిన నమ్మహాద్విజునకు నమ్మహానీయుండు సెప్పిన వాక్యంబులు సెప్పెద నవధానంబుతో వినుమని పల్కి మదీయ వదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె.

159. ఆ. అట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి
త్వాన్వితుండు నిర్మలాత్మకుండు
నతుల వినయ పరుడు నగువిప్రవరుని వీ
క్షించి యిట్టు లనియె సిద్ధవరుఁడు.

160. సీ. పుణ్యంబు లగు కర్మముల నెప్పుడును జేసి
యింపారుచుండు నైహికసుఖంబుఁ
గ్రీడించుఁ బడసితి ధీయుత యత్యంత
యత్నలబ్ధం బైన యట్టి పదము

పడపడి యొకమాత్ర భ్రంశంబు నొంది కా
మక్రోధ ముఖచిత్త మలవిశేష
ములఁ బొరిఁబొరి జన్మమును మరణంబును
గలుగంగ నేను దల్లులను దండ్రు

తే. లను సహోదరులను బుత్త్రులను ననేక
జాతికలితులఁ గాంచితిఁ జన్నుఁబాలు
వివిధభంగుల వావి ద్రావితి సుహృద్వి
యోగధననాశదుర్దశ లొందెఁ బెక్కు.

161. క. మానసశారీరము లగు
నానా వేదనల వివిధనరక గతుల దుః
ఖానేకత్వ మొనర్చు వి
మానవవధ బంధన ప్రమర్దన కృతులన్.

162. వ. అనుభవించుచు నుండి విసివి లోకమంత్రంబు పరిత్యజించితిఁ బదంపడి యాత్మ ప్రసాదంబున నిట్టి సిద్ధి వడసితివనింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గల యంత గాలంబును శుభంబ నిరంతరం బై కలుగుచుండు నే నంతకంతకు నెక్కుడు లెస్సయగు దశలన పొందుదు బ్రహ్మానందంబు సులభంబ యని పలికి మఱియును.

163. ఉ. ప్రీతుఁడ నైతి నీదెసఁ బరిస్ఫుటభంగిని జెప్ప మెద్ది నా
చేత నుపాస్తిమైఁ బడయఁ జేరితి నీ కది గల్గునట్లుగాఁ
జూతు నవశ్యమున్ వినయసుందర నన్ను నెఱింగి వచ్చి తీ
వ తెలి వస్మదీయ మతి కెక్కిన నిన్నుఁ బరిగ్రహించితిన్.

164. క. అనుడు నతఁడు హర్షించుచు
ననుఁ బరతత్త్వ ప్రబోధనమునఁ గృతార్థా
త్మునిఁ జేసి జన్మమృతి దుః
ఖనిరాస మొనర్పు పరమకారుణ్యనిధీ.

165. వ. అనుచుం దచ్చరణంబులు కరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తముతో నాసిద్ధసత్తముండు

నీకుం బరిపాటిం జెప్పెద సావధానమానసుండవై యాకర్ణింపు మని
యిట్లనియె.

166. ఆ. ధర్మసాధనంబు దనువు ధర్మము పరి
జ్ఞానదాయి యట్లు గాన తనువు
నోమవలయు మర్త్యుఁడేమిట నేమఱ
కాత్మ హితము గోరి యనఘచరిత.

167. వ. ఏమఱుటలతెఱంగు వివరించెద.

168. సీ. తన సత్త్వమును బలంబును దన కయ్యెడు
కాలంబు నారయఁగాఁ దలంపఁ
డాహారములుగొను నవియుచు నగునవి
గానివి యను వివేకంబు బుద్ధిఁ
జొనుపఁడు బహుళభోజన మొకమరిసేయు
నొకమరి దుర్నిష్ఠ నుపవసించు
గతకాలమును నపక్వంబును గురుదుష్ట
విషమ విరుద్ధము విపులరసము

తే. నైన యన్నము దా నరయక భుజించుఁ
గుడుపుపైఁ గుడుచు దిన ద్రిద గూరు సురత
పరత నొందుఁ బెల్లాయాసపడు విమూఢుఁ
డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి.

169. వ. అని చెప్పి.

-:శ్లేష్మాదిరోగవికారంబుల నిరూపించుట:-
సం. 14-17-14.

170. ఆ. అర్హకర్మలోప మవచయ మొనరించు
ననఘ దేహమున కనర్హవేగ
ధారణములు రోగతతి జనింపఁగఁజేయుఁ
గామరోషములను గాయమెడలు.

171\. క. అత్యంత ప్రబలంబులు
పైత్య వికారములు రేఁగి ప్రాణములకు శీ
ఘ్రాత్యయముం జేయు మహా
ద్ధత్యంబున నెలవు వెడల దఱిమి సుచరితా.

172\. తే. అవ్వికారంబు లెక్కుడై యదరి యెచ్చు
చెచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ
నామకంబులు మర్మ భిన్నత్వమెట్లు
సేయ కుండుఁ బరిచ్యుతి జీవమునకు.

173\. క. వినుము తెలియంగ శ్లేష్మం
బనుదోషం బారఁ బరఁగి యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జే
యును లోపలిబయలునెల్ల నొయ్యన కప్పున్.

174\. వ. పదంపడి

175\. క. కుత్తుకకు నడ్డుపడు నూ
ర్పొత్తిలి పోనీక యాఁగు నూర్ధ్వశ్వాసం
బెత్తగఁ జేయును జీవం
బత్తనువున నుండ నేర కంతట వెడలున్.

176\. క. స్రోతోమార్గంబులఁ జూ
చే తమ కర్హంబు లైన విషయంబులఁ బ్ర
స్ఫీతమతిం జాతుర్యో
పేతము లై యింద్రియంబు లేనును బట్టున్.

177\. క. స్రోతోమార్గములు గఫము
చేత నిరుద్ధంబు లైనఁ జెడు నింద్రియ జా
తాతతశక్తులు దానను
పీతము లగుఁజేష్టితములు విను మనుజులకున్.

178\. తే. వాయు పంగంబులందు దుర్వ్యాప్తిఁగదిరి
నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెఱచు

సందు లెడలించుఁ గ్రమమున నెందుఁ బరఁగి
తనువు ప్రామనుగఁ జేసి జీవుని వెలార్చు.

179. క. నాలుక యాడుట కేలుం
గాలు ముడుఁపఁ జాఁప నగుట కాయంబున యం
దీలీలలు వాయుగతుల్
మే లే నివి గలుగుఁ దక్కు మే లమలాత్మా.

180. క. ఎక్కటి యిట్టివి దోషము
లొక్కొక మరి రెండు మూఁడు నొదవి బెరయుఁదా
నక్కడు సన్నిపాతం
బక్కజముగఁ దనువుఁ బాపు నది జీవాత్మన్.

181. క. ఈవిధమున వెడలి చనిన
జీవుడు నిజకర్మజాలసిద్ధగతులకుం
బోవుం దద్భవ సుఖదుః
ఖావేశముఁ బొందు చుండు నయ్యెయెడలన్.

182. క. కృతకర్మఫలము దెగఁ దుడి
చి తనకుఁ దగి నట్టిపుట్టునెందు మగుడ ని
ట్టి తెఱంగున జీవాత్ముఁడు
గతాగతము లనుభవించుఁ గల్మషరహితా.

183. క. పాపాత్ములు నరకముఁ బు
ణ్యోపేతులు దివము విధనియుక్తి నవశతం
బ్రాపింతురు గావున ని
ర్లేపం బగు మోక్ష మొంద లేరట్టిజనుల్.

184. తే. ఊర్ధ్వగతి కేఁగుమానవు లుండునట్టి
నెలవు లార్యులు శాస్త్రము నిశ్చయమునఁ
గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ
దెలియ నట్లుగఁ జెప్పెద ధీసమగ్ర.

185. తే. సోముఁ డనఁ దారకము లన సూర్యు డనఁగఁ
గలుగు తేజస్విమూర్తుల నెలవులందు
ధర్మపరు లుండుదురు తారతమ్యములకు
మనసు లెరియునట్టివి గడు మంచి వగునె.

186. క. ఆదియును గాక ఫలంబులు
దుది ముట్టఁగఁగుడిచి వెడల ద్రోవఁ బడుదు ర
ట్టిది సౌఖ్య మగునె శాశ్వత
పదంబు మోక్షంబ కాక భవ్యవిచారా.

187. వ అని చెప్పి గర్భావాప్తి ప్రకారం బెఱింగించెద నిను మని వలికి
సిద్ధుండా భూసురున కి ట్లనియె.

188. తే. అశుభములును శుభమ్ములు నైన కర్మ
ములఫలంబులు గుడువక పోవఁగాదు
మన్యు వశగత మైనయాత్మకు నుదాత్త
చరిత యది కారణము సువ్వె జన్మమునకు.

189. క. ఎనయఁగ శుక్లము శోణిత
మును బెరసి వెలందిగర్భమున నెలకొను న
ప్పని బ్రహ్మశక్తి బీజ
త్వనిరూఢిం బొనరు నవి పొదలుఁ బిండం బై.

190. క. విను మా బీజము పిండము
తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరం
బు నురము వెన్నునను నంగముల నేర్పఱుచున్.

191. వ. అని చెప్పి

192. క. జననార్హ వేళ వెలువడి
తన తొల్లిటి కర్మములకుఁ దగిన వివిధవ
ర్తనములఁ బొందు నని దెగినఁ
జని మఱియుం బుట్టుఁ గర్మసంతతికిఁ దగన్.

193. క. నరుఁ డెంతకాల మేనిం
బరమం బగు ముక్తి పదముఁ బడయక యుండుం
బురుషవర యంతకాలముఁ
బొరిఁ బొరి నిబ్బంగిఁ జావుఁ బుట్టువు నొందున్.

194. సీ. కావున ముక్తికిఁ గారణంబు దాని
నేర్పడఁ జెప్పెద నెఱిఁగికొనుము
దానంబు శమమును దమమును బ్రహ్మ
చర్యంబును వ్రతపరిరక్షణంబు
దయయును బరధన దారవర్జనమును
నియమయమేంద్రియ నిగ్రహములు
జననీజనక గురుజన పూజలును దేవ
తాతిథి పితృ దేవతార్చనములు

తే. సత్యమును శౌచమును శుభసంవిధాన
నిరతియును ధైర్యమును గ్రౌర్యనిరసనమ్ముఁ
గలిమి పుణ్యా వృత్తం బిది గలుగునరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని మోక్షమునకు.

195. క. పదపడి ధర్మాచరణము
వొదలుం దత్సూక్ష్మవిధము బుధజనులకతం
గదలక నిలిచి యెఱిఁగికొన
విదితం బగు వారిశీలవృత్తములఁ గడున్.

196. క. వారలు చెప్పెడి శాంతో
దారవచనసమితి వినఁగఁ దద్గత బహుగం
భీరార్థము లంతఃకర
ణారూఢము లైనఁ బొరయ వాపద లెందున్.

197. సీ. వ్రతపరినిష్ఠమై వర్తించుచుండి యిం
ద్రియవిజయమును శాంతియును గలిగి
బ్రహ్మైక భజన తత్పరుఁ డగుచుండెడు
నతనికి బ్రహ్మంబు హాతవహంబు

సంస్తరంబును యోగ్యనమిధలు జలమును
మంత్రంబు గురుడు బ్రహ్మంబ యిట్టి
సచ్చరణంబు సూక్ష్మబ్రహ్మచర్యంబు
దీనియం దుత్తమస్థిరత గలుగు

తే. వాఁడు హర్షశోకోద్దామ వాయుహతుఁడు
గాఁడు మేదుర మోహాంధకారమున వె
డంగుపడఁడు సంసారనిస్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున నప్పురుషవరుఁడు.

198. వ. అని చెప్పి మఱియును.

-: తత్త్వజ్ఞాన విశేష ప్రదర్శనము :-
సం. 14-18-25.

199. సీ. ఆదిసృష్టిఁ బ్రధాన మనుతత్త్వ మంబుజా
సనుఁడు గల్పించి చేతన మొనర్చె
క్షర మండ్రు దానిఁ దత్పర మగుతత్త్వంబు
నక్షర మనియును నమృత మనియు
నార్యులు సెప్పుదు రమ్మిథునంబున
యందు సంపన్నంబు లఖిలభూత
జాలంబులకును సంజనకంబు లైన బీ
జము లివి ప్రతివాక్యసంభృతార్థ

తే. మతఁడు గలిగించె గమనము నాగమనము
జీవరాశికిఁ గావున నావిధమున
నది భ్రమించుచు నుండుఁ బుణ్యాతిశయము
కతన జీవాత్ముఁ డొకఁడు దన్ గాంచినపుడు.

200. క. విను సుఖదుఃఖము లచిరము
లనియుం దను పశుచి యనియు నఖిలపదార్థం
బును నశ్వర మనియుం గ
ర్మనిరూఢత జాడ్య మనియు మది నూహించున్.

201. క. ఊహించి తన్నుఁ గప్పెడు
మోహావేశంబు ద్రోచి మోక్షపద ప్రా
ప్తీహను సంసారాబ్ధ్యవ
గాహనముం జేయ కుండు గతకల్మషుఁ డై.

202. వ. అని పలికి వెండియు.

203. క. జనిరుగ్జరామరణములు
గని ప్రకృతివిధంబు లెన్నగా నెఱుఁగుటఁ ద
జ్జనితక్లేశమునకు విసి
వినమర్త్యులు పరమపదము వెదకుదు రనఘా

204. సీ. అట్టివా రిట్టివా రగుట మేల్ గనికొని
యజనంబుఁ బూతంబు నైనచోట
నాసీనుఁ డై హృదయంబున నొకచింత
యును లేక యూఱడి యుండి యదరి
తోఁచుతోఁపులనెల్లఁ దోఁస్తో నడంచి ని
రాలంబనుం డైన యతఁ డొకండు
సర్వమిత్త్రుండును సర్వ సహుండును
నిర్జితేంద్రియుఁడును నిర్భయుఁడును

తే. గామ కోపహీనుఁడు శమఘనుఁడు నైన
యతఁ డొకండు మఱియభిమానాపగమము
సర్వభూతాత్మ కత్వ దర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు రనఘ ముక్తి.

205. సీ. ఒలయు లాభాలాభములుఁ బ్రియద్వేషంబు
లును సుఖదుఃఖములును సమంబు
లైయుండు నెవ్వని కాసపాటును నవ
జ్ఞతయు నెందును లేక సర్వధర్మ
తంత్రలోలుండును ధర్మశీలుండుఁ గాఁ
డెవ్వఁడు గూర్చు వారొవ్వకుండు

వారని తనకు నెవ్వరును గల్గక త్రివ
ర్గేచ్ఛ యెవ్వనిచేత నీడ విడువఁ

తే. బడు నకర్మభావంబుఁ దాపత్రయాప
గమము వైరాగ్య సుస్థిరత్వమును గల్గు
నరయ నెవ్వనియందేని యతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు.

20?. క. అసమాలంబ మశబ్దము
రస గంధ స్పర్శ రూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగు వెలుఁగు న
భ్యసననియతి పరుఁ డొకండు వడయుం బుత్రా!.

207. తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ
బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పి
నతఁ డనింధనానలమునట్లఁ బొందు
వికృతివర్జిత యైననిర్వృత్తి గృతాత్మ.

208. వ. అని నిర్దేశించి యోగిజనానుభావ్యంబైన నెల వెఱింగించెద నని పలికి యోగులు దాననాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని యిట్లనియె

209. ఆ. అనఘ ముంజగర్భ మగు నిషీక నిదర్శ
నంబుగాఁగఁ గనుఁగొనంగ వలయుఁ
దనువు ముంజ మాత్మ దదిషీక నిష్కర్ష
విధము సుమ్ము యోగవిదుని నెరవు.

210. క. తనువు వలన నిష్కర్షం
బొనర్చి జీవాత్మఁ గాంచు యోగివరుం డ
య్యను వొదవి యట్లు దన్నుం
గనినప్పుడు జనన మరణ గతులం దొఱఁగున్.

211. క. ముక్తుండు జరామరణ వి
యుక్తుం డై హర్ష శోకయోగ మెడలి న

దృక్షులకును నప్పుడ మీ
శక్తుం దగుఁ జువ్వె బ్రహ్మచర్యముపేర్మిన్.

212. ఆ. ఒడలి యస్థిరత్వ మూహించి యాత్మయం
దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా
గాది దుఃఖములకు నగపడండు.

213. క. విను యోగయుక్తునకు శ
స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై
చను నవ్వికారములు లే
వనఘ యతఁడు గోరఁ డైంద్ర మగుపద మైనన్.

214. క. తనయంద తన్ను లెస్సగఁ
గనుటం గడిచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు
వినుతానుష్ఠానమునకు వినువమి వలయున్.

215. వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన.

216. క. తన యెఱిఁగినతెరువున నె
మ్మన మంతర్వర్తిఁ జేసి మఱి బాహ్యగతిం
జన నీ కుండఁగ నది యెం
దనువునఁ బడు నిలుపవలయు నచ్చట వినుమా.

217. వ. అది యె ట్లనిన.

218. తే. దంతములు జిహ్వ గుత్తుక తాలుతలము
కంఠనాళంబు హృదయంబు గణ్యచరిత
మఱియు లోపల నెచటికి మనసు మెలఁగెఁ
దాఁ గదల్చక యచటన యాఁగ వలయు.

219. వ. అని చెప్పెనని చెప్పి (నవిని) నాతో శిష్యుం డని మఱపునం బలికి
తలంచికొని కొండొక (విచారించి) నవ్వుచు నవ్విప్రుండు నామొగంబు
సూచి యచ్యుతా యాసిద్ధుం డనువాఁడ నేన కదా నీ యెఱుంగని

యదియునుం గలదె మఱియు నక్కాశ్యపనామధేయుం డడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నా యిచ్చిన విధంబును విను మని యి ట్లనియె.

220. ఆ. కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి
విశదకరుణఁ జెప్పవే మహాత్మ
పరమమోక్షకరణ పరిణతం బైన యు
దాత్మ సూక్ష్మ సుకర ధర్మ మనియె.

221. వ. అనిన నవహితుండ వై యాకర్ణింపు మని పలికి యిట్లంటి.

222 ఆ. పాలకడవ పెక్కు పసులలో డించిన
యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండునట్లు లోన నునిచినమనసు నే
మఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు

223. క. ఈ తెఱఁగు న నుద్యుక్తుం
డై తెలి వొందిన మనంబు నతులవివేక
ఖ్యాతి మరిగించి శశ్వ
ద్ద్యోతిత మగుబ్రహ్మముం జతురయోగి గనున్.

224. తే. అయ్యనాదితత్త్వము చక్షురాదికంబు
లైన యింద్రియములకు గ్రాహ్యంబు గాదు
సకల మలనిరాసాజ్య ప్రసన్నతర మ
నఃప్రదీపంబు తద్దర్శనం బొనర్చు.

225. క. కలయంగ నెల్లయెడలం
దలలును లోచనములును బదంబులు హస్తం
బులునై యాతత్త్వం బు
జ్జ్వల భంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్.

226. క. తను వేర్పరించి కేవల
మును శాంతము నైన తత్త్వమును సంతతమున్
గనుచున దన్ను నెఱుఁగం
గనుఁ జీఁకటిఁ బాపు వెలుఁగు గలుగుం బుత్త్రా.

227. వ. బ్రహ్మవిద్యా రహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీ వింక సుఖివి
గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన
నపాస్తసంశయుం డయి యా శిష్యుం డరిగె నిట నిన్ను దర్శింప
వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమ
హితం బైన యీ వాక్యసంతానంబు సమవధానంబున వినంబడియె నే
పాండవమధ్యమా నాఁడు రథస్థుండ వయిన నిన్ను నే తదీయం
బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురు
షోత్తముండు వెండియు ని ట్లనియె.

228. సీ. వ్యామిశ్రమతి యగునతనికి నకృతాత్ము
డైనవానికి నవధానరహిత
చేతస్కునకు నిది సెప్పఁ గాదేఁ దొల్లి
దెలియంగఁ జెప్పితి దేవతలకు
గాండివి నీవు దక్కఁగ నిదిమర్త్యులా
కర్ణింపఁ దగువారు గలరె యొరులు
పరమరహస్య మీ పరిపాటిదీనవ
య్యమృతవస్తువు గని యఖిలమఃఖ

ఆ. ములుఁ దొఱంగి నిత్యముక్తత వెలుఁగొందు
నరుఁడు వైశ్యు లైన నాతు లైన
శూద్రు లైనఁ గంద్రు సుమ్మె యిమ్మెయి ముక్తి
బ్రాఁతె బ్రాహ్మణులకు రాజులకును.

229. క. వినిపించితి నిను బోధం
బునకు నుపాయంబు ఫలసముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము ని
క్కానుట గడవ సుఖము లొండు గలవే యరయన్.

230. ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహసంగంబు
నీద విడిచి యెవ్వఁ డీయుపాయ
ముల భజించువాఁడు మోక్షలక్ష్మికిఁ బతి
యగు నొకింత సందియంబు వలదు.

231. క. చెప్పం గలయది యెల్లను
జెప్పితి నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లే
డిప్పాట నెలల నాటిటఁ
జొప్పడు యోగంబు నియతి శుద్ధాత్మునకున్.

232. వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిషయంబు లగు వాక్యం బులు సెప్పెనని చెప్పిన విని యన్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించి రని యడుగుటయు

233. చ. గుణసమతానుభూతిహృతికోవిదసారవివేక భవ్య చా
రణసురసిద్ధసాధ్య ఖచరప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనా కృతార్థ మునిసార్థ బహుస్తుతి వాక్య రత్న భూ
షణమహనీయఖేలన నిసర్గ కృపాకృతలోకపాలనా.

234. క. నవ్యత్వ పురాణత్వద
శావ్యపనయదుర్నిరూప సౌందర్యా వే
దవ్యాస వాక్ప్రకాశిత
దివ్యధురాధుర్య యోగిధీసత్కార్యా.

235. మాలిని. భువన భవన దీపస్ఫూర్తి తేజోవిలాసా
సవితృశశిమయత్వస్ఫారచక్షుర్వికాసా
వివిధ నిగమవిద్యా వేదసూక్ష్మప్రభాసా
పవన విజయలీలా ప్రౌఢ చేతో నివాసా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున నశ్వమేధ పర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము-ద్వితీయాశ్వాసము

శ్రీసుఖ నిష్పాదన కే
లీసక్తపదారవింద లీలాసతతా
భ్యాసవికాసిసమాధి స
మాసాదితశాంతిలోల హరిహరనాథా.

-: బ్రాహ్మణ గీతలు :-

సం. 14-20-1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. ఆ. అట్లు శౌరి పార్థు నంచితబ్రహ్మవి
ద్యాప్రబోధకంబు లైన యట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ విని
పించి యతనివలని ప్రీతిఁ జేసి.

4. వ. వెండియు నిట్లని బోధించు.

5. సీ. భర్తృభార్యాకృత భవ్యసంవాదంబు
నభయ నామకము నై యతిశయిల్లు
నట్టిది యొక యితిహాసంబు విను పార్థ
జననుతసమధికజ్ఞానవర్ధి
తాత్మకుఁ డైనమహాద్విజుఁ డొకఁడు వి
విక్తప్రదేశసేవిత్వ నిరతి
నున్నెడ నల్లి నాసన్నయై వినయంబు
భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి

తే. యాచరించి మహాత్మ యధ్యాత్మబోధ
భరితఁగాఁ జేయవే నన్నుఁ గరుణ పల్ల
వింప నని దయ పుట్టంగ వేఁడుటయును
మందహాసవిభాసి యై మగువఁ జూచి

6. క. ఈమాటకుఁ జారుముఖీ
నామది ముద మందెఁ గాన నాతికి నిది యే
లా మేటి తలం పనుత్రో
పేమియు లే దోపి వినుము హితవచనంబుల్.

7. వ. నాయెఱింగిన భంగిఁ జెప్పెద నని పలికి యయ్యతులవ్రతుం
డాపతివ్రత కిట్లనియె.

8. సీ. వినను గానను జేయ వెరవైన యవి కర్మ
ములు వానిఁ గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని చెప్పుదు రజ్ఞాన
తిమిరాంధు లై విను ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మెందేనిఁ
గలిగె నేనియును మౌర్ఖ్యముగ దాని
నిందింతు రెక్కుడునెల వది యాత్మనేఁ
గందు బ్రహ్మంబు నిష్కలత నందు

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మమం దెప్డు నడపి భూతములఁ దాల్చు
నజుఁడు మొదలుగ నక్షరోపాస్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియ జిత్త్వ మొంది.

9. వ. అక్షరంబుతెఱం గెఱింగించెద.

10. సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు
గంధంబుఁగా కున్కి కారణముగఁ
ద్వక్కున జిహ్వ నేత్రమున శ్రోత్రంబున
ఘ్రాణంబునను బరిగ్రహ విధాన

మాచరించుటకు లో నైయుండ దాతత్త్వ
మమలిన బుద్ధ్యవగమము దానిఁ
బ్రాపించుఁ బ్రాణాది పంచవాయువులును
విను దానివలన వర్తనముఁ బొందు

తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స
మాన నామకవ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱిచె.

11. క. నెలకొని ప్రాణాపానం
బులఁ బురుషుఁడు సుప్తుఁ డైనఁ బొలఁతి విలీనం
బులగు సమానవ్యానం
బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్.

12. క. విను తెలియంగ నుదానం
బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబున్
వనజనిభలోచనా పురు
షుని విడువవు యోగిజనులచూ పి ట్లుండున్.

*-: అంతర్యాగ ప్రకారంబు నిరూపించి చెప్పుట:-*
సం. 14-20-18

13. వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నీయేడును వైశ్వా నరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణుల దేహంబులం దగ్ని రూపంబున వెలుంగుచున్న యాత్ముండు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యయంబును బోద్ధ వ్యంబును నగునీ సప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నయినయీ యేడ్వురును వరుసన ఘ్రేయాదు లయిన హవిస్సు లేడింటిని వేల్చు బుత్విజు లిది సప్తహోతృ విధానప్రకారంబు వైశ్వానరువదనంబులు పదియు దిగ్వాయు సూర్య చంద్ర పృథివీ పావక శక్ర విష్ణు

ప్రజాపతి మిత్త్రాత్మకంబులు శబ్ద స్పర్శరూప రస గంధ వక్తవ్య కర్తవ్య గంతవ్య విసర్గానందంబులు హవిస్సు లీపదింటిని గ్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ వా క్పాణి పాద పాయూపస్థంబు లయిన దశేంద్రియంబు లిత్తెఱంగు దశ హోతృవిధి యీ రెంటిని నెఱింగి యిందేవిధంబున నేనియు జీవాత్ముం డుపద్రష్టగా నంతర్యాగంబు నడపుయోగిజనంబులు జననమరణ విముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనక్రమణంబులం బొందుచుండుదు రని చెప్పి వెండియు.

14. క. విను ప్రణవాదికరూప
త్వనిరోధిం బుట్టు వాక్కు దానివెనుచనున్
మనము పురుషార్థబుద్ధిం
బను పడి యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా.

15. క. విని యావిప్రునితో ని
ట్లను నయ్యేలనాగ మన మనఘ ప్రేరేపం
గ నెగయు వాక్కు తదనువ
ర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్.

16. వ. అనవుడు నతండు.

17. చ. మనసు నుదానవాయువును మానిసి కూడి వెలార్చు వాక్కు నా
త్మనివలనన్ భవద్వచనమున్ జనతానుభవంబుచొప్ప యై
నను విను కార్యముం గుఱిచినం దగ వాగనువర్తనంబు సే
యన వలసెన్ మనంబునకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్.

18. వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డి ట్లనియె.

19. క. మనసును వాక్కును మాలో
నన ఘచరిత యెక్కు డెవ్వ రని యంభోజా
సను నడిగిన నతఁ డెక్కుడు
మన మనవుడు వాణి యక్కమలభవుతోడన్.

20. వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ నన్నెట్లు తక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండు మనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీ కడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడం గలదానవు గా వని నిర్దేశించె.

21. క. విను మమ్మెయినిర్దేశం
బున నవ్వాగ్దేవి మూర్ఛ వోయినయ ట్లే
మిని బలుక కుండి పదపడి
వినయంబున నజుని శరణు వేఁడె లతాంగీ.

22. వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమి టం దేఱె నని యగిడిన బ్రాహ్మణుం డి ట్లనియె.

23. క. ప్రాణాపానంబులయెడ
వాణి నిలుచుఁ గాన ప్రాణవాయు వొదవి త
త్క్షీణత్వ ముడిపె నది గీ
ర్వాణ జ్యేష్ఠప్రభావవాసిత యగుటన్.

24. వ. ఇట్టి వని వాఙ్మనఃప్రకారంబు లెఱుంగుట మోక్షంబునకు మూలం బింకను వాణీమనస్సుల తెఱంగు సెప్పెద వినుము.

25. తే. ప్రాణుఁ బొదువుట వాణి యపానుఁ జెంది
తాను దాన భూతాత్మ యై తనువు విడిచి
వ్యానచేష్టిత సర్వసంవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు.

26. వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు.

27. సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు
దెఱఁగులు గలిగి వాగ్దేవి వరఁగు
నందఘోషిణి గరీయసి యుత్తమరసంబు
గోవుచందంబునఁ గురియుచుండు

సవ్యయరూపదివ్యప్రభావోజ్జ్వల
బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మవిధము
గనుట మహానందకర మని చెప్పి య
వ్విప్రుండు మఱియు నవ్వెలఁదితోడ

తే. వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి
యొకయధిష్ఠానమున నుండియును నెఱుంగ
వలల యొండొంటివిషయంబు నలమికొనఁగ
ననిన వివరింపు మాతెఱం గనియె నింతి.

28. వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కి ట్లనియె.

29. సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కినయాఱు
నధిగమింపఁగ నోప వధిగమించు
రసము జిహ్వయ యితరము లాపనికిఁ గావు
రూపంబుఁ జక్షుస్స యోపు నెఱుఁగఁ
జెఱయవి యెఱుగఁవు తెఱవ సంస్పర్శంబుఁ
గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ
జాలవు శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రో
త్రంబ యన్యములు దత్కారణమునకు

తే. వెరవు లేవు సంశయిత సంవేదనంబు
మనసు కృత్యంబ యిక్కార్యమునకు నొండ్లు
సొరవు నిష బుద్ధిన యగుఁ జొరఁగ నేర
వి త్తెఱంగున కపరంబు లెఱిఁగికొనుము.

-: ఇంద్రియమనః పరస్పర సంవాదప్రకారము :-
సం. 14-2[illegible]-13

30. వ. అని చెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూపయనుటయు మనస్సు వాని కి ట్లనియె.

31\. చ. చన దిటు లంట గం పెఱుఁగఁజాలదు నాసిక జిహ్వయుం జవుల్
గొన వెర వేదు రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతి గాదు సోఁ
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్పు మేనియును నే ర్పొదఁ గూడదు నేఁ దొలంగినన్.

32\. వ. నిజంబుగా నేను దొలంగితి నేని.

33\. ఆ. అప్రయోజనంబు లై యుండు నాఱిన
నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె మీస్వరూపములు గాన మనలోన
నెక్కు డేన చూవె యింత నిజము.

34\. వ. అనిన విని యింద్రియంబులు మనంబున కి ట్లనియె.

35\. సీ. ఇంతవ ట్టిట్టిద యి ట్లైనయంతన
కలుగ నేర్చునె యధికత్వ మేము
వెలి గాఁగ నీ వొకవిషయంబు నేనియు
ననుభవించితయేని నధిక మగుట
గానంగ వచ్చు మాలో నొకం డడఁగిన
ననుభవింపుము తదీయార్థ మట్లుఁ
గాక ఘ్రాణంబున గంధంబ జిహ్వ ర
సంబ చక్షువున రూపంబ వినుము

ఆ. చర్మశక్తిఁజేసి సంస్పర్శవిషయంబ
శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబ
కాని యొంట నొంటెఁ గబళింపఁ జాల వె
ట్లధికతానిరూఢి కాసపడితి.

36\. క. మును మే మాలంబించిన
వెనుకఁ గదా నీకు ననుభవింప వశం బో
మనసా నీ వెంగిలి కా
దనుమా యవ్విషయ మెక్కు డయ్యెడు మనలోన్.

37. క. నీ వడఁగిననుం బ్రాణముఁ
గావఁగ మాయందు బోధకం బగుద్రవ్యం
బావర్తింపఁగఁ జేయుట
గావించుచు నీకుఁ దెలివుఁ గనికొను మిదియున్.

38. సీ. అట్లుగా దిట్లని యనుశాసనము సేయఁ
గడునేర్చుశిష్యులకడకుఁ బోయి
వినిపింపఁ దొడఁగి యవ్వినుతార్థములు వార
లుగ్గడింపఁగఁ గనునొజ్జపోలె
మము గొని విషయోత్కరము నీవు భోగ్యంబు
గాఁ జేసికొందు నీకలలు గన్న
యప్పుడు మాలేమి నవ్విషయంబు బొం
కైన వాకిలి లేనియాలయంబుఁ

ఆ. జెంది మరలినట్లు సేడ్పాటు వొరయుదు
గాక సత్యభుక్తి గలదె నీకు
నింతవట్టు గాన్పు మేమును నీవును
గలసి పరఁగ భోగకలన గలుగు.

39. వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె
నని యప్పురుషవరుం డావరవర్ణినితో వే ఱొక్కండు విను మని
యిట్లనియె.

40. సీ. ప్రాణప్రభృతు లగుపవను లంభోరుహ
గర్భుని నొక్కనాఁ గానఁ బోయి
యెక్కుడు మాలోన నెవ్వఁ డు నావుడు
నవ్విభుం డెవ్వార లడఁగ నడఁగు
దురు పెఱవార లెవ్వరికిఁ బ్రవర్తన
మొందిన నెల్లవారును జరింతు
రధికు లందఱకును నట్టివారలు మీరు
నునుఁ డని పలికినఁ జనక నిలిచి

ఆ. ప్రాణుఁ డాదిగాఁగ బవనులందఱుఁ దమ
వలన నవ్విధంబు గలుగఁ దెలుప
నాతఁడే నెఱుంగనా యది యట్టిద
వినుఁడు మీవిశేష వృత్తిభంగి.

41. తే. ఎప్పు డెవ్వరివలన నేచొప్పు గలుగు
నపుడ వా రెక్కు డగుదు రన్యోన్యమిత్త్రి
భావమునఁ దాల్పుఁ డొండొరుఁ బవనులార
పొరిఁ బరస్పర భావనాపరుల రగుఁడు.

42. వ. ఇత్తెఱంగున మీకు భద్రం బగుం బొం డని పుచ్చె న ట్లుపదేశించిన బ్రహ్మ వాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయు విషయం బైన యది నారదదేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి కిట్లనియె.

43. తే. దేవమతుఁ డనువిప్రుఁడు దేవమునివ
రేణ్యుఁ డగునారదుని నొక్కపుణ్యభూమిఁ
గాంచి వినతుఁ డై యాతనికరుణ వడసి
భక్తిరసము పొంగారఁ దత్ప్రాంతమునకు.

44. సీ. అల్లన చన నాతఁ డాదరంబున నిందు
ర మ్ముందు మనుచు గరమునఁ జూపు
నెడ సమాసీనుఁ డై కడువినయంబున
హస్తముల్ మొగిచి దయాసమగ్ర
యొఱఁగింపు పవనంబు లేనిఁటియందును
జాయమానం బగుజంతువునకుఁ
దొలితొలి యెద్ది దాఁ దొడఁగు వర్తింపంగ
ననవుడు నారదుం డతనితోడ

తే. వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ
జొనుపు జీవునిఁ దజ్జంతుజననవేళఁ
దొలుత దాని కనంతరకలిత మైన
మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.

45. తే. పురుషునందు సమానంబుఁ బొలఁతియందు
వ్యానమును జుప్పెఁ పొడమించు వరుస ననఘ
శుక్లమునకు శోణితంబునఁ జాలు గల్గు
నయ్యుగంబును విధిచెయ్వి నమరఁ బొంద.

46. క. విను సృష్టశోణితంబునఁ
బనుగొనుశుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము
లనూనహేతువులు గా నపానుఁడు నడచున్.

47. క. చనుఁ బ్రాణుఁ డధోగతి నూ
ర్ధ్వనిరూఢి నపాఁ డివిఁధము గలయీ రెం
టను నగ్నిమయోదానం
బును వ్యానంబును సమానమును వర్తించున్.

48. ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రా
ణంబునకు నపాననామమునకు
నంతరమున వెలుఁగునాభవ్యమూర్తియు
దానరూప మండ్రు తజ్జ్ఞజనులు.

49. సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైనద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరములు దదీయ
మధ్యవర్తిత నొప్పు మహనీయ వహ్ని యు
దానంబు దానినిర్ద్వంద్వభావ
మాంతర యోగవిద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ

తే. నరయ భేదంబు లే దన్నయట్టు లుండు
నమ్మహావస్తువును నుదానాకృతియ య
నంగఁ జెవియార వినుము నలినగర్భు
చేత నని దివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.

50. వ. అని చెప్పి యింద్రియమనఃపవనంబులభంగులు గనుంగొనుట యీ తత్త్వంబులకుఁ బరమం బయినతత్త్వంబు గనుటకుఁ గతం బై యుండు నని పలికి యద్ధరామరుం డారామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె.

-: జీవాత్మస్వరూపనిరూపణప్రకారము: -

సం 14-25-3

51. సీ. కరణంబు కర్మంబు కర్త యన్నేతద్వి
రాజితకారకత్రయముచేత
నఖిలంబు సంవ్యాప్త మై యుండు ఘ్రాణాదు
లును మనంబును బుద్ధియును బ్రవరులు
కరణహేతువు లండ్రు గంధాదివిషయసం
తతియు మంతవ్యబోద్ధవ్యములును
గర్మహేతువు లగుఁ గంపు కొనఁగ నానఁ
గాన ముట్టఁగ వినఁగాఁ దలంప

తే. నిశ్చయము దగఁ జేయంగ నేర్పు లేడు
గలవు జీవాత్మునకు నవి కర్తృహేతు
భూతములు వాన విషయానుభూతి నతఁడు
దొఱఁగునిష్ఠలు మోక్షహేతువులు సుమ్ము.

52. వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుట దక్కి వివిధవిషయమూర్తు లగుహవిస్సుల నుదాసీనత్వస్రుగ్గతంబులు సేసి వేల్చునిష్ఠ నాత్మస్వరూపం బగుననలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగునేని నట్టిద బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలంబయిన యోగయజ్ఞంబునం దేను బ్రవృత్తుండనై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణదానసకలాత్ముం డగు నారాయణుండు ప్రీతుండై స్వీకరించు నద్దశ పేరు మునులు ముక్తి యని చెప్పుదు రని చెప్పి యవ్విప్రుండు వెండియు.

53. సీ. శాస్త్ర మొక్కండ తచ్ఛాసనంబునన యేఁ
జరియింతు నొక్కండ గురుఁ డతండు
సెప్పినయర్థంబు చిత్తంబులో నుంతు
శ్రోత యొక్కండ తజ్జ్ఞాతబుద్ధి
నెగడుదు నొక్కండ వగవంగ విద్వేష్ట
వాని ప్రాల్చినదిక్క ప్రాలి యెడరుఁ
గడపుదు గడవంగ గారణ మయ్యెడు
తెఱఁగు పెద్దలచేత నెఱిఁగినాఁడ

ఆ. వినుము దేవతలును మునులును బరమేష్ఠి
యొద్ద కరిగి మాకు నెద్ది హితము
యనిన నావిధాత యక్షరోపాసన
మనియెఁ గాన దుర్గ మబల కడతు.

54. వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభ
వ్యాళంబును గామదస్యుదూషితంబును నగుదుర్గంబు గడచి యొక
వనంబు ప్రవేశించితి ననిన విని యవ్వనిత యవ్వనం బెట్టి దని
యడిగిన నమ్మహీద్విజుం డిట్లనియె.

55. ఉ. అంతకుఁ జిన్నలున్ వెదక నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయ సౌఖ్య మెసలార నొనర్పఁగ నొండొకంటియం
దంతటినేర్పు లేదు వెఱ పన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్నవరుఁ జెందదు నిర్వృతి సెందు సుగ్మలీ.

56. తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమఫలము
లందుఁ గొన్నిటి కేకవర్ణాంచితంబు
లవనిజములు కొన్నిటికి నవ్యక్తవర్ణ
కములు సౌరభ్యమాధుర్యసమధికములు.

57. వ. అవ్విపినంబున.

58. క. వృక్షంబులకుం గలుగును
దీక్షాగుణములును నతిథితృప్తియుఁ బ

ద్మాక్షి యతిఘులు బ్రహ్మస
ద్వృత్తులు సౌఖ్యంపు నట్టఁ దేలుదురు మునుల్.

59. ఆ. కెలఁకులకును మింటికిని మేర లివి యన
రాదు గాన యయ్యరణ్యభూమి
వెలుఁగు లొండ్లు సొరవు వినుము క్షేత్రజ్ఞుండు
రవి దదీయసేవ భవముఁ బాచు.

60. క. మృగనయన బ్రహ్మసంభవ
మగుజలము వహించుచుండు నందుల నదులన్
నగములు విను దానఁ దప
స్విగణం బవ్యయపదంబుఁ జెందం గాంచున్.

61. వ. అట్టి దవ్విపినంబు.

62. ఆ. మాననీయనియతిమహితతపోధన
వంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్పృహతలు దలకొన సుసమాహి
తాత్ము లై వసింతు రందు సాధ్వి.

63. వ. అని చెప్పి మఱియును.

64. సీ. వినుము మూర్కొనఁ జవి గొన దర్శనస్పర్శ
నము లాచరింప వినంగ నెలయ
నేమిసంకల్పంబు నెడఁ జేర్ప నిష్టార్థ
ములను ననిష్టార్థములను గోరు
టయును నొల్లక త్రోచుటయును స్వభావకృ
త్యము లవి గనుఁగొంచు నబల వానఁ
బొరయ నెట్లన్న మేల్ దొరకొనుఁ గోరక
యును బోదు కీడు ద్రోచినను దీని

తే. నెఱిఁగి యేను స్వభావంబునెడఁ బయోజ
పత్త్రిగతజలబిందువు భంగిఁ దాల్తు
నని యెఱింగించి బ్రాహ్మణుఁ డతివతోడ
మఱియు ని ట్లను శాత్రవమథనకల్ప.

౬5. వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద
నాకర్ణింపు మధ్వర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి
యిది హింస గాదె యనిన నతండు.

66. తే. ఛాగ మిది యరయంగ నాశంబుఁ బొంద
దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁ గాని
శ్రుతులవాక్యముల్ నీ కెక్క సూనృతంబు
లగున యేని నీ వి ట్లంట యనుచితంబు

67. వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి.

68. క. భూతములు నింద్రియంబులు
నాతతగుణ యాత్మ యోనులందుఁ గలయఁ బిం
దేతరుఁ డగు జీవుఁడు సౌ
ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్.

69. క. అని పలుకుటయును యతి యి
ట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బో యి
ప్పని నీ కెవ్విధము ప్రయో
జనంబు సిద్ధించుఁ జెపుమ సమ్యక్పటితిన్.

70. వ. అనుటయు నధ్వర్యుం డతని కి ట్లనియె.

71. క. ఆగమము పశువిధిం దగ
యాగ మొనర్చినఁ ద్రివిష్టపానేకమహా
భోగాను భూతిభవ్యస
మాగమ మగు ననుట బొంకె యాగమవేదీ.

72. చ. అనవుడు హింస పాప మని యాగమవాక్యములంద కాదె యేఁ
గని యిటు లంటి నన్న యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులు గా నొనరించి వెండి యో
గనిరతిఁ బొందె దత్తెఱఁగు గా దొకొ హింస దలంచి చూడఁగన్.

73. వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డి ట్లనియె.

74. చ. పరమ తపంబు గాఢపరిపాకము నొందినఁ జిత్సుఖాత్మ కా
క్షరము నచిత్రభూతగుణజాలతనున్ క్షరమున్ వివేకితా
పరిణతిఁ బాపి చూచి యనపాయసుఖస్థితి నొందిఁ పొల్లలం
బోరయక త్రోపు హింస గొనుబుద్ధి విమూఢత గాక బోధమే.

75. చ. అనవుడు నాతఁ డార్యవచనామృత మానినవాఁడు గడు మేల్
గనుగొనఁ జాలు నేను బహుకార్యమునప్పుడు మీ రనుగ్రహిం
చినక్రియఁ జూడ నేర్తుఁ జిరచిద్విషయమున్ విభజించి దాన హిం
సనము నొకింతయుం బొరయ జన్నము సేయుదు మేలు నొందుదున్

76. క. అనుటయు నతనికి యతి యి
ట్లనుఁ బశుయజ్ఞమునకంటె నసఘ తపోయ
జ్ఞనిరూఢి మేలు గావున
వినిపింపఁ దలంచి యంటి వేయును నేలా.

77. వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొడంబడియె నని చెప్పి
యాభూసురవర్యుం డాభామినితో నీయర్థంబున కొక్కయితిహాసంబు
గల దాకర్ణింపుము సహస్రబాహుం డగునర్జునుండు దుర్జయప్రతాపం
బున నఖిలద్వీపంబులు నేలి ప్రాలి తనకు నెదురు లే కున్న విజృం
భించి పరశురాముం డొడరి యతనికి నత్యంతం బప్రియం బాచరిం
చిన నతండు బహుశాఖోపశాఖా శోభితం బయినపాదపంబు నుఖ
ముగా నఱకి పడవైచిన చందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసె
నంత నిలువకతత్పక్షంబురాజులు గూడికొని తదీయతనయులుం దారు
నారామునియసన్నిధి నతనిజనకుం డగుజమదగ్నిం జంపినం బెంపారు
కోపంబున నాటోపం బెసంగ నాజామదగ్న్యుండు రాజుల నెల్లం దర
మిడి యిరువదియొక్కమాఱు పరశుధారపాలు చేసిన నతనికిఁ బితృ
దేవతలు సన్నిధి సేసి.

78. ఆ. పరశురామ నీవు బ్రాహ్మణుండవు నరే
శ్వరులఁ జంప నేల వలవ దుడుగు
మయ్య యనుడు నాతఁ డట్లన కుండుఁ డీ
రేను రాజపశువిధానమునను.

79. క సారనియతిఁ బాటించి మ
హారోషాగ్నిపరితృప్త మగునట్టులు గా
వీరాధ్వరంబు సేసెద
వారింపక యరుగుఁ డనిన వా రాతనితోన్.

80. క. యజ్ఞంబులలోనఁ దపో
యజ్ఞం బుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము స
ర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పఁ జుమీ.

81. వ. అని చెప్పి మఱియు నిట్లనిరి తొల్లి యలర్కుం డనురాజు మన
స్స్పృష్టంబులగు నింద్రియంబుల కలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం
జూచిన ననియయ్యవనిపతితో నయ్యస్త్రంబులు దారు సెడ మని
యును రోషావేశంబునం బ్రయోగించిన నతండ చెడు ననియునుం
బలికి యోపుదేని నీతపోమయంబు లైనయస్త్రంబులు సంధిరపు
మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వానిం
దద్రూపతపఃఫలాస్త్ర సాధితంబులంజేసె నీవునుం దపంబున నంత
శ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయం
బుగాఁ గొనకుము.

82. క. అని నిష్ఠించి పలుక న
వ్వినుతచరిత్రుండు శాంతివిభవంబున నూ
నిన మనసుతోడ మునిమా
నవహాత్రం బైనతపమునన మే లొందెన్.

83. సీ. అని చెప్పి బ్రాహ్మణుం డయ్యంతి కిట్లనుఁ
దొమ్మిదిగుణములు కొమ్మ కలవు
స్తంభాభిమానహర్షంబులు సాత్త్విక
ములు క్రోధసంరంభములును శోక
మును రాజసంబులు మోహతంద్రాస్వప్న
ములు తామసము లిట్లు గలుగురిపులఁ
దునుమ నేయస్త్రంబు లను వగు వాన న
య్యంతరశత్రు చయంబు నెల్లఁ

తే. దునిమి యేసింద్రియంబుల మనము నోర్చి
శాంతి నొంది శ్రేయస్సిద్ధిసాధనం బొ
నర్చునది ముఖ్యమై రినిర్ణయము జేయు
నంబరీషగీతలు విను మంబుజాక్షి.

84. వ. అంబరీషుం డను రాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరాతుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబు పరిపాలించుచుండి యొక్కనాఁడు విద్వజ్జనంబులతో ని ట్లనియె.

85. తే. అరుల నెల్ల జయించియు నది జయంబు
గాఁ గొనక యున్నవాఁడ నగ్గలపుఁబగ జ
యింప కున్కిఁ దద్విజయవిహీనుఁ డృష్ణ
జనిజరామృత్యువశగవర్తనునిఁ జేయు.

86. క. అంతటిలోభము గెలువక
శాంతి గలదె యని తదీయశక్తి నడచి ని
శ్చింతత్వ మొంది యాభూ
కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి నడపెన్.

-: జనకునకు విప్రరూపధరుం డైన యమునితో నైన సంవాదము :-

సం. 14-32-1

87 వ. అని వెండియు నవ్విప్రుం డి ట్లను జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు తన కట్టెదుర బ్రాహ్మణుండు కొఱగామి సేసిన నతనితో నీవు నావిషయంబున వసియింపవలదు పొ మ్మనిన నతండు

88. క. నీవిషయ మెంతవ ట్టది
యే విని పరవిషయమునకు నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా
భూవల్లభుఁ డూర కుండెఁ బుణ్యచరిత్రా.

89. ఆ. ఊర కుండి మూర్ఛ నూని యొక్కింతసే
పునకుఁ దేటి యిట్టు లనియె నాదు

తాతతంత్రితరము ధరణి మద్వశ్యత
నుండ నాకు స్వస్వత యొలయ దందు.

౯౦. వ. మిథిల నెప్పుడు వసియించెద నిప్పురంబును మదీయం బని యంగీక
రింపంబడదు కావుననిది నావిషయం బన లేమింజేసి మున్ను నీతో
నాడినమాటంబుట్టినవగపెంపున మూర్ఛ వచ్చె ననిన విని యవ్విప్రుఁ
డాభూవిభునాననం బాలోకించి.

౯౧. క. నరనాయక నీయేలెడు
పురమున భూమిని మమత్వబుద్ధి గలుగ కి
ట్లైర వై యుండుటకుఁ గతం
బరయఁగ నెద్ది వినిపింపు మది విశదముగన్.

౯౨. వ. అనుటయు నజ్జనపతి యతని కి ట్లనియె.

౯౩. తే. అరయ నివి యెట్లుఁ జెడియెడునవియ కాన
వినుము మద్ధన మిది యని పినిలోన
నొకటియందు నంగీకార మొలయ దెల్ల
విషయమును నాయవియ యనువిధము గలదె.

౯౪. వ. ఎ ట్లంటేని ఘ్రాణాదులకు గోచరంబు లయినను గంధాదులు నెడం
గల యవి గావున నాయవి యనకుండుటంజేసి భూమ్యాదిభూతంబులు
నాచేత నిర్జితంబు లై మద్వశగత్వంబు నొంది యుండు.

౯౫. చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ
న్మనమున వేడ్క వుట్టి నరనాయక వచ్చితి నేను ధర్ముఁడం
బనుపదునివ్వివేకపరిపాకము గాఢనిరూఢభావ మొం
ది నిలుచుఁ గాత నీ దగుమదిన్ సతతంబును శాంతికారియై.

౯౬. వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె నని
చెప్పి యాధరణీసురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు
సేసెద నవహిత వయి యాకర్ణింపు మని పలికి యి ట్లను సంసార
వర్తనంబు వదల విడిచి యే నేకతంబ యున్నయెడ నీవు ప్రముచ్చిలి
వచ్చి మదీయవైరాగ్యంబు మాన్పఁ దలంచి నాకు నధ్యాత్మబోధంబు

గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగియు నెఱుంగని వాఁడపోలె నధ్యాత్మవిద్యా బోధకప్రకారంబు లైనవాక్యంబులు సెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కపు బ్రాహ్మణుండ నయితి బ్రహ్మచారి నయితి జీవన్ముక్తుండ నయితి మిముబోంట్లకొలఁదిగా నన్నుం జూచెద వది నాతెఱం గెఱుంగుమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి యున్నవాఁడ నాయున్న భంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధి రాజ్యంబును సరి గా వని తలంచు నాబుద్ధియ నాకు ధనంబు దారువుల నగ్ని యున్నచందబున సర్వజంతువులయందును నంతర్గత యై సిద్ధి యున్నది గురువాసగృహవాసవనవాసపరు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాప్తికిం దెరు వొక్కండ యందఱును సరిత్తులు సాగరంబుఁ బ్రాపించినతెఱంగునఁ బరతత్త్వంబు నొందుదురు బుద్ధి నిమ్మార్గంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు గర్మబంధనకరం బింత యెఱుం గుమం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నాచెప్పిన యధ్యాత్మవిద్యావిషయ వాక్యంబుల తాత్పర్యంబు చిత్తంబున నెల కొలిపి భావనానిరతవయి యుండుము నన్ను బోలెదు వెఱవకు మనినఁ బతికి సాష్టాంగదండప్రణామం బాచరించి కేలు మొగిచి.

97\. సీ. నీవు సెప్పినమహనీయవాక్యనికాయ
మతిగహనం బకృతాత్ములకును
నర్థగ్రహణశక్తి యనఘ కల్గునె కృతా
త్ముల కైన గ్రమ్మనఁ దెలియ వచ్చి
యుండ దయ్యెఱుకకు నుదయింపఁ బ ట్టైన
యట్టియుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర
నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి
దపము శ్రుతము నిర్మథన మొనర్చ

జ్ఞానవహ్ని వుట్టు మానిని యని చెప్పె
వనిత యిట్టు లనియె వల్లభునకు.

98. క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ
డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము దోఁచెన్
మనమున నతని నరణిగాఁ
గొను టవ్వస్తువు నెఱింగికొని పిదపఁ గదా.

99. వ. అనిన నతం డి ట్లనియె.

100. ఆ. అతనిఁ దోఁపఁ జేయునట్టిసాధనము లే
దింద్రియముల కందఁ డేమి లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డ
హంత లేమిఁ దోఁచుఁ గాంత కనుము.

101. వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి వొందె నని గోవిందుండు సెప్పిన గాండీవి యాబ్రాహ్మణుండును బ్రాహ్మణియు నెట్టివా రగుదురె వా రెచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన నద్దేవుం డతనియాననం బాలోకించి.

102. క. నామనమును బుద్ధియును గృ
హామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు హృషీ
కామేయమైనక్షేత్ర
జ్ఞామలవస్తువును నేన యనియె నరేంద్రా.

-: గురుశిష్యసంవాదంబు గృష్ణుం డర్జునున కెఱింగించుట :-
సం. 14-37-2

103. వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతివిశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యంబగు బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బను నితిహాసంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు నిత్తెఱంగున మేధావి యగునొక్క శిష్యుండు సంశితవ్రతుం డయిన గురు నడిగిన నగ్గురుండు బృహస్పతి

భరద్వాజభార్గవగౌతమకాశ్యపవసిష్ఠాత్రి విశ్వామిత్రప్రముఖు లగుముని
జనంబు లాంగిరసుం బురస్కరించికొని విరించికడకుం జని తచ్చర
ణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికిసుపథం బెట్టిది
వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు గృపాధురీణం
బైనచిత్తంబుతో నత్తపస్విసత్తముల కెఱింగించినతెఱంగు నీకుం
జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపు మని పలికి యి ట్లనియె.

104. ఆ. ఆదరార్ద్రు లగుచు నలరినమోముల
కాంతి వింత గాఁగఁ గమలగర్భుఁ
డాతపస్విజనుల యాననంబులు గల
యంగఁ జూచి యిట్టు లనియె వత్స.

105. తే. సత్త్వమునను భూతంబులు సంభవించు
నంద వర్తించు దానన యడఁగు నిది గు
ణత్రయాత్మకసత్త్వచరిత్ర మమల
బుద్ధులార సత్త్వంబుప్రసిద్ధి వినుఁడు.

106. క. శ్రుతి యనఁ దప మనఁగఁ బ్రజా
పతి యన సత్త్వంబునకు నపరనామంబుల్
వ్రతులార సత్త్వ మన న
న్వితతమహిమ మైనపరమవేద్యము సుండీ.

107. క. కావునఁ గామక్రోధస
మావేశము లెడల విడిచి యనవరతంబున్
సేవింతురు సత్త్వము దృఢ
భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్.

108. వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు.

109. క. చతురాశ్రమములును జరణ
చతుష్టయము గాఁగ వర్ణసముదయసంసే
వ్యత నొప్పెడుధర్మము సుం
దతులంబు శివప్రదంబు నగుపథ మరయన్.

110. వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మవిత్త్వంబు లేత
పరతత్త్వంబు నొందరామి మారుతాదిత్యేంద్ర ప్రజాపతులకును
లోనుగా నిట్టిద యధ్యాత్మదర్శనం బనం జతుర్వింశతితత్త్వావలోక
నంబుకావునఁ దత్త్వంబులు వివరించెద.

111. తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు మునీంద్రులార
మన మహంకారబుద్ధు లి ట్లొనరి ప్రకృతి
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు.

112. క. వినుఁడు ప్రభవవిలయజ్ఞా
ననిరూఢము గాఁగ వీనినైజ మఖిలముం
గనిన భవమోహ మొందఁడు
గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁ డై.

113. వ. అని నిర్దేశించి యద్దేవుండు వెండియు.

114. క. వ్యక్త మనిర్వాచ్యం బ
వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా
యుక్తము కలితగుణత్రయ
శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ.

115. క. తత్త్వాధనంబు దద్గత
చిత్సులభత్వప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణసం
పత్సారవంత మది గుణ
జిత్సువ్రతు లైనవారిచే సాధ్య మగున్.

116. సీ. సంయమివరులార సత్త్వరజస్తమో
నామరూఢములు గుణంబు లవియు
నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ
మన్యోన్యసంకలితానువృత్త
భావ మన్యోన్యోపజీవనాచరణంబు
గలిగి దుర్భేదత్వగాఢఫంగు

లై యుండుఁ దమము నియమిత మైనరజస్సుఁ
దన్నియమమున సత్త్వంబు నడచు

తే. సత్త్వ మడఁగినచోఁ దమశ్చరిత మెసఁగు
లోభశోకసమ్మోహనిద్రాభయములు
వికృతిదుర్మానమౌఢ్యపాపకృతికోప
శాఠ్యమాత్సర్యములు తమస్సర్యములు తమస్సంభవములు.

117. ఉ పాములుఁ దేళ్లనుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్లలుం
జీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలు
న్దోమలు మ్రాఁకులుం బొదలు నోవులఁ బీడలఁ బొందువారు మున్
తామసభాగు లట్ల మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్.

118. క. ఇవి తామసంబు లని గుణ
నివహములోఁ గీడు వాప నేర్చునతఁడు త
ద్వివిధవికృతినిరసనిహే
తువివేకము గలుగఁ గా నధోగతి దలఁగున్.

119. చ. బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతానముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పపుభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్.

120. చ. అవి తొలుబామునం గలుగు నట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యవినీతు లన్మతిపటిష్ఠత గల్గి త్రివర్గవర్తనం
బువెరవు నొంది యర్థములఁ బొంపిరివోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గ్రాలుచున్ మనుజభావనిరూఢతఁ బొల్చు రెంతయున్.

121. క. రాజసగుణములకుం గల
నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
దీజితములు గావింపఁగ
నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్.

122. సీ. సంతోషము సుప్రకాశత్వంబుఁ బ్రీగుమును
నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియు న
కార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబును ననసూయయును గ్రోధ
రాహిత్యమును ననసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు న
క్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంక
లితము లైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ కామార్తి లే కతులబోధ
భరితు లై యూర్ధ్వలోక వైభవము గంద్రు.

123. క. వినుఁ డాగుణంబు లన్నిటిఁ
గనికొని తత్తదనుషక్తి గలుగనివాఁ డ
ప్పనిచే భుజింపఁ గాఁ బడఁ
డనఘాత్మకులార క్రింగు నతఁ డారాశిన్.

124. వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును.

125. సీ. వేర్వేఱ యుండవు వినుఁడు గుణంబు ల
న్యోన్యసంకలితంబు లగుచుఁ బరఁగు
సంగతత్వమునన సంసారయాత్రాప్ర
వర్తనం బొనరించు వానిలోన
నెప్పుడి మిగులఁ దోఁపించెఁ దజ్జన్యంబు
లౌలయుఁ బాయుటయు నొక్కొక్కప్పుడాటు
గలుగు దమం బెఱుఁగలి యధికం బైన
స్రోత స్సధోముఖస్రుతి రజస్సు

ఆ. లెక్కఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ
బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు వీని

మును ప్రకారభేదమున నెఱింగించితి
నవియు మనస్తరంబు లనఘులార.

126. క. స్రోత స్సన జీవగమన
హేతు వగుచదశావిశేష మీగుణమునఁ దా
నీతెరువు నొందు నని కనుఁ
డాతతమతులార కరణ మగు నది స్రోవన్.

127. వ. గుణత్రయంబునుం ద్రోచుట మే లది స్రోషపడునట్టి విశ్వసృష్టత్వంబు తెకుండు నేని.

128. క. సాత్త్వికులకు దివము రజో
మత్త్వకలితవర్తనులకు మధ్యభువనవా
సత్త్వముఁ దామసులకు నీ
చత్వకరాధోజగంబు సంప్రాప్త మగున్.

129. క. ధర్మార్థకామగోచర
కర్మములకు సాత్త్వికాదికప్రకరవికా
రోర్ములు హేతువు లగు ని
ష్కర్మత కేత దవధూతి గారణము సుఁడీ

130. క. క్రమమున ప్రాణంబు నపా
నము సత్త్వంబును రజస్సు నాకుం జూడన్
యమిపరులార యుదానము
దమ మిట్టుల శ్రుతియు సువిదితంబుగఁ జెప్పున్.

131. క. జపమును దానము యజ్ఞముఁ
దపమును గర్తృజనచిత్తవశలను సత్త్వా
ద్యుపహితము లగుట నడచుం
ద్రిపథంబుల సాత్త్వికపుగతియ మే లెంచున్.

132. క. వినుఁ డెక్కువ తక్కువ లే
కనయము నెనసినగుణత్రయంబును జూరే
వినుతావ్యక్తం బనఁగాఁ
జనుతత్త్వము శివ మచలము శాశ్వత మరయన్.

183. క. సదసత్ప్రకారనిత్యం
బది దానితెఱంగెఱుంగునాతఁడు విజ్ఞా
నదశావధూతగుణుఁ డై
యదీనగతిఁ బొందఁ గను నిరామయపదమున్.

184. వ. అని యుపదేశించి వివరించి వెండియు

-:మనోబుద్ధ్యహంకారాదితత్త్వప్రకారము:-
సం. 14-40-1

185. సీ. అవ్యక్తమునను మహత్తత్త్వ ముదయించు
నది బుద్ధి మతి ధృతఖ్యాతి సంవి
దుపలబ్ధినామంబు లొంది యెందును గని
విని చని కావించి విభుత నొప్పు
దాన నహంకారతత్త్వంబునకుఁ గల్గుఁ
బ్రభవంబు వినుఁడు తద్భావితాత్మ
కం బై ప్రవర్తించుఁ గార్యనీతుఁ లోక
మఖిలంబు వర్ణత్రయప్రజనితు

తే. లధ్యయనమును వ్రతమును నధ్వరంబుఁ
దపము మొదలైనక్రియ లందుఁ దగిలి నడచు
చెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియ తెల్లమింత
జగము రంజిల్లు దానితేజంబువలన.

186. క. వినుఁ డాతత్త్వంబున సం
జనితము లగు మేదినియును జలమును దేజం
బును వాయువు నాకాశము
ననఁగ మహాభూతములు నిరతిశయమహిమన్.

187. తే. తద్గుణంబు సూరె గంధంబు రసము
రూపసంస్పర్శశబ్దముల్ రూఢభంగిఁ
బరఁగునివ్విషయముల పాల్పడ్డమనసు
గలుగుజంతువు మోహాంధకార మొందు.

138. క. దీన సకలజంతువులును
లీనము లగుచుండుఁ దమ యలీన స్మృతిధై
ర్యానూనం బగునిర్మల
మానసములఁ బొరయ నీరు మహితార్యజనుల్.

139. క. విషయంబులు నశ్వరములు
విషసన్నిభములు సమగ్ర వికృతజనకముల్
ధిషణాగుణముల నెల్లఁ గ
లుషములుగాఁ జేయు మోహలోభకరములై.

140. ఆ. మాంసశోణితాస్థిమయశరీరంబులఁ
దారు గాఁగ లగ్గ తలఁచునట్టి
కృపణజనులు వీని కీడు గానఁగ లేక
చిక్కి చెడుదు రింత నిక్కువంబు.

141. వ. పండితులు వీని చేతం జెడరని పలికి పద్మసంభవుండు వెండియు.

142. తే. అంతరాత్మ యనంగఁ బ్రాణాదిపంచ
కమును వాఙ్మనోబుద్ధులుఁ గా నిరూఢి
గలుగు నీయష్టకంబు లోకమున కెల్లఁ
దా నుపాదానకారణత్వము వహించు.

143. వ. ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిదానంబు.

144. సీ. వినుఁ దహంకారసంజనితంబు లగుచక్షు
రాదికబుద్ధీంద్రియములుఁ బాయు
ముఖ్యకర్మేంద్రియములును మనంబును
నేకాదశేంద్రియానీక మీక
డింది సందడిఁ బడి కుందక యం దెది
యింపేనిఁ దనవంక కీడ్వఁ జాలు
బుద్ధితత్త్వము గల్గుశుద్ధాత్మకుఁడు పర
తత్త్వంబు గనుటకుఁ దా వలంతి

తే. యని యెఱింగించి మఱియు నిట్లను నజుండు
స్వేద ముద్భేదమండ మస్వినఁ బుట్టు
నధమమధ్యమోత్తమదశ లైనభూత
రాసు లత్యుత్తమములు జరాయుజములు.

145. వ. భూతతారతమ్యజ్ఞానంబు మాననీయం బగుట నిట్లు సెప్పితి నధ్యా
త్మాదులం జెప్పెదఁ దద్వేదిత్వంబు విద్యామూలం బై యుండు
నవధానంబుతో వినుండు.

146. క. అంబర మాది యనిలతే
జోంబుధరలు వరుసతోడ నగుఁ జూరె ద్వితీ
యంబుఁ దృతీయంబుఁ జతు
ర్థంబును బంచమము భూతతతి యట్లుండున్.

147. వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబుల మున్నుపన్య
సించితి.

148. సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూరె శబ్దం బధి
భూతంబు దిశలు ప్రబుద్ధులార
యధిదైవతము చర్మ మధ్యాత్మ మందలి
సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు విద్యుత్తు నే
త్రంబు దా నధ్యాత్మకంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ
యధ్యాత్మకము రస మారయంగ

తే. దానియధిభూత ముడుపతి తదధిదైవ
తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మంచితాధిభూతము దదీయాధిదైవ
తంబు మారుత మంద్రుడు విద్వజ్జనములు.

149. వ. ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు.

150 సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు
కర్మేంద్రియములు సత్కర్ములార
యధ్యాత్మములు వాని కగునధిభూతముల్
గంతవ్యమును విసర్గమును శుక్ర
మును గ్రమవృత్తిమై వినుఁడు కర్తవ్యవ
క్తవ్యంబులును నధిదైవతములు
బ్రహ్మమిత్త్రి ప్రజాపతిశక్రవహ్నులు
మఱి యహంకారంబు మనసు బుద్ధి

తే. పూజితాధ్యాత్మకము లధిభూతవృత్తి
వెలయు నభిమాన మంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవతము రుద్రుఁ డమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర్ణయముతెఱఁగు.

151. ఆ. ఇట్లు దెలియ నెఱిఁగి యింద్రియంబుల నింద్రి
యార్థములను భూతసార్థమును దె
మల్చి చిట్లకుండ మనసున నొదిఁగించు
టనఘులార భవనిరాసకంబు.

152. వ. అని నిర్దేశించి నీరజాననుం డాసంయమివరులతో సూక్ష్మభావత్వ
సంపాదినియు శివయు నగునివృత్తితెఱం గెఱింగించెద ననుమాట
మున్నాడి యిట్లనియె.

153. సీ. కమఠంబు దనయంగకముల నెట్లట్లు
కామముల విద్వాంసుండు మరలఁ దివుచుఁ
గామంబుల మరల్పఁగా నోపుధీరుండు
విరజస్కుఁడై ముక్తి తెరువు గాంచు
నింద్రియంబులు పదియుండిని గుదియించు
చెక్కడువెర వది యింధనముగ
నాత్మాగ్ని వెలుఁగు భూతావలి నాత్మఁ గాం
చనహూక్ష్మతత్త్వదర్శనము గలుగు

తే. భూతపంచకజలధి రోగాతిశోక
సహితభోగలవాంశకాశ్రయము దీని
విభులు గాముండుఁ గ్రోధుండు వీరి గెల్వ
వచ్చునప్పుడ యది గడవంగ వచ్చు.

154. ఆ. మనసు మనసునంద మడఁచి యాత్మని నాత్మ
యంద కాచునట్టియతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ
గనుచు నుండు నిర్వికల్పకముగ.

155. తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
గలుగఁ జేయుప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నయ్యేలమియును బు
ధుండు గనుఁగొని భ్రమయక యుండు నొకట.

156. తే. ఆపరంజ్యోతిపేళ్లు లర్యముఁడు నరుఁడుఁ
దనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ దజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగుశబ్దములు సన్మతులు దానిఁ
బ్రయతు లయి భజియింతురు నియతులార.

157. వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మానసీయులతో మఱియు నిట్లను ధర్మంబునకు నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దం బును వాయువునకు స్పర్శంబును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును భారతికి సత్యంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయమహత్త్వ స్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు సాధుత్వంబును యోగంబునకుఁ బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణం బులు లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు.

158. ఆ. జ్ఞానపూర్వమైన సన్న్యాసకలనంబు
పరమగతి నొసర్చు భవ్యులార

ద్వంద్వరహితుఁ డైనతని జరామృత్యుని
స్తరణ కరణ మైనధర్మ మొందు.

-:అవ్యక్తనామతత్త్వనిరూపణప్రకారము:-
సం. 14-48-34

159 సీ. అవ్యక్తనామకం బగుతత్త్వ మరయ స
లింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు
క్షేత్రంబు నెఱుఁగుట క్షేత్రజ్ఞుఁ డనఁ జను
క్షేత్రంబు నాఁగఁ బ్రకృతి యనంగ
నవ్యక్తమునకు నామాంతరంబులు గుణ
ప్రభవ మాతత్త్వ మాప్రభువు గుణము
లెఱుఁగవు చేతనాహీనముల్ గాన య
య్యంతరాత్ముఁడు దత్క్రియాప్రపంచ

ఆ. మెఱుఁగు నిట్టు లగుట యెఱిఁగి గుణమ్ముల
విడిచి నిలిచి తత్త్వవేది యంత
రాత్మవేశమునన నచలనిరామయా
వ్యయపదంబు నందు ననఘులార.

160. వ. అని వెండియు.

161. సీ. జ్యోతిస్సులందు వర్యుఁడు రవి భూతంబు
లం దగ్ని వరుఁడు విద్యలఁ బ్రధాన
సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి
ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ
మనిలచయమ్మునఁ బ్రాణ మగ్ర్యము ఛంద
ములకు గాయత్రి యగ్గలము పశువు
లకు మేటి యజ మఖిలచతుష్పదములకు
ధేనువు మిక్కిలి మానవులకు

తే. బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు
శ్యేన మధికంబు యజ్ఞవిధానముల హు

తంబు పెద్ద యుగముల గృతంబు మేలు
ధాతువర్గము లోన నుత్తమము పసిఁడి.

182\. సీ. యవ లోషధులలోన నన్నంబు భక్ష్యభో
జ్యములందు జలము పేయములలోన
నమరాచలము పర్వతములలోఁ బ్లక్షంబు
దరువులలోన నూర్ధ్వంబు దిశల
జాహ్నవి నదులందు సాగరంబు సరస్సు
లందు గృహస్థత్వ మాశ్రమముల
నెక్కు డారయ నెక్కు డేను బ్రజాపతు
లం దచింత్యాత్మకుం డైనయట్టి

తే. విష్ణుఁ డెక్కుడు నాకంటె వినుఁడు తెలియ
నీశ్వరుఁడు దేవతాకలి కెల్ల నెక్కు
డతఁడు నా నే ననఁగ విష్ణుఁ డనఁగ వస్తు
వొకఁడ మూర్తిత్రయంబున నుల్లసిల్లు.

183\. క. నెఱయఁ బ్రధానపదార్థము
లెఱుఁగుట పరిబోధమూల మెఱుకల కెల్లన్
మెఱుఁ గిడుట మమ్ము ముప్పుర
గుఱుకొని యొకఁడుగ నెఱింగికొనుట దలంపన్

184\. క. దివసము రాత్రియునుం బోరిఁ
బ్రవర్తనముఁ బొందుచుండు పగిదిని సుఖసం
భవదుఃఖజననములు జం
తువులకుఁ గలుగు వలె నుబ్బు దురపిల్లంగన్.

185\. తే. పొదలఁ దఱుఁగుటకై పొడ వొదవుఁ బడుట
కై కదమ జేరుఁ బాయుటకై జనించుఁ
బొలియుటకు నై సుఖంబును బొందు దుఃఖ
మందుటకు నై పదార్థము లఖిలములును.

186\. క. జ్ఞానము సవిశేషస్థితి
దానికి నాశంబు లేదు దానిఁ దెలియుటన్

మానాహంకృతిమమతలు
మానిననిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్.

167. వ. అని వివరించి విరించి యాసమంచితాచారులతోడ నాశ్రమప్రకారంబు
లెఱింగించెద నని పలికి యిట్లని యుపన్యసించె.

168. సీ. గురునకుఁ బ్రియహితకరుఁ డయి వేదాధ్య
యన మొనరించుచు నశన మమల
భిక్ష నొనర్చుచు బిల్వపలాశదం
డములలో నొకటి ధార్యముగఁ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును
నియమితేంద్రియుఁడును నిత్యశుచియు
యజ్ఞోపవీతియు నబహుభాషియు మేఖ
లాఢ్యుండు నై శయనాసనప్ర

తే. చార విధములు సముచితా చరితములుగ
సత్యధర్మనిరూఢుఁ డై శాంతి గలిగి
వేల్మి యిరుప్రొద్దు నడపుచుఁ గల్మషంపుఁ
జనుల కెలయక వర్తించు బ్రహ్మచారి.

169. సీ. అర్థప్రకారసమావర్తనుం డయి
నిజదార నిరతుండు నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నటిశిశి
ష్టాశియు శుక్లవస్త్రాన్వితుండు
శక్త్యనుగుణదానశాలియు నచపలేం
ద్రియుఁడును శుచియు మైత్రీపరుండు
స్వాధ్యాయశీలుండు సద్వ్రతనిష్ఠుండు
నై యాజనంబు నధ్యాపనంబు

ఆ. శక్యమైనఁ జల్పి క్షమ గల్గి సత్ప్రతి
గ్రహ మొనర్చి మిత్రు లహితు లనక
మాటకార్యమునను మధ్యస్థుఁడై గృహ
స్థుండు నడచు దురితదూరుఁ డగుచు.

170. సీ. గ్రామంబు దొఱఁగి యరణ్యస్థలంబునఁ
పర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండుసంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కల మంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి

తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను
భక్తి నాత్మీయములలోనఁ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁడై యన్నియింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు.

171. క. ఈమూఁడాశ్రమములలో
నేమిట వర్తించువార లేనియు ముక్తిం
గామించినఁ జొర నగు వి
ద్యామూలాధార మైనయత్యాశ్రమమున్.

172. సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి య
తీతవస్తువులఁ జింతింప కెన్న
నాగతంబులమీఁద నాస సేయక వర్త
మానలబ్ధము లుపేక్షానిరూఢిఁ
గూర్చు చంగంబులఁ గూర్మి మెట్లట్టి యిం
ద్రియములలోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షాచర్య దొరకొన్న
యంతన నిజదేహయాత్ర నడపి

తే. గ్రాస మాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ
డర్థి నెయ్యది యిచ్చిన నంద కేక
వారభోజి యగుచు నమస్కారసఖ్య
నుతినిరాకృతి సహితుఁడై యతి వెలుంగు.

173. క. అనసూయయు నక్రోధంబును
దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం
బును సత్యంబు నపైశున
ము నహింసయుఁ జూరె యతికి ముఖ్యవ్రతముల్.

174. తే. వృక్షమూలనదీతీరవిజననిలయ
విపినగిరిగుహానిత్యవివిక్తదేవ
సదనవాసి యై కౌటిల్య సాధ్యవస్తు
సంచయనము లుడిగి యతి సంచరించు.

175. క. తనమేలు ప్రకాశింపక
తనుఁ గనుఁ గొనునట్టిజను లుదాసీనతమై
నునికికిఁ దగియెడుచందం
బున వర్తించుయతి సర్వముక్తత నొందున్.

176. వ. అని యెఱింగించి మఱియును.

177. సీ. సన్న్యాస మనఁ దపశ్చరణంబుపేరు త
త్త్వోజ్ఞాన యుక్తి ప్రబుద్ధు లైన
జనము లచింత్యం బజర మమృతంబు నా
వెలుఁగుతత్త్వము గంద్రు పీతతామ
సము నవధూతరాజసము నై శుద్ధస
త్త్వాశ్రయం బగుహృదయంబు గలుగు
వారు తపోవృత్తివలన సుక్షేమమా
ర్గంబున నడతు రేకత్వశోభి
తే. మహితనానాత్వ మనఁగ సమస్తభూత
సముదయస్థ మైయున్నతత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోచుఁ నవ్విధంబు
గలుగుబుధుఁడు నిర్ద్వంద్వుఁ డై కాంచుముక్తి.

178. వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహా
భూతోపశాఖంబును నింద్రియకోటరంబును సంతతాశాపల్లవంబును
శుభాశుభఫలంబును నై సంసారవృక్షం బొప్పుచుండు.

179\. క. జ్ఞానాసి నది నఱకి యభి
మానాహంకారమతి యగుపురుషుం
డానందము ప్రస్ఫుటముగఁ
గానంగా నేర్చు విగతకల్మషులారా.

180\. ఆ. నిమిష మైనఁ బరమనియతి నాత్మని నాత్మ
యంద కనినఁ దెలివి నారఁ బడసి
బోధమహితమునులపొందు నవ్యయగతిఁ
బొందఁ గంద్రు ప్రకృతిపొందు దొఱఁగి.

181\. ఆ. పరమనియతి యనఁగఁ బ్రాణసంయమనంబు
నది క్రమాభివృద్ధి నలవరింపఁ
గాఁ బ్రసాదసిద్ధి గలిమి ధ్రువం బవ్వి
శేషకలన మిష్టసిద్ధిఁ జేర్చు.

182\. క. అవ్యక్తతత్త్వజాతము
భవ్యము సత్త్వంబు దురితపంకహరం బై
యవ్యయ మమృత మనింద్రియ
భావ్యం బగుతత్త్వ మొందఁ బ్రాఁకగుఁ జుండీ.

183\. వ. కావున.

184\. తే. సత్త్వధావనకంటెఁ బ్రశస్త మైన
కృత్య మరయంగ లే దంద్రు నిత్యవస్తు
సమ్యగధిగమసిద్ధికి సంయమప్ర
సిద్ధు లాగమతంత్ర ప్ర[illegible]కార.

185\. క. వినుఁడీ సత్త్వస్థుఁ బురుషుఁ
గనుఁగొను దనుమానకలనఁ గాని మదిం ద
క్కిన తెఱఁ గేమిట నైనం
గనుఁగొనియెద మనుట వెరవు గా కుండుఁ జుండీ.

186\. సీ. ఇట్లగు చెట్లనియెద రేని సత్త్వంబు
సంతోషమును నహింసయును ధృతియు

క్షమయు నార్జవమును సన్న్యాసమును బరి
త్యాగంబు విజ్ఞానయోగదశయు
సాత్త్వికంబులు గాన తత్త్వవిజ్ఞనము లీ
యనుమానమునఁ బురుషాధిగమముఁ
బడయుట యొప్పడుపద మంద్రు (త)సత్త్వంబుఁ
బురుషుండు నొకఁ డనుబుద్ధి గొంద

తే. జార్యు లూఁదుదు ర ట్లేల యగు నుదుంబ
రమున మశకమ్ము వారి మీనము వసించు
నట్లు సత్త్వంబునం దంతరాత్ముఁ డుండుఁ
గాక యనియెడివారు పెక్కండ్రు గలరు.

187. వ. అనిన విని యమ్మును లమ్మహాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు
వీనిలో నెవ్వం డెయ్యది యవలంబించె నదియు వాఁడు మేలను నే
మన్నింటిమీఁదనుం బరఁగినబుద్ధులు గలిగి యనిశ్చయదర్శనుల మయి
యుండుదు మిది ప్రధానానుష్ఠేయం బని యుపదేశింప వలయు
సత్త్వపురుష సంబంధ ప్రకారంబును బ్రస్ఫుటంబుగా నెఱింగింపు
మనుటయు వారికి వారిజాసనుం డిట్లనియె.

-:సత్త్వంబవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట:-

సం. 14-47-2

188. సీ. సకలధర్మములలో సర్వభూతాహింస
మేటి యహింసాసమేతుఁ డైన
వానికి నుత్తమజ్ఞానోదయం బగు
నది మోక్ష మొనరించు ననఘులార
కోరికమెయిఁ గర్మకారి యయ్యెడువాఁడు
వొందు గతాగతంబులు ఫలాభి
లాషంబు లేక నిర్దోషత మే లాచ
రించిన ముక్తి సిద్ధించు వినుఁడు

తే. విషయి పురుషుండు సత్త్వంబు విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధమునఁ బొసంగి

యుండియును బద్మపత్త్రిపయోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ బొరయ కుండు.

189. క. సత్త్వము ప్రదీప మాపర
తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా
తత్త్వము వదలక చిత్తసు
ఖత్వాకలిత మగునెలవు గంద్రు కృతాత్మల్.

190. చ. అది సదుపాయ మెందును నుపాయసమగ్రత లేమి సేర్పద
భ్యుదయము దూరమార్గమునఁ బొందెడుభద్రము వాహనాఢ్యుఁడున్
నది నెఱి నుత్తరించి కనునందము నౌసహితుండుఁ గాంచునో
ప్పిదము వినాధనుం డయిన బే లెటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా.

191. ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యెఱిఁగియేనియును నె
ఱుంగ లేని బలిమి ఱొమ్ము గడిగి
చేయుపని ఫలంబు సిద్ధింప కుండుట
కొలఁదిఁ బోక దుఃఖములును గలుగు.

192. క. స్థలపథమునఁ బోతమ్ము
స్థలమార్గమునందు వాహనము వినియోజ్యం
బులు గా విమ్మెయి సాధన
కలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితముల్.

193. వ. అని చెప్పి.

194. తే. తదినిఁ దగ నుత్తరించునంతకును బోత
మాదరించి తక్కొల్లనియట్లు పురుషు
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మూఁది పిదపఁ దత్సంబధ ముడుగుఁ దనియె.

195. వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబు గుణంబు మహత్త్వంబు
మహత్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతం
బులు మహాభూతగుణంబులు శబ్దాదులం దాకాశంబునకు శబ్దంబు
గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు గుణంబులు దేజస్సునకు

శబ్దస్పర్శరూపంబులు జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు గుణం
బులు పృథివికి శబ్దస్పర్శ రూపరసగంధంబులు గుణంబులు శబ్దంబు
మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగి యుండు స్పర్శంబు శీతోష్ణ
ముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణప్రభృతినానా
విధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రచురభంగుల నడచు
గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేక విధంబుల వర్తించు నిట్లు పెక్కు
చందంబులం జెల్లువిషయంబులతెఱం గెఱుంగుట వానిఁ దొఱంగుటకుం
దోడ్పడం జాలు నని చెప్పి వెండియు.

196. ఆ. భూమిముఖచతుష్కమునకంటె దివి యహం
కారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు
డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ.

197. క. భూతములతారతమ్యము
చేతోగత మైనయట్టిశిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ గని ని
రాతంకావ్యయపదంబు ప్రాపింపఁ గనున్.

198. సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ
జాలుదక్షత వాని నేలు ప్రభుతఁ
దనరుమనంబు రథ్యముల సారథి యెట్టు
లట్లింద్రియంబుల నాఁగ నడప
నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి
సన్నాహమును మనస్సారథికము
నింద్రియాశ్వము నైనయీాద్యరథంబున
నభిమతగతి నంతరాత్ముఁ డెందు

తే. నెలమి వర్తించు నట్లగు టెఱుఁగుబుధుఁడు
ఘోరసంసారమోహవాగురకు లోను
గాక నిర్గుణపథమునఁ గ్రాలి కను ని
రామయము నవ్యయంబును నగుపదంబు.

199. వ. అని పలికి మఱియును.

200. క. శరనిధితరంగభంగిం
బొరిఁబొరి నవ్యక్తమునన పుట్టు నడంగున్
సురనరధరణీరుహముఖ
చరాచరానేకభూతజాలము లెల్లన్.

201. క. అవ్యక్తాదికసకలము
నవ్యయుఁ డగుపురుషుఁ డాశ్రయంబుగఁ బరఁగన్
సువ్యక్తంబుగ నిది గను
భవ్యులు వడయుదురు మోహబంధవిముక్తిన్.

202. క. వినుఁ దక్కనుటకు మూలం
బనఘుం బగుతపము యగుట నతినిష్ఠఁ దపో
ధనసమ్యగ్విధసముపా
ర్జనం బవశ్యంబు వలయు సన్మతులారా.

203. సీ. భూరితపంబునఁ జూరె ప్రజాపతుల్
బహువిధసృష్టినిర్వహణనిపుణు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప
మాదరంబునఁ జేసి కాదె మునులు
కాలత్రయంబు లోకత్రితయంబును
గాంతురు విద్యల గౌరవంబు
లొదవుఁ దపంబున నొండువిధంబునఁ
బడయంగ రాని యెక్కుడుపదంబు

తే. లచ్చ మైనతపంబున వచ్చుఁ బడయ
బ్రహ్మవధ మద్యపానాదిపాతకంబు
లెల్లఁ బాయుఁ దపఃకృతి నిద్ధతపము
పేర్మి సర్వభూతంబులుఁ బ్రీతిఁ బొందు.

204. క. మమతాహంకృతిరహితత
పమునఁ బ్రజాపతిసమీపభవ్యపదము సం

యమి వొందు నిందు సందే
మొకింతయు లేదు నిర్మలాత్మకులారా.

205. క. మమతాహంకారవిము
క్తము శుద్ధము నైనయచలితధ్యానముతో
సమవేతం బగుతపమున
యమి గను సకలోత్తరావ్యయపదప్రాప్తిన్.

206. వ. అని చెప్పి వెండియు.

207. క. తమము రజస్సుఁ దొఱఁగి స
త్త్వమునన రమియించి యగుణతత్త్వము గని స
త్త్వమును దిగ విడుచువైరా
గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా.

208. క. పరమం బనంగ వేదాం
తరహస్యాత్మత వెలుంగుతత్త్వము నిక్కం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను
పరిణతి గలయతఁడు సర్వపదవిదుఁడు సుఁడీ.

209. క. వృత్తివిశేషమునఁ జనిన
చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి
యుత్తమపురహస్య మండ్రు యోగమున మునుల్.

210. క. వినుఁ డవ్యక్తాంతం బగు
పనియెల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడినమృత్యు వమృతం
బనఁ జను నది నిర్మమత్వ మారఁ గలిగినన్.

211. సీ. కర్మముల్ మే లండ్రు కర్మతత్పరులు బు
ద్ధాత్ములు వ్యేదపర్వత నుతింతు
రవి షోడశవికార యగుమూర్తిఁ గల్పించు
నది నిత్యుఁ డగ్రాహ్యు డన వెలుంగు

పురుషునిఁ దోఁపించు నరయంగఁ గర్మము
యత్నంబు లేమి విద్యామయత్వ
మతనికి నైజమై యతిశయిల్లుట శ్రుతి
సాటు నిత్తెఱఁగు సుజ్ఞాన మేమః

తే. హాత్మునకుఁ గల్గి యుండు నయ్యార్యవర్యుఁ
డఖిలసంకల్పములఁ బాచి యాత్మ నాత్మ
యంద కాంచి యనామయ మజర మమృత
మనుపదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార.

212. వ. అని యిట్లు కమలగర్భుండు.

213. క. జ్ఞానపరి నిష్ఠితాత్మకు
లైనవిముక్తి పదనిర్ణ యజ్ఞులచే స
మ్మానిత యగుగతి యిది క
ర్మాను గతివిరక్తజనసమంచితము సుఁడీ.

214. వ. అని నిర్దేశించి వెండియు.

215. క. కోరికలకుఁ జొరక యసం
గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల
సారాత్మకు లిపథమునఁ జనుటకు శక్తుల్.

216. క. చెప్పితి సర్వంబును నీ
చొప్పున నడవుఁ డెడ నొండు సొర నీకుఁడు మీ
రొప్పెడుతెరు విది దీనం
దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా.

217. క. అని యిట్లు కమలగర్భుఁడు
మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా
రనవద్యసమాధికులై
యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా.

218. వ. అని పలికి గురుం డాశిష్యునితోడ.

219. క. నీవును నివ్వాక్యంబులు
భావంబున నెలవుకొలిపి పరమసమాధి
శ్రీ వాటింపుము నిత్యప
దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్.

220. క. అని గురుఁడు ప్రబోధించిన
మనమునఁ దెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం
డనామయం బజర మమృత మనియెడిపదమున్.

221. చ. అని వసుదేవసూనుఁడు సమాచరమేదురచిత్తవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లముల పెం పిటు లుండునె వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచి నవ్వుచున్

222. క. అనఘ విను మే గురుఁడ నా
మనంబు శిష్యుండు విమలమానస నీపైఁ
బనుపడుప్రీతిం జెప్పితి
ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్.

223. క. విమలము నచలము నగు
చిత్తము నాదెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యా
త్మము ననుసంధింపు పాసెదవు దురితములన్.

224. క. సమరమునప్పుడు నీ కీ
యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత
రమింపు మిం దెపుడు శమధురాధుర్యుఁడ వై.

225. వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ
బరమ గురుండును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు
నెవ్విధంబునం బ్రవర్తించి రాకర్ణించుకౌతుకం బు నామనంబున నెసకం
బెసంగెడు మునీంద్రా యెఱింగింపవే యని యడుగుటయు.

226. చ. పరమదయావిధేయ పరిపాలితవేదకలాప పక్వని
ర్భరశమసూక్ష్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితాపవిత్రపదతామరసస్మరణా పరావర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాకనందితా.

227. క. వినుతచతుర్వర్ణకసం
జనకముఖభుజోరుపాదసంవిదభేదా
మునిహృత్కమలమరాళా
జననమరణహరణచరణసరసిజలీలా.

228. మాలిని. పదనమదమరాళీ భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ మాన్యయోగప్రతోషీ
సదవనపరచిత్తా సర్వనిర్మాణవేత్తా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధ పర్వంబునందు ద్వితీయాశ్వాసము.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము-తృతీయాశ్వాసము

శ్రీనగసుతాత్వమహితవి
ధానుతశశ్వల్లసల్లతావేష్టనహే
లా నిత్యశాద్వలతరు
త్వానుగుణఫలప్రదత్వ హరిహరనాథా.

*-:తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట:-*

సం. 14-50-49

2\. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యావిశారదుం జేసి శౌరి యతనితోడ.

3\. క. నాచిత్తము వసుదేవునిఁ
జూచుట గోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొనర్చుట
వేచినయది నన్నుఁ బుచ్చవే ద్వారకకున్.

4\. చ. అనవుఁడు నక్కిరీటి దగ నయ్యదువంశరేణ్యుతోడ ని
ట్లను నటు లేనిఁ బోవలయు హస్తిపురంబున కిత్తెఱంగు సె
ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పి పుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా.

5\. వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్పు మని నియోగించెఁ దదనంతరంబ ధనంజయుండు దమతోడం జనుదేరం దగుపరివారంబు సమకట్టం బడవాళ్లం బనిచె నొక్కింతసేపునకు దారుకుండునుందే రాయితంబు సేసి తేరం బడవాళ్లనుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితులం జేయ నాకృష్ణార్జునులు ప్రయా

జోచితాలంకారాలంకృతులై రథంబెక్కి కరినగరంబుపథంబు గైకొని చనుసమయంబున.

6. సీ. వినయ మారంగ గోవిందున కిట్లను
గాండీవి దేవ నీకరుణఁ జేసి
కౌరవసైన్యసాగర ముత్తరింపంగఁ
గంటిమి గురుభీష్మకర్ణముఖ్య
దుర్జయవీరుల నిర్జించితిమి నీవు
శాత్రవయోధుల సమయఁ జేయ
వెనుక నేము జయంబు గొనుచు వచ్చితిమి తే
జంబును బేరు సౌఖ్యంబు సతుల

తే. మైనభవదీయసుప్రసాదాతిశయము
కతనఁ బడసితి మప్రతిహతమహోధి
రాజ్యసంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు సంశ్రి
తాభిరక్షణవ్రతనిరతాంతరంగ.

7. క. నీమహిమ వొగడఁ గొలఁదియె
దామోదర విశ్వసంవిధాతవు భవదీ
యామలతేజమ యగ్ని
ష్టోమము గాలాత్మకత్వశోభివి కృష్ణా.

8. క. భవదీయశ్వసనము వా
యువు నీక్రోధముఁ బ్రసాదయోగంబును మృ
త్యువు లక్ష్మియు నీవలనన
యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్.

9. క. స్థావరజంగమమయజగ
దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగుచుండును
భావాతీతుఁడవు సర్వపతివి ముకుందా.

10. వ. అని వెండియు

-:కృష్ణార్జును లింద్రప్రస్థమునుండి హస్తినాపురంబునకు వచ్చుట:-
సం 14-51-15

11. క. నారదదేవలకౌశిక
పారాశర్యాదిమునులపలుకుల భీష్మో
దారవచనముల నిను నఘ
దూరా యే నెఱిఁగి యుండుదును సకలముగన్.

12. వ. కావున.

13. క. నావలనికరుణ పెంపున
నీవు ప్రసాదించినట్టినిరవద్యకవి
ద్యావిస్తారంబున దృఢ
తావిశదమతిన్ రమించెం గ్రతుపురుషా.

14. వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వితతాదరవాక్యంబుల నభినందించె నప్పురుషవరు లట్లు సల్లాపంబులు సేయుచుం బోయి తమరాకకు సమలంకృతం బైన సామజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్రమందిరంబున కరిగి యక్కురువృద్ధుని గాంధారినిం బ్రణామవినయవిశేషంబులం బ్రీతులం జేసి కుంతీ సమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సుసంజయులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంత భక్తిపూర్వకంబుగా సమంచితవిధంబునం గాంచి తదాలింగనాధ్యాచరణంబులు నడసి రప్పద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయుపూజావిధానంబుల మానసం బలరవసియించి మఱునాఁడు మహనీయాస్థానమండపంబున నున్నయన్న రేంద్రుకడకు నుపేంద్రుం డయ్యింద్రసుతుండు తోడన చనం జని సుఖగోష్ఠి నుండె నట్టియెడ నగ్గాండీవి యపాండవపూర్వజునాననంబునఁ జూడ్కి నిలిపి నిభృతుండై.

15. తే. కమలనాభుండు పెద్దయుఁ గాల మిచట
నున్నవాఁడు దండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
కుందురే వారిఁ జూడ నితండుఁ గోరె.

16. క. ద్వారకకు నిమ్మహాత్ముఁడు
మీ రనుమతి నేయఁ జని యమేయగుణుల నా
సీరిని వసుదేవుని గని
గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్.

17. క. తక్కటిసోదరుల సుతుల
నక్కునఁ బ్రియ మారఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలి మన్నన మక్కువ
నెక్కొనఁగా నాదరించి నిలుపక మగుడున్.

18. సీ. దేవర యిప్పని దివ్యచిత్తంబునఁ
జూచి మీ కెట్టులు చూడఁ బోలు
నట్టుల యుత్తరం బానతి యిత్తురు
గాక నావుడు నధికప్రియమున
మాతులుఁ గాంచి యిమ్మాధవదేవుండు
మనమాఱుగాఁగ నమస్కృతులును
నాలింగనంబులు నాచరించి హలాయు
ధుని దేవకీదేవిఁ [illegible]పుడు

తే. భక్తి మనకునై పూజించి బంధుజనుల
నందఱను దత్తదౌచిత్య మభినుతముగ
నాదరించి వారలకుశలానుయోగ
విధము నస్మత్కృతమ్ముగ విస్తరించి.

19. క. పరిజయోగక్షేమము
లరసి పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా
క్యరచనలుం గార్యసమా
చరణములు నొనర్చి నడపి సభిసత్కృతులున్.

20. తే. మఱియు వలయుకృత్యంబులుఁ జెఱఁగొపఱుప
వలసినన్ని దినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనమిత్రభృత్య
వర్గసహితుఁడై చనుదెంచువాఁడు గాక.

21. క. అని ధర్మజుండు పలికిన
విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుండై గొం
తిని ద్రౌపదిఁ దగుమెయి వీ
డ్కొని తాను సుభద్రఁ దోడుకొని పోవుటకున్.

22. వ. గొంతి యెంతయుం బ్రియంబున ననుజ్ఞ సేయుటయు నర్జును నను
మతియుం గొని.

23. తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ
బాండవేయులుఁ దక్కినబంధుజనులు
ననుప రాఁగ సాత్యకి దోడ నరుగుదేరఁ
బురము వెడలి యొక్కెడ నిల్చి కరము నెమ్మి.

24. క. సముచితభంగుల నందఱఁ
గ్రమమున వీడ్కొని పథంబు గైకొని తనచి
త్తము దృష్టియుఁ బాండవమ
ధ్యముపై నొలయంగ నల్ల నరుగుచు నుండెన్.

25. ఆ. అట్లు మరలి మరలి యర్జునుం జూచుచుఁ
జనంగ నతఁడు సూడ్కి సనినయంత
దవ్వుఁ జూచుచుండె నవ్విధంబున సితాం
బురుహలోచనుండు వోవునపుడు.

26. క. సరసన సాత్యకి రుచిరపు
టరదంబునఁ జనియె వెనుక నలఁతిరథముపై
నరిగె సుభద్రయు నిమ్మెయి
నరుగఁగ హరిమీఁద నింద్రుఁ దలరులు గురిసెన్.

27. క. పవనుం డనుకూలతమెయిఁ
బ్రవర్తితుం డయ్యె నతిశుభప్రపథంగుల్
వివిధములు మఱియు ధరణీ
ధవ తోఁచె నిమిత్తములు నితాంతస్ఫుటతన్.

-:శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకుఁ బోవుట:-

సం. 14- 2-7

28. వ. అట్లు వోయి వోయి మార్గంబుకెలనం జేరువ నున్నయుదంకాశ్రమంబుగని యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతని చేయునతిథి సత్కారంబులం బ్రియం బంది యతనిపాల నాసీనుం డయి యుండ నతండప్పుండరీకాక్షున కి ట్లనియె.

29. చ. భరతులపాలి కేఁగి తగఁ బాండవకౌరవబంధుభావముం గరము పృథంబు చేసితె సుఖస్థితి రాజుల వారివారివి స్ఫురితమహాధిరాజ్యములఁబొప్పుల నిల్పితె పక్షపాతిలా దురితము లేనిసీవు జనతోషవిధానవిశారదుండ వై.

30. వ. అని యి ట్లిట్లుఁ గనివాఁ డయి యడిగెడునట్లపోలె నిందాగర్భంబుగాఁ బలికినం బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి యాభార్గవు నాననం బాలోకించి.

31. చ. కర ముచితంబుగాఁ బలికి గర్వపుమాట నడల్చి భీతికిం బెరు వగునట్లు చెప్పి గడుదీనత దోఁపఁగ నాడి సంధి క క్కురుపతిఁ దమ్ముఁబ్రోవు మొగకొల్పఁగఁ జాలన నాకు భీష్ముఁడు న్గురుఁడును దోడు చెప్పిరి మునుల్ బహుభంగుల నొత్తి రత్తఱిన్.

32. వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి యెవ్విధంబులను సంధికిం జొరక కురుకుమారులు పాండవులతో భండనం బొనర్చి సబంధు పరిజనంబుగా మరణంబు నొంది యుత్తమలోకంబుల కరిగి రిక్కడఁ బాండు నం దన పంచకంబు ద్రిక్కం దక్కటివా రెల్ల నట్ల పోయిరి కాలనిషేధి గడవ నెవ్వరికిని శక్యం బగునే యనిన విని రోష కషాయితంబు లగుతారకంబు లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధన సత్తముండు.

33. క. కౌరవకులమును మిథ్యా
చారుఁడ వై త్రుంచి తకట శక్తుఁడ వయ్యున్
నేరిమిమైఁ జేయవ పొం
దారఁగ [illegible] ల్పిషమున కంతటికిఁ దగన్.

84. వ. ఘోరప్రకారం బగుశాపంబు నీ కిచ్చెద ననిన నచ్యుతుం డామునితో
నా మాటలు దేటపడ విని తగినయట్లు సేయుదు గాకయని పలికి
యిట్లనియె.

85. చ. కినియుట మాను మేలె మునికిం గుపితత్వము శాంతవృత్తి నా
యనునయ మాదరింపు విను మల్పతపంబులచేతఁ గోలుపో
దునె మఱి యట్లుఁ గాక యతిదుష్కర మైనతపంబు సంచితం
బనఁ దగు బ్రహ్మచర్యమును నాఱడి వోవె కటా శపించినన్.

86. వ. అనిన విని యుదంకుండు శ్రీవత్సాంకు నవలోకించి.

87. క. అగుఁ గాక నీవు సెప్పెడు
తగ వెయ్యది సెపుమ వినియెదం బోలిన నే
మగిడించెద శాపోన్ముఖ
మగుమన్మానసము ననుడు నల్లన నగుచున్.

88. చ తమము రజస్సు సత్త్వము నుదంక మదీయవశప్రవర్తమా
నములు మరుద్వసుప్రభృతి నాకిచయంబు మదుద్భవంబు స
ర్వమునను నేన నిల్తు సుఖవాసత నన్ దగఁ జెంది నిల్చు స
ర్వము విను మేన చూవె యపరంబు పరంబనఁగల్గుతత్త్వముల్.

89. తే. ప్రణవముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుస్సరిధాశ్రమములును దత్సర్వకర్మ
జాతములును సమంచితస్వర్గమోక్ష
ములును మన్మయముల కాఁగఁ దెలిసికొనుము.

40. క. క్రతుపరులు నన్ను తగ సం
స్తుతించి ఫల మందఁ గంద్రు దోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ
గృతాత్ము లగుదురు మదీయకీర్తనపరులై.

41. క. మానసు మదగ్రపుత్త్రిం
గా నెఱుఁగుము ధర్ముననిని జగద్రక్షకు నై
యే నభిమతకాలములను
మానితజన్మముల నొంది మనుతుఁ దపస్వీ.

42. క. భవవర్ధనవిలయంబుల
నవలీలన వరుస బ్రహ్మ యన విష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును
భువనంబుల నేన చూవె భూరిమహిమలన్.

43. క. ధర్మంబుకలకఁ గాంచి య
ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను జే
రర్మిలి రక్షింతు నుచిత
కర్మాచరణముల నే జగద్ధితమున కై.

44. వ. అట్టివాఁడ నయి యుండియు నధర్మపరు లగుధార్తరాష్ట్రుల నత్యంత ధార్మికు లగుధర్మనందనాదులతోఁ గలపుటకుం బలుదెఱంగులం బడితి నది దివ్యజ్ఞానదేదీప్యమాను లగుపారాశర్యప్రభృతిమునివరుల చిత్తంబుల కెక్కె నక్కౌరవులు ప్రమదౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతు లగునాకౌంతేయులం బొదరి ధర్మసమరంబున సమసిరి నాచేసిన పని యిట్టిది నన్ను నుదంక నీ వింక నే మనియెద వను మని పలికిన నతండు వినయావనతుం డై యిట్లనియె.

45. ఉ. ఇప్పుడు నీమహామహిమ యేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పిన యాసమంచితవిశేషము లెల్ల నెఱుంగుదున్ మదిం
గప్పిన యాదురాగ్రహపుగర్వము ముంచికొనంగ నాకు మున్
చొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా.

46. వ. అని వెండియు.

47. ఆ. అతుల మైననీమహామహిమకు నేను
జ్ఞాత నగుదు నేనిఁ జగన్నాథ
యనుపమంబు నీవిశ్వరూపముఁ జూపవే
నాకుఁ జూడ్కి వేడుక యగుచు నుండె.

-:కృష్ణుఁ డుదంకునకుఁ దన విశ్వరూపంబుఁ జూపుట:-

సం. 14-54-

48. చ. అనుఁడు దయాళుఁ డైనహరి యద్భుతమున్నవిశ్వమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయమున్ దలంగొనన్

మునిపతి పాణిపద్మములు మోడ్చి నమః పురుషోత్తమాయ తే
యనుచు వినీతినమ్ర మగునంగము నివ్వెఱ నిశ్చలంబుగన్.

49. వ. ఒక్కింత నిలిచి నిభృతస్వరంబున.

50. సీ. పుండరీకాక్ష యీ పుడమి యంతయును భ
వత్పాదపంక్తిసంవ్యాప్త మయ్యె
నంబరం బెల్లను నావృత మయ్యె నీ
మహితసముజ్జ్వలమస్తకముల
నంతరిక్షము దావకాద్భుతకుక్షిదే
శంబులచేత సంఛన్న మయ్యె
భవదీయమహనీయబాహార్గళానిచ
యాపిహితము లయ్యె నన్నిదిశలు
తే. బహుచరణముల బహుశిరోభాగములను
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవ యైత
నర్చి ఇది నాదుకన్ను మనంబుఁ దనిపె.

51. వ. విశ్వరూపా యీరూపం బుపసంహరించి నీ దగునెప్పటియాకారంబు
గైకొనవే యనిన నప్పరమేశ్వరుండు వరంబు గోరు మని యాన
తిచ్చిన నమ్మహితాత్ముండు సంశ్రితార్తిహర నీమూర్తిఁ గంటి నింత
కంటె మిక్కిలివరంబులును గలవే యనుటయు.

52. క ఆవేళ్ళఁ దతనితో నటు
గాదు ననుఁ గనుట శుభము గావింపక పో
దేది ప్రియ మడుగు మిత్తుఁ బ్ర
మోదంబుగ నీకు ననిన ముని యిట్లనియెన్.

53. వ. అవశ్యంబును నా కట్లు గావలయు నని యవధరించి తేని దేవా
యిది మరుదేశం బిచ్చట జలంబు దుర్లభంబు నాకు జలసన్నిధి
యెప్పుడుంగలుగఁ బ్రసాదింపుము.

54. క. అనుటయు నంబుజనాభుఁడు
తనయెప్పటిలలితమూర్తి ధరియించి మునిం

ద్రునితోడ నన్నుఁ దలఁపఁగ
ననఘా దొరకొను జలంబు లని పలికె దగన్.

55. వ. వీడ్కొని చనియెం బదంపడి యాభృగువంశవరుం డొక్కెడ
మెలంగుచుండి తృషితుం డయి హృషీకేశుం దలంచిన

56 సీ. కుక్కలు చుట్టిరా నొక్కమాతంగుండు
బాణబాణాసనపాణియును ది
గంబరుండును మలినాంగుండు నగువాఁడు
దోఁచె నచ్ఛజలంబు పొరఁగుచుండు
మేనితో నమ్ముని వానిఁ దప్పక చూడ
వాఁ డోయుదంక యిచ్చారి దప్పి
వోఁ ద్రావు మనుడు నాభూసురాగ్రణి యొల్ల
నని పల్కెఁ బల్కిన వినుము నీవు

ఆ. నీరువట్టు శ్రమముఁ గూరిన నీమీఁది
కరుణ వచ్చినాఁడఁ గాదు నాక
యర్థిఁ ద్రావు టొప్పు ననియె నాచండాలు
నలుక మెయి నదల్చె నత్తపస్వి.

57. వ. అదల్చిన నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబు సేసె
నాసంయమి వెఱఁగుపడి యొక్కింత విచారించి యిక్కపటప్రచా
రంబు కృష్ణసంపాదితంబు గావలయు నని యూహించుసమయంబున
నయ్యెడకుం గృష్ణుం డరుగుదెంచుటయుం గనుంగొని యమ్మహాత్ముని
తోడ నమ్మునివరుండు.

58. క. జలము నినుఁ దలఁపఁగా నిటు
గలుగునె చండాలు నొద్దఁ గాజెదునే రే
నలఘుగుణ త్రావుదునె యే
కాలఁదిశ్రమం బైన వరము కుచ్చిత మయ్యెన్.

59. చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టు లను నాఱడిఁ బోయెఁ బ్రయత్న మెల్ల నీ
వనఘ యెఱుంగ వైతి సమయం బొకఁ డిమ్మెయిఁ గల్గె నేర్పడ

స్వినుము నిలింపవల్లభుని నీ కయి వేఁడితి నే సుధారసం
బనితరసాధ్య మైనశుభ మయ్యెఁదుభూతి దొలంగె నక్కటా.

60. వ. అది యె ట్లంటేని.

61. క. ఏను సుధ యడుగుటయు హరి
మానవునకు నేల యగు నమర్త్యత్వము మే
లైనతెఱఁ గొండు గోరుము
దానిం దగ నిచ్చెదన్ ముదం బారంగన్.

62. వ. అనిన నయ్యనిమిషపతియాననం బాలోకించి.

63. క. నిను వేఁడుట మోఘముగాఁ
జనునే యె ట్లయిన నాదువనవు సెఱప క
మ్మునిపతికి నమృతరస మి
మ్మని ప్రార్థించిన మహాత్మ యాతఁడు నాతోన్.

64. వ. సమయంబు చేసికొని వచ్చె నత్తెఱం గాకర్ణింపు మమ్మహితసౌజన్య
ధన్యుండు.

65. శా. మాతంగత్వము దాల్చి యే నరిగి సమ్మానించి యాభార్గవుం
బ్రీతుం జేసెద నట్టు లిచ్చినసుధన్ బ్రీదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా కన్యాయ్యవృత్తంబు గా
దీతంత్రంబున కీవ సాక్షి యన తా నేతెంచె నిన్ గానఁగన్.

66. వ. నీవు ప్రత్యాఖ్యానంబు చేసిన నతం డంతర్ధానంబు చేసెం గానిమ్ము
దాని కేమి సేయ వచ్చు నాయిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు
జలంబెప్పుడుం గలుగం జేసెద

67. చ. అనఘ జలంబు నీ వలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగున్ భవద్యశము వొంపిరివోవ నుదంక మేఘనా
మనుతవిహారముల్ గలిగె మాన్యత నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను సువ్రత దూఱకు పోయి వచ్చెదన్.

68. క. అనినం బ్రీతుం డయ్యెను
మునియంతర్ధానకలనమునఁ గృష్ణుండుం

జనియె నని చెప్పి మఱియును
జనమేజయనృపతితోడ సంప్రీతిమెయిన్.

69. వ. వైశంపాయనుం డి ట్లనియె.

70. ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబు
నందు నియతవృత్తి నద్భుతంబు
దలకొనంగ నయ్యుదంకమేఘంబు లొ
క్కొక్కపుణ్యతిథుల నొలసి కురియు.

71. వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించినయుదంకుం డేమివిధంబు తపంబున నమ్మహాను భావంబు నొందె నెఱింగింపవే యనుడు నావిభునకు వైశంపాయనుం డి ట్లనియె.

-:జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకుని చరిత్రంబుచెప్పుట:-

సం. 14_55_1

72. సీ. ఉత్తంకుఁ డొక గురుభక్తికతనఁ జొప్పడినవాఁ డన
తైజసు పెంపది [illegible] నతఁడు
తన గురుం డైనగౌతమునకు శుశ్రూష
నిరుపమస్థితిఁ జేయ సస్నేహభక్తి
కంబుగఁ బెద్దయుఁ గాలంబు చనిన నా
సంయమిపతి శిష్యసమితి కెల్ల
వివిధవరము లిచ్చి వీడ్కొల్పి పుచ్చి యు
దంకు నొక్కనిఁ దలఁప కుండె

ఆ. సత్తపః పరాత్ముఁ డతఁ డిష్టఁ బరిచర్య
నడపు చొక్కనాఁడు కడును బ్రేగు
గలుగునట్టివంటకట్టియ యోపక్కు
గుదియ మోచి తెచ్చెఁ గుసుకరేణ్యు

73. క. అటు మోచి తెచ్చి యం దొక
జటపెద్దయుఁ బగిలి యుండ సరభసముగ నై

చుటయు దెగి మోపుతో ముం
డట నది పడియెను జరాసితచ్ఛవి మెఱయన్.

74. సీ. దాన నన్నియతుండు దనవయఃపాకంబు
నెఱిఁగి శోకంబున నేడ్వ నమ్మ
హాముని యశ్రువులం జలిఁ బట్టంగ
నిజపుత్త్రిఁ బనిచె నన్నీరజాక్షి
దయమునఁ బట్టి కరంబులు వేఁడిమి
నెరసిన విడిచిన ధరయుఁ దలరె
నమ్ముని యాశిష్యు ర మ్మని చేరంగఁ
బిలిచి నీ వేటికి నలతఁ బొందె

ఆ. దనిన నతఁడు శిష్యు లందఱపైఁగల
కరుణ మీకుఁ బెద్దకాల మెని
మునివరేణ్య నావలన లేదు దానికి
నుమ్మలింప కెట్టు లుండ వచ్చు.

75. వ. అనుటయుఁ గృప చిగు రొత్తుచిత్తంబుతోడ.

76. క. ఎలప్రాయ మిచ్చితిని నీ
కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరఁగఁ బెండిలి గ మ్మని
పలికి మఱియు నాతపస్విపతి యి ట్లనియెన్.

77. క. నీతేజంబు సహింపఁగ
సీతామరసాక్షి దక్క నెవ్వరికిఁ దప
స్స్ఫీతా శక్యము గా దిది
చేతోగతిఁ జూచి తగవు సిద్ధించుట కై.

78 వ. ఇమ్ముద్దియకును.

79. క. తను వొందుగఁ జేసెద నది
జనసాంతర మెట్టు లట్ల సజ్జనసుత నీ

వనుమానము దక్కుము యౌ
వనమును గైకొనుము కన్య వరియింపు తగన్.

80. వ. అధర్మంబు గాకుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్య కారత్నంబునకును.

81. చ. తనులత యొండు చేసిన సుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృపవర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొండు మీరలు మనంబున నెద్ది దలంచి వేడ్క సే
సిన నది దెత్తు మీకరుణఁ జేసియ కల్గెడు నాకు శక్తియున్.

82. క. అని విన్నపంబు సేసిన
విని దక్షిణఁ బ్రీతి యగుట వే ఱొరులకుఁ గా
కనఘ భవదీయచరితం
బునఁ జూవే నాకు ననియె ముని మనుజేంద్రా.

83. తే. అంత నిలువక మునిపత్ని కతఁడు భక్తి
నెఱఁగి తల్లి మీ రానతి యిండు మీకు
వలయునట్టిపదార్థ మవశ్యమును స
మాహరింతు నే ననుటయు నయ్యహల్య.

84. చ. వలవదు లాఁతివాఁడవె భవద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను నకుంఠితచిత్తత నొత్తి పల్కె న
య్యలఘుతపస్వి యాసతిప్రియంబున మిత్రసహాఖ్యదేవికుం
డలములు దెమ్ము నాకుఁ బ్రకటంబుగఁ బంపు వహింపు తమ్ముఁడా.

85. వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుం డయియుపన్యనికిం జనియెఁ బదంపడి గౌతముం డుదంకునిం బోవఁగాన మెచట నున్నవాఁ డని యహల్య నడిగిన నాభృగువంశవరుం డరిగినతెఱం గెఱింగించిన నద్దయాపం దద్దేవియాననం బాలోకించి.

86. క. ఆసౌదాసనరేంద్రుం
డాసురచరితుండు శాప మాతని నటు కాఁ
జేసినయది మానుషమాం
సాసక్తుం డగు టెఱుంగఁ దమ్ముని యతనిన్.

87. సీ. అకట యెట్లగునొక్కొ యనుపల్కు కృప దోఁపఁ
బలికిన నమ్మ్రగ్ధ భయము గొనుచు
నెఱుఁగ నిట్లగుట మునీశ్వర నామీఁది
దయ చిగురొత్త నాతనికిఁ గీడు
రా కుండునట్లుగాఁ జేకొని కావవే
యనిన నాసంయమి యంత వెఱవ
నేల యే నతనికి నెడరు రా నీ నని
తగ నూఱడించె నుదంకుఁ డరిగి

ఆ. మనుజరక్తసిక్తతనువును గోరమీ
సములు వృత్తలోచనములు నైన
యుగ్రమూర్తితోడ నొక్కఘూన్యాటవి
నెలమి యున్నయన్న రేంద్రుఁ గాంచె.

88. క. ముని యిట్లు నెమ్మిఁ గాంచినఁ
గని యతఁ డాఁకొనుటఁ జేసి గాసిలి యెచ్చోఁ
గనువాఁడనొ తగుభక్ష్యం
బనుచుండఁగ వచ్చితివి ప్రియంబుగ ననుడున్.

89. వ. ఉదంకుం డతని కి ట్లనియె.

90. క. గురుకార్యంబునకై భూ
వర నిన్నుం గాన నేను వచ్చితి గుర్వ
ర్థరతులు హింస్యులు గా రి
ట్లరయక యాడుచె యధర్మ మగుమాట నృపా.

91. వ. అనుటయు.

92. క. దినమున మూఁడవయామం
బున నపరార్థంబు యోగ్యముగ నాహారం
బునకుం గల్పించిరి నా
కనిమిష లటు గాన మాన నాకఁలి పుత్తున్.

93\. సీ. అని పల్కె సౌదాసుఁ డమ్ముని యట్లేని
నధిప మద్గురుకార్య మాచరించి
వచ్చెద మగుడ నవశ్యంబు నామాట
ననృతంబు చొరదు నీవర్థికోటి
కీప్సపదార్థంబు లిత్తు పాత్రమ యేను
గురులకుఁ గాఁగ నాకోరుకోర్కె
నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున
నరుగుదెంచినవాఁడ ననుడు నృపతి

ఆ. యట్ల కాక యేమి యర్థించి వచ్చితి
చెప్పు మనిన నతఁడు చిత్త మలర
ననఘ నీదుపత్ని యర్థిమై ధరియించు
కుండలంబు లని యతండు సెప్పె.

94\. వ. చెప్పిన విని యమ్మనుజవరుం డారులధనం బిచ్చు వారలు గలరె
కుండలంబు లడుగ కొం డెద్దేనియు నడుగు మనుటయు నాసంయమి
నీవు నెపంబిడి త్రోవం గలవాఁడవు గావే నన్యవస్తువు లొల్ల నని
పలికిన నాభూవల్లభుం డమ్మాట కియ్యకొని యన్నాతి యున్నచోటికిం
జను మేఁ బుత్తెంచితి నని చెప్పి నీవాంఛితం బెఱింగింపు మని
నియోగించిన నమ్ముని యద్దేవి యెచ్చోట నున్నయది యని యడిగిన
నప్పుడతితేఁ డల్లదె తన్నివాసప్రదేశం బని చూపినం బోయి.

95\. సీ. అద్దేవిఁ గని యతం డట్ల చెప్పిన ముని
వల్లభ నా కానవాలు దెమ్ము
నృపపాల ననియె నన్నేలఁత యుదంకుండు
చనుదెంచి విభు నభిజ్ఞాన మడిగె
నాతఁ డీగతి సేమ మగు నని శిక్షింప
రాదిది వెలి గాఁగ లేదు వేఱ
గతియును ననుపలు కతివకు నాయిచ్చు
వర్ణితాభిజ్ఞాననిర్ణయముగఁ

ఆ. చెప్పు మనిన సంతసిల్లి యమ్మదయంతి
కడకు నరిగి తత్ప్రకారమునన
పలుకుటయును భర్తపనుపున నిచ్చెదఁ
గుండలములు నీకు గురుహితార్థి.

96. వ. అని యక్కొమ్మ యమ్మహితాత్మునితో మఱియును.

97. సీ. సురలు గంధర్వులు నురగులు నిక్కుండ
లములకుఁ బెక్కుపాయముల వేచి
తిరుగుదు రెంగిలి పొరసిన నేమఱి
నీవు నిద్రించిన నేల నిడిన
నపహరింతురు భక్తి నర్పించి యివి దాల్ప
నాఁకలి నీరువ ట్టగ్నిభయము
విషవికారము భూతభేతాళబాధలు
పొరయవు వినుము బాలురకు నైనఁ

ఆ. బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యయి
కొలఁది నమరియుండుఁ గురియుఁ బసిఁడి
వీని నప్రమత్తవృత్తిమైఁ గొని చను
మయ్య గురులు నిన్ను నభినుతింప.

-:ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట:-

సం. 14-57-3

98. వ. అని చెప్పి యప్పరమపతివ్రత భక్తి ప్రీతివినయంబులు మనంబున నంకురింప నుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు చేసి యాసంయమివరుం డబ్బామచేత నామంత్రితుండై భూమీశ్వరుపాలికి వికాసలసితవదనారవిందుం డగుచు నేతెంచి యక్కుండలలాభంబు ప్రకటించి దీవించి దేవా నీవలనం గృతార్థుండ నైతి నని పలికి నా కానవాలుగా నీవు చెప్పిన వాక్యం బత్యంతగూఢంబు తదభిప్రాయంబు నెఱుంగవలతుం జెప్పం దగి యుండునేనిం జెప్పు మని యడిగిన నతం డతనితోడ.

99. సీ. బ్రాహ్మణజనముల రాజులు పూజింతు
రటు గాన నేను విప్రార్చనంబు
సేయుదు విప్రునిచేతన యి ట్లైతి
వెఱద ప్పునన యొండు వెరవు నాకు
దురితంబు వాపంగ దొరకొన దని కార
ణముగ భూసురపూజనంబు దుష్క-
రము దీన మేలు గందు మనంగ రా దిది
గా దన్న వేఱొండు గలదె మార్గ
తే. మని యభిజ్ఞానముగ మదయంతి కపుడు
చెప్పి పుచ్చితి నిట్లు విశిష్టరత్న
మయమహాకుండలము లిచ్చి మాన్తుఁ గీడు
నీకతన ననుతలఁపున లోకవంద్య.

100. వ. అనియె నాభృగువంశవరేణ్యుని పుణ్యసన్నిధిం జేసి యాసౌదాస నరేంద్రునకు సంప్రాప్తసమాధాన నూతనసత్త్వంబు గలుగుట కతంబునం గార్యదర్శనంబును గుండలదానశ్రద్ధయు శాంతవచనంబునుం గలిగెఁ దదీయవచన శ్రవణానంతరంబ యుదంకుం డతనితో మిత్రత్వంబు సంభాషణమాత్ర సిద్ధం బగుట బోధవృద్ధులు చెప్పుదు రేను నీవలనం గృతార్థుండ నైతిఁ బోవుచున్నవాఁడ మగిడి వచ్చెద నని పలికితి బొంకు పడ కుండ వత్తు ననినఁ జిత్తంబు కృపాయత్తం బగుచుండ నాభూపతి యత్తాపసోత్తమునాననం బాలోకించి.

101. ఉ. చంపెడునట్టినాకడకు సంయమివల్లభ వత్తురయ్య నీ
పెంపును నిక్కముం దెలిసెఁ బ్రీతుఁడ నైతి మదార్తి నీతప
స్సంపదఁ జేసి పాపు మని సమ్మతిఁ బల్కిన వీనులందుఁ బే
రింపొలయం బ్రసన్నత వహింపఁగఁ జిత్త ముదంకుఁ డి ట్లనున్.

102. ఉ. ఏమిట నైన నొప్పమి నరేంద్ర సుచిత్తులఁ బొందె నేనియున్
వే మరలున్ భవద్గుణము వీతకళంకునిఁ జేసె నిన్ను సాం
ద్రామలకీర్తి గౌతమమహాముని చల్లనిచిత్తవృత్తి నీ
పై మలఁగించెఁ గావలయుఁ బార్థివసత్తమ పొందు మున్నతిన్.

103. క. అని పలికి మఱియుఁ బలుదీ
వన లిచ్చి యతండు గారవమున నహనిమేన్
దనకరముల నివిరి ప్రియం
బొనర్చె నిద్ధరితుఁ డైనయుర్వీపతియున్.

104. వ. భక్తివినయసంభరితుం డయి యప్పరమమునిం బ్రస్తుతించి నమస్క రించి యామంత్రణంబు చేసిన నమ్మహాత్ముండు కుండలంబులు కృష్ణాజినంబునం బదిలంబుగా ముడిచికొని గౌతమాశ్రమంబునకు రయంబునం బోయి పోయి పక్వఫలంబులం బెఱిగినబిల్వంబుం గని యాఁకటి పెల్లునం దదీయ విటపంబున సకుండలం బగునయ్యజినంబు దగిల్చి యమ్మహీరుహం బెక్కి ఫలంబులు గోసికొనుచుండె.

105. సీ. గాలి నవ్విటప మాలోల మగుడుఁ దగు
లెడలి యయ్యజినంబు పుడమిఁ బడినఁ
గని యొక్కనాగంబు గక్కునఁ జనుదెంచి
వెసఁ బుచ్చికొని కడు వేగ పఱపఁ
గాంచి యుదంకుండు గ్రమ్మన దిగవాఁటి
వెనుకొనునంతకుఁ గనపపుట్టఁ
జొచ్చె నయ్యురగ మానుత్రవతపరుఁడు దీ
ర్ఘముఖకాష్ఠము గొని త్రవ్వఁ దొడఁగె

తే. దాని సైరింపఁ జాలక ధరణి తలరె
విప్రుఁడై వచ్చి గీర్వాణపతిఁడు గౌయ్య
కోలఁ ద్రవ్వినమాత్రఁ బాతాళయాన
మేల సిద్ధింప నేర్చు మునీంద్ర వినుము.

106. వ. పాతాళభువనం బిచ్చటికి సహస్రయోజనంబు లున్నది కుండలం బులు గొనిపోయినభుజంగం బైరావతాపత్యం బనిన విని యమ్ముని శిఖ్యుండు.

107. క. పాతాళంబున నున్నను
వే తెత్తుం గుండలములు విను మప్పని నా

చేతం గా కున్న నను
వ్రాతము విడువంబడు నిది ధ్రువం బని పలికెన్.

108 చ. పలికిన నత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుఁ డొండుప
ల్కులపని నిల్పి కాష్ఠమునం గులిశంబునఁ గల్గువాఁడియున్
బలువును నిచ్చి వజ్రి చనె బాంధవ మేర్పడఁ జెప్పి భీతిమై
నిల దెరు విచ్చె నమ్మునియు నేఁడైఱఁ జొచ్చె భుజంగలోకమున్

109 వ. చొచ్చి యనేకప్రకారప్రాకారపరిరక్షితంబును బహురత్నదీప్తి జాల
దేదీప్యమానంబును నైనయమ్మహనీయలోకం బాలోకించి దశయోజ
నాయామంబునుం బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని
యతండు కుండలాహరణంబు దుర్లభం బనుతలంపున డిల్లపడియె
నయ్యెడ నరుణవదనంబును నసితాంగంబును సితవాలంబును నై
వెలుంగుతురంగం బతని కి ట్లనియె.

110. ఉ. ఆతత మైననాదగునపానము నూఁదు మెకింతయున్ జుగు
ప్సాతురవృత్తి నీదుహృదయంబునఁ జొన్పకు లోకవంద్యుఁ డ
గ్గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి చేసి నన్
బ్రీతునిఁ జేసినాఁడవు పరిష్కృతబోధన యట్లు గావునన్.

111. వ. నీకుం బొడసూపి యైరావతసుతుం డపహరించిన సముంచితకుండ
లంబులు మగుడం జేసెడు నుపాయం బుపదేశించితి ననిన నుదంకుం
డేను నిన్ను నెఱుంగ నుపాసించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు
నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు గురుండం బావకుండ నీవు శుచి
వయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను నియతిం బూజించి తత్తెఱం
గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు తదీయోపదిష్ట
ప్రకారం బాచరించిన.

112. సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల
నొక్కట ఘనధూమ ముద్గమించి
కవిసి పాతాళలోకం బంతయును గప్పె
వాసుకి ప్రభృతినివాసభూము

లుపరుద్ధభావంబు నొందె నైరావతా
వాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె న ట్లతిదారుణం బైన
పెనుఁబొగ నెంతయు భీతినొంది

ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున
వచ్చి భక్తి నర్ఘ్య లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే
తెచ్చి కుండలంబు లిచ్చి రధిప.

-: ఉదంకుండు కుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట :-
సం. 14-57-58

113. వ. అతఁడును వారిఁ బోఁ బనిచి యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు చే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చేసిటి భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్.

114 తే. అంగనయు గౌతముండు నత్యాదరమునఁ
గౌఁగిలించుచు దీవించి గారవింప
నతఁడు నమ్మునిపతికిని సఁస్యమకును
పెక్కుమాఱులు భక్తిమై మ్రొక్కి నిలిచి.

115. క. మీకరుణఁ గాక తగుమెయి
నీకుండలములు పరిగ్రహింపుట నడుమన్
వైకృతి యొలసినఁ దలఁగుట
నాకౌఁదిమె యని యా వినయనమ్రుం డగుచున్.

116. వ. అనిన విని వార లత్యంతసంతుష్టాంతరంగులై రగ్గౌతముం డతని
కి ట్లనియె.

117. ఉ. నీచరితంబు చిత్రమహనీయము మిత్రసహక్షితీశ్వరున్
నీచతఁ బాప నాగ మపనీతము చేసినకుండలద్వయం
బాచతురత్వ మాబలిమి యాపృథునిశ్చయ మట్టు లొప్ప ధ
ర్మోచితలీలఁ దేర నారుఁ డోపునె యేను నిజంబ పల్కితిన్.

118. వ. అనియె నయ్యుదంకుం డట్లు తనమహాతపంబుబలిమిం బరాక్రమించి యనన్యసులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధి గావించెనా భృగువంశమహత్తరుమహానుభావం బిట్టి దనిన విని జనమే జయుండమ్మహాత్మునకు వరం బొసంగి చనిన వాసుదేవుననంతర వృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డి ట్లనియె.

119. సీ. ఆభార్గవోత్తము నట్లు వీడ్కొని కృష్ణు
దరిగి యలంకృత మైననిజపు
రము సొచ్చునప్పుడు రైవతకాచల
యాత్రామహోత్సవ మఖిలజనులుఁ
గొనియాడుచుండి యగ్గోవిందుసందర్శ
నంబున నుత్సవోన్మత్తభావ
సమ్మది యై ప్రమోదమ్మునం దేలి ర
ద్దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి

తే. దేవకీదేవి బలభద్రదేవుఁ దక్కఁ
గలుగువృద్ధబాంధవులను గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవిధానమంచి
తాచరణములు నడపెఁ బ్రియం బెలర్ప.

120. వ. వార లందఱకు ధర్మనందనుచెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోప చారంబు లాచరించె ననుజతనూజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతి వాత్సల్యసంభావనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకి సుభద్రలం దగుతెఱంగులం దగినవారలం గానిపించె నట్లు సకల జనప్రమోదాపాదియైనదామోదరు నత్యంతసమీపాసీనుం జేసికొని వసుదేవుండు భారతరణ ప్రకారంబు యాతాయాతజనంబులచేత వింటిం బ్రస్ఫుటంబుగా వినవలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం డతని కి ట్లనియె.

121. క. అది యతివిస్తారము పె
క్కుదినంబులు చెప్పఁ బట్టుఁ గొంత దగం జె

పెద్ద నేఁ బ్రధానపురుషస
ముదయసమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్.

122. సీ. కౌరవసైన్య మేకాదశాక్షౌహిణీ
కలితంబు దానికిఁ గట్టె వీర
పట్టంబు భీష్ముఁ డాప్రభువున కెదు రొడ్డి
రెలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మ
నీక మిమ్మాడ్కిఁ బన్నినబలద్వ
యంబును ఖేచరు లచ్చెరువడఁ బోరెఁ
గాండీవి దోడ్పడఁగా శిఖండి

తే. యన్నదీనందనునిఁ బడియవుదినంబు
నందుఁ గూలిచె నుత్తరాయణము వచ్చు
నంతకును మృతిఁ బొందక యాతఁ డుండె
నధిప శరతల్పమునఁ గడు నద్భుతముగ.

123. క. గురుఁ డైదు దివసములు ని
ర్భరసమర మొనర్చె నతనిఁ బరిమార్పఁగ నా
పెరవున నర్జునుప్రాపున
దొరకొనియె హుతాగ్నిభవుఁడు ద్రుపద సుతుండున్.

124. క. గండున రాధాతనయుఁడు
రెండుదినంబులు పెనంగి గ్రీష్మసమయసూ
ర్యుఁడుం బోలె వెలింగెడు
గాండివధరుశరకరోష్మఁ గ్రాఁగె నరేంద్రా.

125. చ. విను మఱునాఁడు శల్యుఁ డతివిక్రమతన్ సమరం బొనర్చె య
ద్దినము సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగుడున్ బలంబు గై
కొని యనిసేయఁగా శకునిఁ గూల్చె వడిన్ సహదేవుఁ డంతతో
మనమునఁ జేవ దక్కి తనమానము పెగ్గఁగఁ బ్రావి హీనుఁడై.

126. వ. దుర్యోధనుండు తనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగ
టార్చియుండ భంగంబున కోర్చి పలపలనిమూఁక విడిచి గద చేతం

గాని పాదచారియయి యొక్కండును దాఁటి యొక్క మడువు సొచ్చి
నీళ్లు పాషాణమయముగా మంత్రించికొని దాఁగి యుండెఁ బాండవు
లెఱింగి పోయి పొదివికొని మర్మభేదంబు లగుదూషణభాషణంబు
లొప్పించిన.

127. ఆ. అతఁడు మడువు వెడలి యనిలనందనుతోడఁ
దగఁ బెనంగి తద్గదావినిహతిఁ
దొడలు విఱిగి కూలి విడిచెఁ బ్రాణంబు లి
ట్లంగి జయము గొనిరి పాండుసుతులు.

128. క. గురుసుతుఁడు పాండుతనయుల
బిర మాఱె యదరి పొదవి భీషణవృత్తిం
బొరిగొనియెం గరిఘోటక
నరనిచయము నెల్ల నే మనం గల దధిపా.

129. వ. ఆరాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంత పుట్టె నిట్లు
పదునెనిమిది దివసంబులు చెల్లిన సంగ్రామంబున నేమార్వురము
సాత్యకియును దక్క మాదిక్కున సమస్తజనంబులు నస్తమించిరి
కౌరవులదెస నశ్వత్థామ కృపకృతవర్మలు మువ్వురు బ్రదికిరి
యుయుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి చావునకుం
దప్పె నిది భారతరణప్రకారంబు.

130. క. అని చెప్పెఁ గాని యభిమ
న్యుని చావేర్పడఁగఁ జెప్ప నొల్లఁడ వసుదే
వునకు వగ మిగులుటకు నె
మ్మనమునఁ దా నోర్చుకునికి మాధవుఁ డధిపా.

131. వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ నీయల్లుం
డభిమన్యుండు వెగటు మీతండ్రికిం జెప్పలావం జెప్పు మన్నా యని
వసుదేవుండు విన బలుకుచుం బుడమిం బడిన వసుదేవాదియాదవ
జనంబులు మనంబులం గదిరినక్రొత్తవెగ్గలం [illegible]ంచినం బద్మ
నాభుండు వారల నెల్ల నూరార్చి వారణపురంబున సుభద్రయు నుత్త
రయు నభిమన్యునిదెస నెత్తినశోకంబున నాకులత్వంబు నొందిన

చందంబును గొంతి తగుమాటల వారిఁ దేర్చినతెఱంగును నెఱింగించి పాండవు లేవురును వేర్వేఱ యభిమన్యునకై మణికాంచనగవాది వస్తువులు విప్రప్రకరంబుల కొసంగుటయు మఱియుం దటాకకరణాది ధర్మంబు లాచరించుటయుం జెప్పి మఱియు దురంబునం దెరలక మరలక యాసౌభద్రుండు రౌద్రమూర్తి యై దుర్యోధనద్రోణకృప ద్రౌణికృతవర్మకర్ణాదివీర వ్రాతంబుఁ గలంచి యనేకనృపలోకంబును జములోకంబున కనిచియనిమిషులు పొగడ నుత్తమలోకంబున కరిగి సుఖి యై యున్నవాఁడు వానికి వగవ నేల యనియుం బలికి యిట్లుప శాంతి గావించి.

132. ఆ. బంధులోకమునకుఁ బరమప్రియం బైన
యుచితవర్తనమున నుండెఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు లగువాక్యములఁ బ్రీతి
చిగురు లొత్త నిట్లు చెప్పి మఱియు.

133. వ. కరిపురంబునం బుట్టినవిశేషంబులు వినుమని పలికి వైశంపాయ నుండు జనమేజయున కిట్లనియె.

:-వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట:-

సం. 14- 1-8

134. సీ. చుఱచుఱఁ దనచెవుల్ సూఁడినయట్లుగ
నభిమన్యుసంస్తుతి యైనవాక్చ
యము ప్రసంగాధీనమై [illegible]జనులందుఁ
[illegible]యును ధృతి యెడలి తలరి
యుత్తర విలపింప నత్తన్వి యలమట
గనుఁగొని పాండునందనులు వనటఁ
గూరిన నాలోకిఁ గారుణ్యమూర్తి వే
దవ్యాసుఁ డేతెంచి తగినమాట

తే. లాడి వారివంత మాన్చి యశ్వమేధ
విషయవిధులు ప్రసంగించి వేగ తొడఁగుఁ
డని నియోగించి వారెల్ల నట్ల కాక
[illegible] నాతఁ డంతర్హితుం డయ్యె నధిప.

135. క. అన విని జనమేజయుఁ డ
మ్ముని యిట్లు హితోపదేశముం జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెమ్మెయి
ననఘ తొడగె నశ్వమేధయాగంబునకున్.

136. క. అని యడిగిన వైశంపా
యనుఁ డాతని కిట్టు లనియె నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు తమ్ములఁ
గనుఁగొని యుత్సాహలక్ష్మి కనుఁగవ నొప్పన్.

187. సీ. వ్యాసమహాముని వత్సలత్వంబున
నానతి యిచ్చిన మాననీయ
వాక్యంబు వింటిరె వసుధ యిత్తఱి వసు
హీన యై యున్నది దానఁ జేసి
భూదేవనిహితధనాదాన మావశ్య
కం బయ్యె దానిశక్యత్వమును హి
మాచలయాత్రాసమాచరణప్రకా
రమును విచారణీయములు గావె

ఆ. యనుడుఁ బవనతనయుఁ డతనితో నీశ్వరుఁ
బరమనియతిఁ గొలిచి కరుణ వడసి
ప్రమథగణము నెల్ల భక్తిఁ బూజించి య
త్తలమునందు భూతబలు లొనర్చి.

188. క. తెత్తము గాక నరేంద్ర మ
రుత్తకలిత మైనదాన రూపము సుమహో
దాత్తస్థితినున్నకనక
మిత్తఱి నిలదెసఁ దలంప నేఁటికి మనకున్

189. వ. అప్పనికి సముచితసైన్యసమేతంబుగా దేవర విజయంచేయునాయు
ననిన నర్జునుండును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు
ప్రియం బంది కృతనిశ్చయుం డయి ధృతరాష్ట్రకదకుం జని
యశ్వమేధయాగోపక్రమోత్సవశ్రవణంబునం బుత్త్రిలం దలంచి

శోకసంతాపసమాక్రాంతుం డయియున్న యన్నరపతి చరణంబుల కెఱంగి వేదవ్యాసు వచనంబులు గాంధారియు విను చుండ నతనికిం జెప్పి యతనిచేత నయ్యాజ్ఞాచరణంబునకు ననుజ్ఞవడసి యయ్యిరువు రను దండప్రణామపూర్వకంబుగా వీడ్కొనిగొంతి పాలికిం బోయి సంతోషవికచవదన యయి యున్నయద్దేవి యధ్వరవిధానంబునకు ననుమతి సేయం దదీయపాదంబులకుం బ్రణమిల్లి తదామంత్రితుం డై యాస్థానమండపంబునకు నరుగుదెంచి యుయుత్సు రావించి కార్యంబు తెఱం గెఱింగించి నీవు నగరరక్ష కై నిలువు మని నెయ్యం బలర విదుర సమేతంబుగా నిలిపి బలంబుల సంఘటింపం బడవాళ్లం బనిచి నియతుండయి సురపితృపూజనంబులు దీర్చి మహేంద్రార్చనం బొనర్చి మహితావధానుం డై.

140. క. నానావిధబహుకాంచిత
దానము లొనరించి యర్చితం బగునగ్నిన్
దానియధికారి ధౌమ్యుం
దాను బ్రదక్షిణవిధాయితం గొలిచి తగన్.

141. క. సితలేపనసితభూషణ
సితమాల్యసితాంబరములఁ జెన్నుగ సమలం
కృతుఁ డై సితాతపత్ర
ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రుపగిది వెలుఁగుచున్.

142. వ. షోడశశ్వేతాశ్వప్రాప్యవరరథారూఢుం డై,

143. క. భూదైవతదత్తాశీ
ర్వాదంబులుఁ బుణ్యగానరవములు రోదో
మేదురమంగళతూర్యని
నాదంబులుఁ జెలఁగ బుధజనస్తుతు లెసఁగన్.

144. చ. వెడలెడునమ్మహీవిభునివెక్క యెఱింగి వృకోదరుండుఁ గ
వ్వడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యె
క్కుడు మెఱుఁగుం బ్రధానభటఘోటకదంతిరథప్రతానముల్
దడిగలుఁ గుంచెలున్ గొడుగులుం దమలున్ విలసిల్ల వచ్చినన్.

145. క. కని యానృపుఁ దలఁతినగవు
నినుపారెడుచూడ్కి వారినెమ్మొగములపైఁ
దనుపారుచుఁ బొలయం జనఁ
జన రాజులు గూడుకొనిరి సైన్యంబులతోన్.

146. వ. ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుండు సముచితప్రయాణంబుల
గిరిసరిదరణ్యంబులు గడచి హిమశైలంబు సేరి ధౌమ్యాదిపురోహితులఁ
బురస్కరించికొని తదీయతలం బధిష్ఠించి యొక్కయుచితప్రదేశం
బున విడిసె నట్టియెడ.

-:వ్యాసుఁడు హిమవత్ప్రదేశంబున నున్నపాండవులకడకు వచ్చుట:-
సం. 14-64-1

146. శా. బాలార్కద్యుతిపుంజపింజరజటాభారంబుఁ బ్రావృడ్ఘన
శ్రీలీలం బ్రహసించునంగమును రోచిస్స్ఫారదండంబు ను
న్నీలస్నిగ్ధమృగాజినాంబరము నై నిర్వాణదానక్రియా
శీలుం డైనపరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై.

148. వ. ఇట్లు సన్నిహితుం డయినవేదవ్యాసమునీశ్వరునిఁ బాండవులు పరమ
భక్తిం బ్రణామపూర్వకంబుగాఁ బూజించి కర్తవ్యం బెయ్యది యాన
తిం డనిన నమ్మునీంద్రుం డెల్లి మీ రెల్లవారును త్ర్యంబకపూజలు
సెల్పింపవలయు నేఁటిరాత్రి నియతులై దర్భసంస్తరణంబుల శయ
నింపునది యని నియోగించిన.

149. ఆ. రమ్య మైనపవ్వళింపుల దర్భసం
స్తరణములను యోగసంస్థితిఁ బ్ర
భాసమానము లగుపంచాగ్నులనుబోలె
సమ్మహాత్ము లుండి రాత్రియెల్ల

150. వ. అట్లుండి యుపనిషద్రహస్యంబుల నాదరింపుచు నారేయి గడపి
కల్యంబునఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి సర్వక్రియా
కలాపనిర్వహణదక్షుం డగుబాదరాయణుండు నను ధౌమ్యప్రముఖ
పురోహితసహితానుజీవిసమేతు లగుపాండవేయులు పరమ
స్థండిలంబునం బార్వతీపతి నావాహించి యుత్కృష్టంబులను బహు

శంబులు నగుగంధపుష్పధూపదీపంబులం బూజించి సమంచిత మనోహరిభూరిపాయసాదిభక్ష్య ద్రవ్యభారమహోదారం బగు నైవేద్యంబు సమర్పించి వేఱువేఱ ప్రధాన ప్రముఖులకుఁ దద్గణంబులకు నర్చ లిచ్చి కుబేరమణిభద్ర ప్రభృతిభూత యక్షజనంబులను సభక్తికాహ్వానకలితులంగా వించి పూజనంబులాచరించి.

151. క. రక్షాకరమంత్రకలన
దక్షాత్మకు లైనయట్టిధౌమ్యముఖోదా
త్తక్షోణీ సురులు బెరయ
నక్షయపుణ్యుఁ డగుకౌరవాధిపుఁ డెలమిన్.

152. క. అనుజులుఁ దానుఁ బరాశర
తనయపురస్సరముగా నిధానస్థలికిం
జని యరుణగంధకుసుమము
లను మాంసాపూపములను లాజములఁ దగన్

153. ఆ. భూతతృప్తిఁ జేసి భూరిబలాఢ్యులఁ
బరిజనములఁ ద్రవ్వఁ బనుచుటయును
నతికుతూహలమున నార్చి వారలు త్రవ్వి
రన్నిధానదేశ మధిపముఖ్య.

154. క. త్రవ్వినఁ బ్రభ లెల్లెడల
నివ్వటిలఁగ వెలుఁగుచుండె నిధి యవనిజుఁడుం
గవ్వడియుఁ గవలు నలరఁగ
నవ్వసుధాధిపుఁడు దాని కర్చన లిచ్చెన్.

155. వ. అట్లు వివిధవిద్యానిధి యగువేదవ్యాసుండు సన్నిధి సేసి యప్పెన్నిధి సాధించిన యుధర్మనందనుం డాపరాశరనందనుపాదంబులకు దండప్రణామ బుజేసి విలిచి కేలు మొగిచ్చి ఫాలతలంబునం గదియించి వినయావనతుండై యున్నయన్న రేంద్రు నమ్మునీంద్రుం డాలింగ నాశీర్వాదంబుల నాదరించి యామంత్రణంబు సేసి యంతర్హితుండయ్యె నమ్మానవనాథుండు.

156. సీ. శకటఖరోష్ట్రఘోటకకుంజరంబు ల
నేకసహస్రంబు లెలమి సంఘ
టించి భారంబు లెత్తించి భారవహత్వ
దక్షజనుల్ పెక్కు లక్ష లర్థిఁ
గదిసి యే నే నని కడఁగి మోవఁగ యాగ
నిలయంబుఁ గలపయుఁ గలశములును
నలఁకులు గాఁగులు నాదిగాఁ గలభాండ
ములును బీఠములు శయ్యలును దోఁట్లు
తే. రోఁకటులుఁ జట్టువంబులు స్రుక్స్రువాజ్య
పాత్రదండకమండలుదాత్రములును
లోనుగాఁ గల్గువస్తువుల్ శుద్ధహేమ
మయము లొక్కట నడపించె మనుజనాథ.

157. చ. మఱియును సన్నిధిం గలసమంచితకాంచనరాశి బండులం
బెఱికల మోపులం గొలఁది పెట్టఁగఁ బెక్కుగుబారువుల్ జనుల్
వెఱుఁగుపడంగ ఖేచరులు వెక్కస మందఁగ శత్రుకోటికిన్
వెఱ పొనరించువార్త పృథివిం బరఁగన్ నడపించె భూపుఁడు.

158. ఆ. ఏరునేలకొలఁది నెడనెడ విడియుచుఁ
బోవ వలసి యుండె భూరిభార
వహులడప్పి యెఱుఁగువాఁ డగునాధర్మ
నందనునకు ధరణినాథవర్య.

159. వ. అంత నక్కడఁ గృష్ణుండు.

160. తే. ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చి
నపుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు
సమయ మగుట ప్రతీక్షించి సకలబంధు
యుక్తముగ ర మ్మనినమధురోక్తి యూఁది.

-: కృష్ణుండు సకలబంధుసహితుం డై పురినగరంబునకు వచ్చుట :-

సం. 14-65-1

161. వ. అరసికొని యుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు
చేయుట చారులు చెప్ప నాకర్ణించి కుతుహలోన్నిద్రుం డై బలభద్ర

సాత్యకికృతవర్మప్రద్యుమ్నచారు(థే) దేష్ణ సాంబాదియాదవసమే
తంబుగా వసుదేవ దేవకీ సమనుజ్ఞాతుండై సుభద్రం దోడ్కొని
కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధారియు
గొంతియుం బనుప నుత్సుకుండై యుయుత్సుండు విదురుం బురస్క
రించికొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని
వచ్చిన.

162. తే. మున్ను ధృతరాష్ట్రికడకు నావెన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి గొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి గౌఁగిలించి

163. వ పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగినతెఱంగున నప్పాండు
రాజ మహిషిం గని రక్కులపాలికాతిలకంబుపులకంబులం బెఱిగిన
మేనితో మాననీయచరిత్రుం డగునద్దేవకీపుత్త్రి సంభావించి.

164. క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి
సముచిత మగునర్చనంబు సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునిక
రము నర్చలు సంభృతాదరంబున నడపెన్.

165. వ. సుభద్ర తన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతర
మందిరంబునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగునాబంధుజనంబు
నెల్లను నగరిచేరువ శోభిల్లుమందిరంబుల విడియింప యుయుత్సు
నియోగించె న ట్లయ్యందఱు నభినందితు లై యున్నసమయంబున.

166. ఉ. ఉత్తరపుణ్యగర్భముననుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణయోగి పరిక్షితుఁ డుద్భవించినం
జిత్త మెలర్పఁ బుత్త్రుఁడని చెప్పిరి వెల్పలివారి కింటిలో
న త్తఱి నున్నవృద్ధసతు లార్చె జనం బఖిలంబు నుబ్బునన్.

167. క. బాలుఁడు మృతజాతుం డని
యాలోనన యేడ్పు బెరయ నలమట నచ్చో

నాలలన లుగ్గడించినఁ
దేలిరి శోకమున జనులు ధీరవిచారా.

168. వ. అత్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబుతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగా గొంతి యున్నెడకుం జనుదెంచెనప్పు డాకుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకడకు రయంబున రా నెదురనయ్యెదువీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషోత్తముతో దగ్గుత్తిక నెలుంగు దగుల ని ట్లనియె.

-: పరీక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట :-
సం. 14-65-25

169. క. గతి నీవె నాకు మత్సం
తతికిని నీయల్లుఁగుఱ్ఱతనయుఁడు పుట్టెన్
మృతుఁడై క్రూరుం డగుగురు
సుతునిషీకాస్త్రవహ్నిఁ జూఁడినకతనన్.

170. సీ. దేవకీపుత్త్ర సంజీవితుఁ జేయవే
యబ్బాలు నద్దారుణాస్త్రసంప్ర
యోగంబునపుడు కృపాగరిష్ఠుండ వై
చేసితి ప్రతిన గాచెద నవశ్య
మును నుత్తరాగర్భజనితు నే నని బాలు
బ్రదుకుతో డిద నాదు బ్రతుకు ద్రుపద
తనయాసుభద్రలు ధర్మజుం డనుజు లా
శిశువు సంజీవితుఁ జేయ కున్న

ఆ. బ్రదుక రన్వయమున కుదకపిండప్రదా
నంబు లెడలు మత్స్యనందనయును
నూఱడింపఁ బడియె నొకనాఁడు నీచేత
దానియార్తి కరుణఁ దలఁగవయ్య.

171. వ. దేవా నీ విక్కులంబు గలిగించినవాఁడ వింకను నీవ వీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడినగొంతి నగ్గోవిందుం డనునయవచ నంబుల నూఱార్చి యెత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో ని ట్లనియె.

172. క. గురుసుతుఁడు భీమునకు నై
పరమాస్త్రం బెత్తె దానిఫల మందంగా
నరుఁడును దత్పత్నియుఁ గాం
చిరి తుది నే నీకు నేమి చెప్పుదుఁ బ్రభువా.

173. క. నీమఱఁది యాకొడుకుపైఁ
బ్రేమం బెప్పుడును బెంపఁ బ్రేలెడిమనుమం
డీమెయి వమ్మయిపోయిన
నేమి యగునో యెఱుఁగ నీవ యెఱుఁగుదు దీనిన్.

174. సీ. ధర్మజుం డెమ్మెయి ధరియించు నెవ్వగ
పవననందనుఁడును గవలు నేమి
వెరవున నుపశమింతురు దీని విను దేవ
యస్త్రప్రయోగంబునపుడు నీవు
గురుసుతు నదలించి కుత్సిత నిన్ను మో
ఘాస్త్రునిఁ జేసెద నంటి దాన
నూఱడి యుండుదు ముజ్జ్వలతేజ నీ
మహితానుభావత మాకు నెల్లఁ

ఆ. దెలిసి యుండుఁ గాన యలుకము సత్యద
యాశ్రితాభిరక్ష లనఘ నీకు
నైజములు శిరః ప్రణతి నేను వేఁడెదఁ
గరుణ నిక్కులంబు గాచికొనుము

175. తే. ఏవిధంబునఁ గోలుపో నీవు నీవు
పాండవుల నీదుసన్నిధిఁ బాపకర్మ
శీలుఁ డైనయశ్వత్థామ గోలుపుచ్చె
వాని నే మనఁ గలదు దుర్వారతేజ.

176\. వ. అని వెండియు.

177\. చ. భువనము లొక్కపెట్ట మృతిఁ బొందిన జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణరూఢుఁడు మేనమఱందిపౌత్రుఁ జా
వ విడుతె వంత పెంపున నవారణ నీయెదురం బ్రలాపముల్
వివిధము లే మొనర్చితిమి వెఱ్ఱుల మై యిటు భక్తవత్సలా.

178\. తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప
వనజనాభుండు జను లర్థి వినఁగఁ బిన్న
వాని బ్రదికింతు వగవంగ వలవ దనియె
నెలుఁగు జలదస్వనమ్మున గ్లెసక మెసఁగ.

179\. వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి సూతికాగృహంబునకుం
గుంతీప్రభృతులు తోడ రా నతండు వోవునప్పు డది ధవళకుసుమసిత
సర్షపలాజపూర్ణకుంభప్రముఖమంగళవస్తువులను ప్రజ్వలితపావక
ప్రదీప్తశస్త్ర పిచుమందపల్లవాదిభూత (భయ) పరిహారకపదార్థంబు
లను జతురవృద్ధాంగనా చికిత్సకదక్షపరిచారికాముఖ్యహితకారిపరివార
జనప్రవర్తనంబులను బరిశోభితం బయి యుండె నమ్మందిరం
బాగోవిందుండు ప్రవేశించె నట్టియెడనంతకమున్న.

180\. సీ. కడచి ద్రౌపది చని యడలునఁ బడియున్న
మాత్స్యనందనతోడ మాధవుండు
చనుదెంచె పీఁటె సవినయంబుగాఁ గను
మనవుడు నుత్థిత యై వికీర్ణ
వేణీభరంబుతో వినతి యొనర్చి భ
క్తార్తి వాపుట నీకు నతిదృఢవ్ర
తంబు కదే దేవ దయ వెలయంగ నీ
శిశువు సంజీవితుఁ జేయనగ్గ

తే. నీవు గూర్తేని మేనల్లునికిఁ దదీయ
పుత్త్రి ద్రోణునిపుత్త్రుండు బొలియఁ జేయు
వాఁడె పతిహీన యగుపాపవతికిఁ బుత్త్రి
హీనతయును బాటిల్లిన నెట్లు బ్రదుకు.

181. ఉ. నందనుచావు నిక్క మయినం జను టప్పుడ కల్గు దేవకీ
నందన యెల్లభంగి నరనందనుపాలికి నాజి కేచి పో
వం దనతోడిపెంపునకు వారక యిచ్చినబాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్పు నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా.

182. తే. పద్మనాభుండు వచ్చిన బాలుఁ జంకఁ
బెట్టికొని పోయి మ్రొక్కింతుఁ బ్రీతి యెసఁగ
నని తలంచుచు నుండితి నమ్మనోర
థంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి.

183. వ. అని యంత నిలువనివలవంతపెంపున బాలశవంబు నెత్తికొని యంక
తలంబున నిడికొని తదాననం బాలోకించి.

184. ఆ. తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి
యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ
ధర్మవేది యైనతండ్రికిఁ బుట్టి య
ధర్మపరుఁడ వగుట తగునె నీకు.

185. క. కను విచ్చి గొంతిఁ జూడుము
ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం
దనయా చూడు తల యెత్తి దరహాసముతోన్.

186. చ. అని పలవించి యాసరసిజానన మూర్ఛ మునింగి నేలఁ ద్రా
లినఁ గరుణంబుపెంపున విలీనతఁ బొందుమనంబులై సభా
ష్పనయనయుగ్మకంబులును బాడఱుమోములు నైనకౌరవాం
గనలయలంతఁ గాంచిన వగల్ పిగులం బగవారి కేనియున్.

187. వ. ఒక్కింతసేపునకుం దెలివొంది విరాటనందన ధరాతలంబునం బడి
యున్న భంగిన ఫాలతలంబునం గేలు మొగిచి గోపాలదేవునకు
మ్రొక్కుచు వెక్కుచు శరణు శర ణని పలికిన నప్పరమకృపాపరుం
డోడ కోడకు మనుచుఁ బాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి
యశ్వత్థామప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగునమ్మ

హాస్త్రంబుపసంహరించి యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టిం బనిచి దరోల్లసితు లైనయెల్లవారలం గలయం గనుంగొని.

-:కృష్ణుఁడు మృతజాతుం డై నపరిక్షిత్తు లబ్ధజీవితుం జేయుట:-

సం. 14-68-18

188. తే. మీఁద బొం కగుమాటయే మీరు వినఁగ
నాడ నిబ్బాలు బ్రదికింతుఁ జూడుఁ డఖిల
జనులు నిప్పుడ తెలుండు సంతనయిన
దీని విని పాండవులు ప్రీతి నూనువారు.

189. వ. అని ప్రతిజ్ఞ సేసి యి ట్లనియె.

190. తే. పరిహాసయెడ నైన నే బొంకు పలుక నేని
సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ
దిరిగి కడు నిడ నేని యిప్పిన్నవాని
యంగమున జీవ మిప్పొద్ద యావహిల్లు.

191. క. ధరణీసురకులమునెడం
గర మెక్కుఁడు ప్రియము నాకుఁ గల దేని సధ
ర్మరతుఁడన యేని నియ్యు
త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్.

192. క. నరునియెడ నామనంబున
విరోధ మెన్నఁడును నేమివిధముననైనం
బొరయమి నిజ మేనియు సు
స్థిరముగ నిబ్బాలుమేన జీవము సెందున్.

193. క. నిక్క పుధర్మువునన యే
నక్కంసాదుల వధించు టారసి చూడఁగా
నిక్కువ మై యార్యజనుల
కెక్కి న యేని నసురవర్గ మీఁశువు గనున్.

194. తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ
నిర్మలబ్రహ్మకర్మంబు నిత్యసుప్ర

తిష్ఠితంబు లై నాయందుఁ దేజరిల్లు
నేని నిబ్బాలునకు జీవ మిపుడ వచ్చు.

195. వ. అని యి ట్లప్పురుషోత్తముండు పలికిన.

19 . సీ. బాలునిమేనికిఁ బ్రాణముల్ వచ్చిన
నల్లన కదలెఁ దదంగకములు
మఱి కను విచ్చె నత్తెఱఁగు తెల్లంబుగాఁ
గని గొంతిమొదలైనకౌరవాంగ
నలు మనంబులు నిండి యలువులఁ బాటెడు
నానందపూరంబు లనఁగఁ బొల్చు
హర్షబాష్పములు రోమాంచకంచుకితదే
హంబులు నై యలరార నఖిల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల
గగనమున దివ్యవాణి యక్కమలనాథుఁ
బొగడె మీతండ్రి యున్న యప్పుణ్యగృహము
కరము శోభిల్లె నప్పుడు కౌరవేంద్ర.

197. ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన మోమలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁ డైనపురుషోత్తమునంఘ్రులపొంత భూస్థలిం
జిత్త మెలర్పఁగాఁ దనదుచెన్నగుఫాలము సేర్చినన్ ముదా
యత్త మనస్కుఁ డై యతఁడు సాదరభాషల గారవించుచున్.

198. క. వినుతబహురత్నవిస్ఫుర
దనేకభూషణనికాయ మబ్బాలున కి
చ్చినఁ దక్కటియదువీరులు
జననాయక యొసఁగి రక్కజంబుగఁ బొడవుల్.

199. వ. అప్పుడు

200. తే. ఆత్మకులము పరిక్షీణ మైనజనన
మొందెఁ గాన యియ్యభిమన్యునందనునకు
నర్హ మగుఁ బరిక్షిన్నామ మనియెఁ గృష్ణుఁ
డఖిలజనములు వినఁ బౌరవాధినాథ.

201. వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె నట్లప్పరమ
పురుషుచేతం బ్రత్యుజ్జీవితుం డై నభవజ్జనకుం డేకమాసవయస్కుం
డగుకొలంది నొకపుణ్యదివసంబున.

202. సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహా
కనక మ్మలెత్తించికొని యుదాత్త
వైభవ మెసఁగంగ వచ్చినఁ గృష్ణుని
యుక్తు లై విదురయుయుత్సు లర్థిఁ
గస్తూరినీళ్ళలకలయంపులను గప్పు
రంపుమ్ముగ్గుల బహురత్నతోర
ణములఁ దోరపుముత్తియముల నొనర్చిన
ప్రాలంబమాలికాపంక్తులను బ

తే. సిండిపూర్ణకుంభముల విశిష్టమరక
తప్రకరమయకదళికాస్తంభములను
గరము దోరంబుఁ జిత్రరేఖంబుఁగా న
లంకరించిరి పురముఁ గులప్రదీప

203. వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయ నపు డప్పురంబు
చంద్రోదయ ఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యు
తుండును బలదేవసాత్యకిప్రద్యుమ్నప్రముఖులు ప్రమోదంబునం
బొంపిరివోవుచుం బెంపారు నలంకారంబుల నభినవోదారచారుత్వంబు
వహించి యెదురు చని పాండవులం గని రయ్యిరుదెఱంగులవారలు
సౌహార్దంబును సౌముఖ్యంబును సౌజన్యంబును నత్యంతంబును
మెఱయ నర్హంబు లగునాచరంబులు నడపిరట్లు కృష్ణసమేతు లై
మీతాతలు హర్షోల్లాసభాసమాను లగుచు నాసమగ్రకాంచనసంచ
యంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి.

204. క. తొలుత ధృతరాష్ట్రగాంధా
రులఁ గని మఱి గొంతిఁ గాంచి ప్రోస్ఫీలచ్చ
క్షులుఁ బ్రమదసంభరితచి
త్తులు నయినయుయుత్సునిన్ విదురునిం బ్రీతిన్.

205. వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదులగుచుం గృష్ణాదియాదవ
లోకంబునుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ.

-:వ్యాసుఁడు కృష్ణసహితు లై యున్నపాండవులయొద్దకు వచ్చుట:-
సం. 14-70-8

206. సీ తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవ
జ్జనకుతెఱంగు విస్తార మొప్పఁ
జెప్పిన వార లచ్చెరువాటు సంతసం
బును నెమ్మనంబులఁ బెనఁగొనంగఁ
బద్మనాభు ననేకభంగుల వినుతించి
యిట్టివి వింతలే యెల్లనాఁడు
నిట్టుల కాక మాయెడ నీదుకరుణపెం
పని యభినందించి రట్లు గలసి

తే నెమ్మిఁ దారును గృష్ణుండు సమ్మదమున
నుచితవర్తనకలితు లై యుండఁ గొన్ని
దివసములకు సంప్రీతి నేతెంచె బోధ
భాసితుం డైనసత్యవతీసుతుండు.

207. క. ఏతెంచిన గోవిందస
మేతంబుగ నెదురుకొని మహితపూజాసం
ప్రీతునిఁ గావించి యతని
మీఁతాతలు గొలిచి యుండి మృదువచనములన్.

208. వ. సముచితగోష్ఠి నడపి రప్పాండవాగ్రజుండు మునిజనాగ్రణితో
భవత్ప్రసాదంబునం బడిసినయమ్మహాధనంబు మహనీయంబుగా
నశ్వమేధయాగంబునందుపయోగంబు నొందింపఁ గోరెద ననుజ్ఞ
యీవే యనిన సంతసిల్లి యాసంయమివరుం డి ట్లనియె.

209. ఆ. తురగమేధ మఖిలదుష్కృతహరము నీ
వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వభాసమానుండ వై
వెలయు మమృతకిరణకులవరేణ్య.

210. చ. అనవుడుఁ బ్రీతి నొంది యతఁ డచ్యుతుఁ గన్గొని భవ్య మైనయి
ప్పని తగనిట్లు చేయు మని పంపుము తల్లియుఁ దండ్రియున్ గురుం
డును సచివుండు నిష్టసఖుఁడుం గరుణాకర నీవ మాకు నీ
యనుపమముఖ్యవృత్తి జగ మంతటికిం గతి సేయు నేటికిన్.

211. వ. అనిన విని యంబుజనాభుం డతని కిట్లనియె.

212. ఉ. వ్యాసులు పంచినట్లు నియమాఢ్యతఁ జేయుద మశ్వమేధముం
జేసి కృతార్థతం బొరసి చిత్తము నెవ్వగ యెల్లఁ బాచికొ
మ్మా సుకృతంబు ధర్మనిచయ ప్రవరం బని యేన చెప్పి కా
దే సుగుణాభిరామ నిను దీనికిఁ జొన్పితి మున్ దృఢంబుగన్.

213. చ. అమనుతి యింక వేఱ పదయం దలఁ పేటికిఁ గౌరవేంద్ర న
న్ననుపుము వాజిమేధకరణంబున కేపని చేయువాఁడ నీ
యనుజులు నల్వు రే నొకఁడ నధ్వరకార్యము లెల్ల నీదునె
మ్మనమున కెక్కఁ జేయుదుము మాన్యచరిత్ర తొడంగు మర్థితోన్.

214. సీ. అన విని సమ్మోద మారినచిత్తంబు
తో నభినందించి యానరేంద్ర
వరుఁడు పారాశర్యుపలను గనుంగొని
దీక్షకు నయ్యెడుదినము మీరు
చూచి యాసంభార మాచరింపుఁడు దయ
ననవుడు నమ్ముని యాజ్ఞవల్క్యుఁ
బేర్కొని పైలునిఁ బ్రీతి నెఱింగించి
వారును నేనును వసుమతీశ

ఆ. నడపవలయుపనులు నడపువారము చైత్ర
మాసకలితపౌర్ణమాసి నిప్పు
డరయఁ బనుపు మేధ్య మగుతురంగముఁ దజ్ఞు
లైనయట్టిజనుల నంచితాత్మ.

215. క. వేదోక్తవిధిసహితభ
వ్యాదరమున విడువఁబడినయయ్యశ్వం బీ

మేదినిఁ గలయం దిరుగును
నీదగునిర్మలయశంబు నెఱయ మెఱయఁగన్.

216. వ. సర్వసంభారంబులును సమకట్టింపుము స్రుక్స్రువాదిక్రతుసాధనంబులు
గ్రొత్తలుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన నప్ప
రమితేఁడు.

217. క. తురగపరీక్షావిదు లగు
పురుషులఁ బిలిపించి యశ్వపుంగవుఁ గని తెం
డరయుఁడు మనకొాదమలలో
నిరుపమలక్షణముఁ గీర్తనీయంబునుగాన్.

218 వ. అని పలికి కర్మాధికారులం గలయం గనుంగొని యజ్ఞంబునకు
వలయునట్టి ఖాండప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రు
వాద్యుపకరణంబులును సువర్ణమయంబులుగా వేగంబ చేయింప
వలయు నని నియోగించిన నట్ల కాక యని చని వారును బదంబడి.

219. క. తురగంబును సంభారో
త్కరమును గొని వచ్చి చూప ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని వినయ
పరత సమర్పించెఁ గురున్నపాలవరేణ్యా.

220. క. ముని యశ్వముఁ జూచి కరం
బనురాగముఁ బొంది మేధ్య మగు నిది దీనిన్
వినుతవిధానమున విడుత
మనవుడు నతఁ డతనితోడ నాదర మలరన్.

221. తే. దీని రక్షింప నర్హుండు మాననీయ
బోధ యెవ్వండు నీదుసద్బుద్ధి నరసి
యిట్టివాఁ డని యానతి యిమ్ము నాకు
ననిన నమ్మునినాథుఁ డయ్యధిపుతోడ.

222. క. దివ్యాస్త్రవిదుఁడు ధిషణా
భవ్యుఁడు శౌర్యోత్తరుండు పార్థుఁడు దగు న

శ్వ్యాపనక్రియకు నితఁ
దవ్యాహతి నాదరించు నక్కార్యంబున్.

223. వ. భీమసేనుఁడును నకులుండును మన రాష్ట్రంబు రక్షించువారు భవ
దీయ కుటుంబకార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన.

-:ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట:-
నం. 14-71-22

224. సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి య
ధ్వరయుక్త మైనయుత్తురగరత్న
మనఘ సంరక్షణీయంబు నీ కొరులకు
నిప్పని శక్యంబె యెల్లభంగి
నిక్కార్యమునకు నీ వేఁగంగ వలయు నీ
యంచితాశ్వము చరియించుచుండ
నెడనెడ రాజుల కే నశ్వమేధదీ
క్షితుఁడ నై యుండుట సెప్ప ముచిత

తే. కరణనియతి నిరోధంబు గాక యుండ
నడపు మని చెప్పి భీముని నకులు రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ గులకుటుంబ
సమితిరక్షకుఁ బనిచె నుత్సాహ మెసఁగ.

225. వ. మఱియునుం గలయలంతిపనుల కర్హజనంబుల నియోగించి గాంధారీ
ధృతరాష్ట్రులయనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుం డయి ద్రౌపది
నియ్యకొలిపి యశ్వమేధమఖంబున కున్ముఖుం డయ్యె నని యిట్లు
ధర్మపుత్రు పుణ్యచరిత్రంబు చెప్పిన నప్పరమధార్మికుండు సకల
లోకమనోజ్ఞం బగు యజ్ఞం బెవ్విధంబున నిర్వహించె వినువేడ్క
నాచిత్తంబునం జిగురొత్తెడుఁ జెప్పవే యనుటయు.

226. ఉ. మానమదాదిదోషపరిమార్జననిర్మలచిత్తభక్తస
న్మానసలోల వీతపరిమాణవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహితహేలవిచార నిరామయావ్యయ
స్థానకసిద్ధిమంగళవిధాయక వేదసభైకనాయకా.

227. క. అనపేక్షితఫలతాశో
ధనమహనీయక్రియావిపాత్మకరూ
ప నితాంతఘాతసంశ్రిత
జనపాపా పరమమిత్త్ర సత్యాలాపా.

228. మాలిని. తరుణ జరఠభావద్రావణోదారమూర్తీ
హరణకరణనిర్మూలానతాభ్యంతరార్తీ
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తీ
చరణకమలపూజాశాలిచిత్తానువర్తీ.

గద్యము. ఇతి శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## అశ్వమేధపర్వము-చతుర్థాశ్వాసము

శ్రీవిద్యాశాంతికృతి
ప్రావీణ్యానిరూఢిగణ్యపాదసతతసం
సేవనతత్పరహృత్క్రమ
లావాసకృతప్రమోద హరిహరనాథా.

-:ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట:-

సం. 14-72-1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లశ్వమేధ యాగోద్యోగ ప్రద్యోతితుం డగునపాండవాగ్రజుదీక్షకు నర్హం బయిన దినంబు సంప్రాప్తం బగుటయు మౌహూర్తికదత్తశుభముహూర్తం బునం గృష్ణద్వైపాయనాదు లైనఋత్విజులు వేదవిహితవిధానమహి తంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి రవ్వసుంధరావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్గణంబులు బలయం బరమసంయమి పరివృతప్రజాపతి ప్రఖ్యుండును గనత్కాం చనాభరణభూషితుండు నగుచు బహుళప్రభలు నిగుడ సందీప్తపావక సన్నిభుండును నగుచు వెలింగెం దత్తుల్యాకల్పనంబున ఋత్విగ్గన సమాజంబునుం దేజరిల్లె నానేదవ్యాస మహామునిచేత శాస్త్రోక్త ప్రకారంబున ముక్తంబయి హయోత్తమంబు వెడలె నప్పుడు.

3. సీ. విప్రుచ్చుం డాగమవిధివంతముగ ధర్మ
నందనునామంత్రణంబు వడసి
గాండీవపాణి యై కవచౌనల్ ధరియించి
తేజోవిశేషంబు రాజితముగ

నయ్యశ్వరత్నంబు ననుసరింపఁగఁ బ్రజ
బాలురు వృద్ధులు భామినులును
లోసుగాఁ బఱతెంచి లోలత నతని నా
హయమును గనుఁగొనునప్పు డగ్గ

తే. లంపుసందడి నూష్మ జనింప నాజ
నంబు లవ్వీరునకు దీవనలఁ బొగడ్త
లను బ్రమోద మొనర్చిరి వనధిరవము
ననుకరించె నయ్యలివు నృపాగ్రగణ్య.

4. వ. ఇవ్విధంబునం జనునాకవ్వడితోడ యజ్ఞకర్మకుశలుం డై నయాజ్ఞ వల్క్యశిష్యుం డర్థ్వవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమతురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్లనల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలనపరుం డగుచుం బ్రవర్తింపం ద్రిగర్తదేశంబునందు.

-:అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము చేయుట:-
సం. 14-73-1

5. సీ. ఉద్ధతులై త్రిగర్తోర్వరాపతిపుత్త్రి
పౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు
గాఁ బూని తేరులు గదురయంబునఁ దోలి
కొని యుద్ధముగ వచ్చుకోలుతలకు
నలుగక నరుఁ డన్నయానతిఁ దలఁచి యా
రాజకుమారవర్గంబుతోడ
ధర్మజునశ్వమేధంబున కపకార
మాచరించుట పాప మదియుఁ గాక

తే. యేము మీకును బాంధవ మెసకమెసఁగ
నడచు టొప్పదె పగ యే లనంగ వారు
సూర్యవర్మనామకుఁ డగుభూరతమగు
మారుఁ దగ్రణి గాఁగ సువారలిం.

6. చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లనున్ దయాధురా
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ
పవిపతి యెల్లనుం దెగియె భారతయుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ.

7. చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యని దప్పఁగఁ ద్రోవుము కిన్కమాను మ
న్నవచనవృత్తి నాదగుమనంబున నెక్కొని యున్కిఁజేసి యా
హవమున కొల్ల నయ్యెదఁ బ్రియంబులు కావొకొ మీకుఁ బ్రాణముల్.

8. చ. వలవదు పోం డనంగ నిలువంబడ కేపున సూర్యవర్మ య
బ్బలియునిమీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పయ
మ్ముల నది యెట్టనవ్వు తనమో మనుతమ్మికి లేఁతయెండ యై
చెలువముచెన్ను వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా.

9. వ. అట్టియెడ.

10. తే. సూర్యవర్మునితమ్ముండు శూరవరుఁడు
కేతువర్మ గాండీవిపై శాతబాణ
వృష్టిఁ గురియుచు నుద్ధురవేగ మొప్ప
నన్నఁ గడచి బె ట్టడరిన నన్నరుండు.

11. చ. అతని నొదుంగ నేయుటయు నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతవర్మనాముఁ డతి దారుణసాయకపంక్తి సత్వరా
తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చు వచ్చి య
య్యతిరథవర్యుఁ డప్పుడు తదంగము లేయఁగ నొల్ల కుండుటన్.

12. చ. శరములు ద్రుంప నాతఁడు వెసన్ బలునారసముల్ నిగిడ్చె న
న్నరుపయి నాబలిష్ఠుఁడు మనంబునఁ గొండొకయల్క పుట్టి య
న్నరవరసూతిపేరురమునం బదితూపులు గ్రుచ్చె దానికిం
దెరలక యక్కుమారుఁడును దీవ్రశరంబులఁ జేయి నొంచినన్.

13. ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండివ మిలఁ
బడిన నాత్రిగర్తబలము దెసలు

చెలఁగ నార్చె నంచుఁ జేయంగఁ గలయోధు
లక్కుమారవర్యు నవులఁ ద్రోచి.

14. తే. ఇంద్రధనువుచందంబున నెసక మెసఁగు
గాండివముపాటు గంటిరే చండవిక్ర
మాభిరాముండు గాండీవి యన్నపలుకు
లకు మహోగ్రత సూప నొల్లండు గాక.

15. ఉ. నిక్కపుఁగిస్క వచ్చిన ననిన్ నొసలం గనుచూపు వింటిపా
దక్కట రిత్త వోవునె నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం
దొక్కఁడుఁద్రిక్క కుండ మన మొప్పమి చూడఁగ నేల మున్న పే
రుక్కునఁ దాఁకు టొప్పు నని యొక్కట నర్జును నాక్రమించినన్.

16. క. అట మున్న గాండివం బు
త్కటరయమున నెత్తి కోపసహనుం డత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన మి
క్కుట మై కడగంటికెంపు గొమరారంగన్.

17. వ. ఆబీభత్సుండు.

18. క. పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ
బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటువిశిఖము లె
ప్పుడు మేదిని దోఁపడ చె
ప్పెడు కొలఁదియె రథికవరులపైనుఁగుపెంటల్.

19. శా. ఆయుగ్రోద్ధతి చూచి పెల్కుఱి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయం బాఱెఁ దదాప్తు లేము వగ నీపం బోపి నద్భక్తిమైఁ
జేయంగాఁ బని గొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్.

20. వ. అట్లు వెనుకొనక నిలిచి యెలుం గెత్తి వారలతో మీ రిట్లు ప్రాణంబులు
గాచికొనుండు నాపంచినపని సేయం బూని బుద్ధి గలిగి సుఖుల రై
యుండుం డని పలికి యయ్యశ్వంబు ననుసరించె నది క్రమగతిం
బ్రాగ్జ్యోతిష పురపరిసరంబునకుం బోయిన దానితెఱం గాకర్ణించి.

21. సీ. భగదత్తతనయుండు బాహుగర్వంబున
బాల్యసిద్ధం బగు లౌల్యమునను
బురి నిర్గమించి యత్తురగంబు వెలిపించి
కొనిపోవఁ గాంచి యర్జునుఁడు గాండి
వము సజ్యముగఁ జేసి వాలమ్ము లొక్కట
నక్కుమారునిమీఁదఁ బెక్కు గురియ
నవ్వజ్రదత్తుండు నొవ్వ దన్కిన దాని
నచ్చట దిగఁ ద్రావి చొచ్చెఁ బురము

తే. సత్వరంబుగ నటు సొచ్చి సామజంబుఁ
బన్నఁగాఁ బంచి వెస నెక్కి బలముఁ జలము
పేఁకయును నొప్ప నన్నరు దాఁకి శాత
ఘనశరంబులు పరఁగించెఁ గౌరవేంద్ర.

22. క. నడుమన వానిం బార్థుఁడు
పొడిగాఁ సేయంగఁ గనలి భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు
గడుఁ బెక్కవి మిడుతకదుపుగతిఁ గవియంగన్.

23. ఆ. అనలశిఖలువోని యమ్ములగమి వాని
రూపుమాపి యన్నరుండు వాఁడి
లేనిదొడ్డతూఁపు లేనించెఁ దొటి రాచ
కొడుకు నేసెఁ దూలి పుడమిఁ గూల.

24. క. కూలియు నీడం బోవక
బాలుఁడు రయ మార దంతిపైకిం జని దో
ర్లీల మెఱయ నరుఁ బటుశర
జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్.

25. చ. అతఁడును దీవ్రబాణముల నాభగదత్తతనూజుదంతి నా
వృతముగఁ జేసె నట్లు పృథివీవరనందన యేమి చెప్పుదున్
శతమఖపుత్త్రితోడ దివసత్రయ ముగ్రరణం బొనర్చె న
ద్భుత మెసఁగం జతుర్థదినముం దెగునంతకుఁ బోరె ధీరతన్.

26. వ. తెగియెడుసమయంబున.

27. ఆ. అక్కుమారుఁ దేచి యర్జున యర్జున
యేను గలుగ నీకు నెందుఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైనవాఁడు గావునఁ దండ్రి
సమసె నట్లు నన్ను సమతె బేల.

28. వ. అని యదల్చి.

29. వ. పెనుసెలయేఱులు వాఱఁగఁ
దనరుగిరియుఁబోలె బహుమదంబులు దొరఁగం
గనుపట్టుకుంజరము సిం
హనిభుం డగుపార్థుమీఁద నడరం జేసెన్.

30. క. అది ఫూత్కారము చేసిన
నొదవినకరశీకరముల నుర్వీవర యం
బుదముక్తసలిలధారలు
పొదివినగిరిపోలె నింద్రపుత్త్రుం దొప్పెన్.

31. చ. కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి సాహసపటుత్వము సూపిన నల్పకోపసుం
దరుఁ డగుచున్ నరుండు శతధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక పర్వతాకృతిన్.

32. క. కూలిన నేలకు వచ్చిన
బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవహృ
ద్యాలాపము లొప్ప నిట్టు లను నాతనితోన్.

33. వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యుత్తురంగంబుపజ్జ నన్నుం
బుత్తెంచునప్పుడు.

34. క. చంపకుమీ రాజుల నను
కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెం పనుకుసుమమునకు నా
పం బొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ

35. క. అనియెం గావున నీపైఁ
గినుక వొడమ దలుక విడువు గీతయశుం డా
జనపతియాగంబునకుం
జనుదేరఁగ వలయు బంధుజనముల్ నీవున్.

36. ఆ. అధిపతనయ నిన్ను నామంత్రితునిఁ జేసి
పోవుచున్నవాఁడ నీవు హస్తి
పురికి భావిచైత్రమునఁ బున్నమకు మొద
మొదవ నరుగుదెంచు టొప్పుఁ జేయు.

37. క. అనిన నతఁ డట్ల కా కని
వినతుం డగుటయును బ్రీతి విజయుం డభినం
దన మాచరించి యశ్వము
వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్రచరిత్రా.

-:అర్జునుఁడు సింధుదేశాధిపులతోడ యుద్ధంబు చేయుట:-

సం. 14-76-1

38. వ. అదిసింధుదేశవర్తియగుటయు భారతరణ హతులైన సైంధవయోధుల పుత్త్రపౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేక సహస్రసంఖ్యల రథికులు రాజనందనులుం గూడుకొని క్రీడిపై నడచి రట్టియెడ.

39. సీ. అరుణాంబుదంబులు పఱఁగి పెన్నెత్తురుఁ
గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ మయ్యె నుల్కాతతు
లెల్లదిక్కులఁ బెల్లు డుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి
యతనిపై నయ్యోధవితతి యొక్క
పెట్ట శస్త్రాస్త్రముల్ బెట్టుగాఁ గురిసిన
నప్పాండవుఁడు పెనుదప్పి సోలె

తే. నేమి చెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి

కరము గరము బెం డగుటయు గాండివంబు
వడియెఁ బుడమిపైఁ గురునరపతి వరేణ్య.

40. చ. అనిమిషులున్ మునీశ్వరులు నప్పుడు శోకమునన్ మునింగి య
ర్జునజయకాంక్షు లై నియతి శుద్ధి వహించి సవీర్య మంత్రసా
ధనపరు లైరి తెప్పిఱి యతండు ధనుర్ధరుడున్ సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా.

41. వ. ఇట్లు దెలి వొంది విజృంభించి.

42. శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు తీవ్రత్వరా
ఘోరం బై పిలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయున్
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధు ల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్.

43. వ. హతశేషం బైనయాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబు నొంది నలు దిక్కులవిచ్చియు నొచ్చియు వివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్సర్య ధుర్యం బై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి రథికముఖ్యుల తోడం దమయన్న చెప్పినవాక్యంబు లుపన్యసించి మీ రేల జాలిం బడియెదరు ప్రాణంబులు మీ కింత చేఁ దయ్యెనే యని పలికినను నిలువక పైపయి వారు రవణించిన.

44. క. నవ్వుచు నానాశరముల
నవ్వీరుల బొలియఁ జేయ నంతయు విని తా
నెవ్వగతో దుశ్శల యా
కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్.

45. సీ. వచ్చి కన్నీళ్లు వదనంబుపై వెల్లి
గొన రోదనంబు చేసిన నతండు
దయ నిల నిడియెఁ గోదండ మప్పడఁతుక
పౌత్త్రినిఁ జూపి యిట్లాలుఁ గావు
మితఁడు మీయల్లునిసుతుఁ డన్న నప్పార్థుఁ
డిప్పుడు నాయల్లుఁ డెచట నున్న

హాఁ దని యడగిన వనిత వెక్కుచు నత
డాత్మియజనకుఁ డుగ్రాహపమున

తే. ననఘ నీచేతఁ దెగుట దా విని నితాంత
శోకమగ్నుఁ డై యుండి నీరాక బిట్టు
వినుట బెగ్గిలి ప్రాణముల్ విడిచె ననుచు
నెలుఁగు గడలుకొనంగఁ బెల్లేడ్చె నధిప.

46. వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచి యుండ నయ్యుగ్మలి యతని నుద్దేశించి.

47. సీ. ధార్తరాష్ట్రులకీడు దలఁపక సైంధవు
కొఱగాము బెల్లను మఱచి తండ్రి
లేని యీశిశువుపై మానితం బైననీ
యక్కటికంపుఁజూ పదరఁ జేయు
మాశ్రితవత్సల యనుచు నబ్బాలునిఁ
జరణానతునిఁ జేసి శరణు శరణు
కృప నన్ను రక్షింపు కీర్తియు ధర్మంబుఁ
జేకొను మనవుడుఁ జిత్త మడల

తే. రాచకొల మిది గాల్పనే క్రౌర్యమూల
మని తలంచుచు నాతఁ డయ్యతివతోడ
నధమవృత్తి సుయోధనుం డంతకంటె
నేముఁ గొఱ గాము మాచేత నింతపుట్టె.

48. క. అని పలుకు పలికి బహుసాం
త్వనముల నూరార్చి యాసుపతిమస్తకముం
దన యక్కునఁ జేర్చి యబల
చనుము వగపు దక్కి యని ప్రసాదభరితుఁడై.

49. వ. వీడ్కొలిపిన దుశ్శల దనమనుమనిం దమబలంబులం గొని ప్రియం బునం జనియె నయ్యనిమిషపతిసుతుండును గ్రతువిషయంబు లైన యనుష్ఠానంబులు విధివంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దానామృగానుసారి యయినపినాకపాణియుంబోలెఁ బోవు

చుండ నదియును నఖిలదేశంబుల సుఖసంచారంబునం బ్రవర్తిల్లుచుఁ
గ్రమంబున మణిపూరపురంబునుపాంతంబున కరిగిన నన్నగరంబు
పతియైన బభ్రువాహనుండు నిజజనకుం డయిన యర్జునురాక
యాకర్ణించి.

50. ఆ. వినయ మెసఁగ నార్యజనమేతంబుగా
నరుగుదెంచి యతని చరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కిరీటి యన్నరపతి
నాదరింప కుండె మేదినీశ.

51. వ. అట్లుండి తనయునాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుం డై
యూరకున్న యక్కుమారునితో ధనంజయుం డి ట్లనియె.

52. ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా
కీగతి మెత్తఁబాటు దగునే నృపధర్మవిహీనతన్ రణో
ద్యోగము లేక తక్కి భయ ముల్లముఁ జేరఁగ నిచ్చురాజు రా
జేగుణహీన పొమ్మనిన నేమియుఁ బల్క కతండు గ్రమ్మఱన్.

53. సీ. అరిగి పట్టణవీధి నర్లిన చనుచుండ
నర్జునుం డతనితో నాడినట్టి
తెఱఁ గెల్లఁ దన దగుదివ్యబోధంబునఁ
గని భుజంగోత్తమతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా
ధిపునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసుతి నులూపి నా
పేరు హితంబు చెప్పెదుమనీష

తే. నరుగుదెంచితి వినుము మీయయ్యవనువు
దలకొనుము రాజులకు నర్హధర్మ మైన
యని యొనర్పుము దనతోడఁ బెసఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు.

54. క. అనిన సభక్తికముగ న
వ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ

జనునె యొనర్పఁగ నని య
పన్పికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ.

55. క. నీ వింత దెలిపి పలికెద
వావిభుఁడును మున్ను నన్ను ననుమతుఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం
గావించెద సిద్ధఱకు నఖండప్రియమున్.

*-: బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబుచేయుట :-*

సం. 14-78-14

56. చ. అని నిజమందిరంబునకు నయ్యెలనాఁగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచిత మైనరథం బుదాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నై తనమే నెలర్పఁగన్.

57. ఆ. ఎక్కి హంసకేతు వే ద్రెజఁ గ్రాలంగ
నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ
గురిసె నతఁడు నిశితశరచయంబు.

58. శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డొక్కట నాత్మసూనునొడలం దూపుల్ నిగిడ్చెం బదా
జానిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరుపై
వే నారాచము లైదునాలుగులు పృథ్వీనాథ నాటించినన్.

59. చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచి యే
పొదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది పడి పేర్మి శోణిత జలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్.

60. క. అమ్మేటిమగఁడు తన చా
ప మ్మూఁతగ నిల్చి సోలి పదపడి తెలివు
ల్లమ్మున నొలసిన నౌరా
యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్.

61. తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁ జేయు
నుద్ధతికి మంచిబంట వై యోర్వ వలయుఁ
జుమ్ము రా యని పలికి వాలమ్ము లధిక
రయము మెఱయంగఁ బరగించె రాజముఖ్య.

62. ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ
జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ
దనికి సత్వరముగఁ దద్గాత్రమున నించె
నరుఁడు పెక్కు మెఱుఁగునారసములు.

63. ఉ. దానికి సీడఁ బోపక యుదగ్రపరాక్రమ మొప్ప వజ్రకీ
లానిభతీక్ష్ణ మెఱుంగులవిలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై సిగిడించెఁ బార్థహృదయస్థలి నారస మస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగునన్నరపాలసుతుండు భూవరా.

-:అర్జునుఁడు బభ్రువాహనునిశరంబుచేతఁ బుడమిం ద్రెళ్లుట:-

సం. 14-78-35

64. క. పడి నది పీపున వెడలినఁ
బడియెఁ బుడమి నర్జునుండు పదపడి త్రెళ్లెం
గొడుకును మున్నతఁ డేసిన
బెడిదపుదెబ్బలయలంతఁ బృథ్వీనాథా

65. వ. అట్లు తనపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగుచుఁ జిత్రాంగద యులూపి(చి)యుం దోడన చనుదెర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి యచ్చెలువ యయ్యిరువురం గనుంగొని యుల్లంబు జల్లనఁ దల్లడిల్లి మూర్ఛ మునింగి మేదినిం బడి కొంత వడికిం దెలిసి యులూపి నాలోకించి.

66. సీ. సీకతంబునఁ బతి నాకుమారునిచేత
నసిఁ బడి యున్నవాఁ డతివ కంటె
నీవు పతివ్రత గావె ధర్మజ్ఞవు
గానిదానవె యేమి కారణమున

నిది కార్యముగఁ జెప్పి తీపిన్నవానికిఁ
గొడుకుదిక్కైన నాకు నడలు లేదు
వరుఁ జూచి పొక్కెద వామాక్షి నీదెసఁ
దప్పు చేసినను నీతనిఁ గృపార్ద్ర

తే. చిత్త వై యెల్లభంగి సంజీవితుఁడుగఁ
జేయవమ్మ యక్కట నాథు నేయఁ బనిచి
చావు చూచియు పగవవు సాహసమున
కొలఁది లేదు ని స్నే మందుఁగులపవిత్రి.

67. వ. అని పలికి పార్థుం జేరం బోయి.

68. ఆ. మహితకీర్తిలోల మత్ప్రాణవల్లభ
యన్యజనులప్రాణ మరసి కావఁ
జాలునట్టినీకు నేల ప్రాణంబుల
నిట్లు వదలి పోవ నిచ్చి యుండ.

69. సీ నాథా నీ వెప్పుడు నన్ను మన్నింతువు
కను విచ్చి చూడక యునికి దగునె
హయమున కెవ్వరు నడ్డంబు రా కుండ
నాగితి వగ్రజునధ్వరంబు
వ మ్మయి పోకుండ లె మ్మితురంగంబు
వెనుకొన వలవదే యనఘ నీకు
నని యార్తిఁ బలవించి యహిపుత్రిదెసఁ జూచి
సుతుఁ డెట్టు లుండినఁ బతికి నిమ్ము

తే. జీవ మాంద్రుఁరఁ బెక్కండ్రఁ జేసికొనుట
పురుషులకుఁ దప్పె భార్య లిత్తెరువునందు
నడవరే యోర్చి నీదుమనమున నింత
యెఱిఁగి కలిగింపు వరు వేయు నేల తల్లి.

70 వ. అని యంత నిలువక.

71. ఆ. కొడుకుచేతఁ జచ్చిపడి యున్న యిక్కురు
కులవరేణ్యుఁ గరుణ గూరి నీవు
బ్రదుకఁ జేయ కున్నఁ బ్రాయోపవేశన
మాచరింతు సహికులాగ్రగణ్య.

72. వ. అని పలికి పతిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యాసీన యై యూరకుండె నట్టియెడ బభ్రువాహనుండు దెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి.

73. ఉ. ఇంచుక యేనియున్ వనట నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బలుకుమాలిననాథుని నుగ్రశత్రులన్
మంచు నినుండువోలెఁ బరిమార్చుమహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి సకిల్బిషచిత్తున కింత పెద్దయే.

74. క. గాదిలితనయుఁ దనగునేఁ
గా దన కిక్కురుకులాగ్రగణ్యుని నిమ్మె
మేదినిఁ గూల్చితి మణికిర
ణోదాత్తం బైనమకుట మూర్విం బొందన్.

75. వ. అని విలాపంబు చేసి విప్పచ్చుతోడ గూడ యజ్ఞతురంగానుసారు లై వచ్చిన యాజ్ఞవల్క్యశిష్య ప్రభృతిబ్రాహ్మణజనంబులు నయనపథ ప్రాప్తులగుటయు.

76. సీ. అధ్వరహయవిషయంబుగా నీ రేమి
పని చేయువా రొక్కొ పార్థుఁ డిట్లు
పడి యున్నవాఁ డని పలివించి జనకుని
నిట్లు చేసినపాపుఁ డెవ్విధమున
నాచరించునొకొ ప్రాయశ్చిత్త మని పల్కఁ
బంద్రెండువర్షముల్ భైక్షవృత్తి
నిమ్మహాత్మునికపాలమ్మున నడపంగ
వలయుఁ గా కొం డెద్ది గలుగ నేర్చు

ఆ. నని యులూపి శిష్యుఁ గనుఁగొని నీవు వ
న్నంగఁ బంద్రి నిట్లు ఖండనమున

విగతజీవితుఁడుగఁ దెగఁ జేసితిని నింక
నెలమిఁ బొందు భరతకులపవిత్ర.

77. వ. అని వెండియు.

78. క. జనకునిఁ దెగటార్చినపా
పునకుం బ్రాణంబుతోడి పొత్తు మనంగా
మనమునఁ జాలిమి గలుగునె
చనుఁ గాక యతండు చనినసద్గతికి తగన్.

79. వ. అని యుగ్గడించి స్థావరంబులు జంగమంబులు నగుభూతంబులు విన భుజంగపుత్త్రియు నాకర్ణింపఁ జెప్పి వ్రతంబు నిష్ఠం బూనెద మాతండ్రి లేకునికి నిజం బగునేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమ కృత్యంబు వీరవధంబు పాపం బంతకంటెను రాజవధం బెక్కు డంత కంటెఁ గడునగ్గలంబు ధార్మికవధంబు జనకవధపాతకం బింత యని కొలంది యిద రా దిట్లుండ వీరుండును రాజును ధార్మికుండును జనకుండును నైనయిమ్మహితాత్ముని వధియించినమహాపాతకుని కేత ద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దీని నడపెద నని పలికి యప్పరమనియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె నప్పుడు.

-:ఉలూపి(చి) సంజీవనమణిచేత నర్జును బ్రదికించుట:-

సం. 14-81-1

80. ఆ. అట్లు తెంపు చేసి యాసీనుఁడైనయా
తల్లిఁ గొడుకు నవనిఁ ద్రెళ్ళి యున్న
విజయుఁ జూచి పాఁపవెలఁది సంజీవన
మణిఁ దలంచెఁ గురుసమాజముఖ్య.

81. వ. తలంచిన భుజంగమంబులకుఁ బరాయణం బైనయమ్మణి యమ్మహా భాగహస్తతలంబునకు వచ్చిన నాభామిని బభ్రువాహనునాననం బాలోకించి.

82. సీ. విజయుండు చచ్చునే వేఁదుఱులార యిం
ద్రునిచేత నైన నీతనికి నొక్క

ద్రునిచేత నైన నీతనికి నొక్క
ప్రియము సేయఁగఁ గోరియును నీకొలఁది యా
రయుబుద్ధి నీతండు రణ మొనర్పఁ
దలఁచిన నివ్వీరుతలఁపు సిద్ధింపఁగఁ
జేయుటకును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహనం బగుమాయాప్ర
యోగంబు నడపితి నుజ్జ్వలాత్మ

తే. నరుఁడు నాయకుఁడు మహత్తరము సుప్రే
యితనితేజ మెవ్వరికిని నెట్లు దాని
నార్ప వచ్చు మీవగ పెల్లఁ దీర్ప నిపుడ
యుత్థితుం డగు నీకౌరవోత్తముండు.

83. వ. మాయాప్రయోగంబ పే ఱొండు గాదు నీకు మీతండ్రితోడ భండ
నంబు సేయ బుద్ధి పుట్టించితి నింతమాత్ర యని తత్ప్రదేశంబున
నున్నయెల్ల జనంబులు నుల్లంబుల నానందంబు నొందఁ బలికి
యమ్మణిపూరపుర పతికరతలంబున నమ్మణి యిచ్చి దీని నిమ్మహాత్ముని
హృదయ దేశంబు మోపు మనవుడు నతం డట్ల చేయుటయుం
బార్థుండు ప్రత్యుజ్జీవితుండయ్యె.

84. తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి యెల్ల
సెలకాంతియు దంతరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు.

85. సీ. వినయ మారంగ నాతని[illegible]
కెఱఁగి భవత్ప్రత్యవీక్షణమున
నిత్యంబుఁ గుశలంబ యయిన నిజ్జనముల
మొగములందుఁ జెల్లి వగవు దోఁచి
యచ్చెరువాటును హర్షంబుఁ గడిరెడు
నిది యేమి చెప్పవే యెఱుఁగ దేని
నాచెప్పినట్లు రణంబున కేతెంచి
తీవు చిత్రాంగద యేల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి(చి) యేమిటి కిపుడు చ
న్దెంచె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మొగిచి య
య్యహితనూజఁ జూపి యతనితోడ.

86. వ. అంతయు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతివదనం బాలోకించి కురువంశనిస్తారకా నిరాకకుం గారణం బేమి యమ్మణి పూరపురనాథునిదెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయదియె యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీ కేమియు నపరాధంబు సేయము గదా యనుటయు.

-: ఉలూపి(చి) యర్జునునితో వసువులకోప ప్రసాదంబుల నెఱింగించుట :-
సం. 14-82-5

87. సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో
నాథ నీయం దొకనాఁడు నెగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డెక్కడి
యది వినీతాత్మ చిత్రాంగదయును
గినియక విను మేను వినతోత్తమాంగ నై
చెప్పెద నీసుతుచేత నీకు
నావహిల్లె నశుభ మాహవంబున నీవు
గంగాతనూజు శిఖండి నెపము

తే. గాఁగ దెగటార్చి తది పాతకంబు దాని
కనఘ నిష్కృతి సేయక తనువు విడిచి
తేని నరకవాసమునకుఁ బోవలయుఁ
గాన నిష్కృతి సేసితిఁ గడఁగి వచ్చి.

88. వ. అది యెట్లంటేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సఖీసమేతంబుగా సురనది స్నానంబునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యింత నంత నొక్క రేవునం దోఁచి కృతస్నాను లై నిజరూపంబున సన్నిహిత యైన గంగాదేవితోడ గాండీవధరుండు శిఖండిం బురస్క

రించుకొని గాంగేయుం డేయ కుండం బరమసాయకంబుల నతనిం
గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చినయయ్యర్జును నేను శాప
సంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమానుభావయు వాని
కొడంబడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ.

89. సీ. అరిగి యే దండ్రికి నత్తెఱం గంతయు
నెఱిఁగించుటయు నతం డెసక మెసఁగ
భయమున రయమునఁ బఱతెంచి వసువులఁ
బెక్కువిధంబులఁ బ్రియము పుట్టఁ
దెలిపి ప్రార్థించిన నలుక వో విడిచి వా
రతనితో విను సమయం బొకండు
చేసెద మనిరోన వాసవిఁ దత్సూనుఁ
డగుబభ్రువాహనుం డస్త్రవితతిఁ

ఆ. గూలిచి గూల్చెనేనిఁ బాయు నక్కల్మష
మనిన మగిడి వచ్చి యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె నాకు నిప్పని దగ
నిట్లు దీర్చితిని సమిద్ధతేజ.

90. వ. తీర్చినతెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యిక్కుమారుండు నీతో సమరంబు చేయ నొల్లక నమస్కరించి మరలి మందిరంబునకుం బోవుచున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవసరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీ తండ్రికిఁ బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యిప్పురుషునియందు వసువులు చెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి.

91. క. అనినఁ బ్రియ మంది దేవి
యనఘుం డగునీపవిత్ర మస్మత్కులవ
ర్ధనకారి యగుట యెప్పుడుఁ
గనినది గాదె యని పలికె గాండీవి నృపా.

92. ఆ. పలికి సాదరముగ బభ్రువాహనుఁ జూచి
మానితాగమిష్యమాణచైత్ర
మాసపౌర్ణమాసి మహితాశ్వమేధకా
లంబు దానిదెసఁ దలంపు గలిగి.

93. క. నీవును దల్లులు బంధుజ
నావళియుం బరిజనములు హస్తినగరికిన్
రావలయు ధర్మజునిసం
భావనముం బడయు టొసఁగుఁ బరమశుభంబున్.

94. చ. అనవుడు నట్ల చేసెద నుదాత్తచరిత్ర పురంబు చొచ్చి యి
వ్వనితలు నీవు నావలనివత్సలతం గొనియాడు చియ్యెడన్
మన మలరంగ నిల్చి జనమాన్యునిఁగా నను జేసి ప్రీతి నే
ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగరక్ష కై.

95. వ. అనుచుం బ్రణతుం డై బభ్రువాహనుండు ప్రార్థించినం బార్థుం డప్పార్థివుతో నేను దీక్షితుండ నగుట యెఱుంగవే నాకుం బుర ప్రవేశంబు చేయం జనదు పోయి వచ్చెద మీరును సుఖుల రయి యుండుం డనిన నట్ల కాక యని యతం డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు చేయ నబ్భామలచేత ననుజ్ఞాతుం డై యమ్మహాత్ముండు యజ్ఞాశ్వంబు ననుసరించె నదియు నిజేచ్ఛ నఖిల దేశంబులం బ్రవర్తిల్లె నట్టియెడ.

96. క. రాజగృహపురముకడ న
వ్వాజి యరుగు టెఱిఁగి యాహవమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు
నాజిష్ణుని మేఘసంధి యనురా జధిపా.

97. వ. అట్టి లప్పురంబుపతి యగుజరాసంధపౌత్త్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱుంగ‍ఁ‍ ఁం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి పుచ్చి తోడన కల్పితరథారూఢుం డై వెడలి యవ్వాసవికి నడ్డపడి.

98. సీ. పనితలలోపలఁ జనియెడుచాడ్పున
నివ్వాజిఁ గొని యుంచు కేని శంక

లేక పోయెదవు పో నీక యేఁ బట్టెద
దేనిఁ గయ్యము చేసె దేనిఁ జేయు
మనుచు నవ్వుచు నతం డమ్మగధేశుతో
విఘ్నకర్తల నేను వెదవుతోడ
మాన్పింతు వినుము నామనమునఁ గిన్కలే
దని యెట్టు లనిన మదగ్రజుండు

తే. సామమునన కర్జము నీవు చక్కఁ బెట్టి
కొందు గాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలవ దని నాకుఁ జెప్పినవాఁడు గాన
యట్లు చేయుదు నీయిష్ట మాచరింపు.

-:అర్జునుఁడు జరాసంధపౌత్రునితో యుద్ధంబు చేసి మోదించుట:-
సం. 14-83-1

99. చ. అనవుడు నేమియుం బలుక కాన్నృపపుత్త్రుఁడు నిర్జరేంద్రపు
త్త్రునిపయి నుజ్జ్వలంబు లగుతూపుగముల్ వరఁగింప వాని నె
ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁ డయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా.

100. వ. అర్జునవిక్రమ యే మని చెప్పుదు.

101. క. తనమీఁద మగధుఁ డేయఁగ
జననాయక రథ్యములను సారథి నైనఁ
గొనకొని నొప్పింపక య
ల్లన శరనికరంబు పైఁ గలయ నిగిడించెన్.

102. క. అది బలహీనతగాఁ గొని
మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గదిసి బలునారసంబులు
తదంగమునఁ గ్రుచ్చె నతఁడు దాన నలిగియున్.

103. వ. ఆసహదేవపుత్త్రుగాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబులు నిగిడించి.

104. ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడిచేసిన నమ్మగధుండు కీరతో

188. సీ. అప్పుడు కాలపర్యాయమున కాశ్చర్య
మును విషాదముఁ దనమనములోనఁ
బిడిగొన బాహువిస్ఫురణకోదండదం
డమున నాబోయల సమదవృత్తి
నెట్టకేలకు నొకయెడ మాన్చి రుక్మిణి
యాదిగాఁ గలకృష్ణునగ్రమహిషు
లెనమంద్ర బలదేవువనితల మఱియును
గతిపయయాదవాంగనలఁ గాచెఁ

తే. దక్కఁ గలయింతిగముల నాదస్యు లదరి
పట్టికొని యేచి వీ దెల్ల బన్నపడఁగ
దొడ్డగొని రథకుంజరతురగతతులు
దమకు వలవ కునికిఁ దిగ ద్రావి చనిరి.

189. క. ఇమ్మాడ్కిం బఱివోయిన
యమ్మొత్తము నడపికొనుచు నతిదైన్యము చి
త్తమ్మలఁ బంగఁ గురుక్షే
త్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా.

190. క. చని యచట నచటఁ దస్నుం
గను నాప్రజనంబుతోడఁ గాలవశత్వం
బునఁ బొందిన యద్దశఁ దగ
వొనర నతఁడు సెప్పెఁ బొచ్చె మురివినమదితోన్.

191. సీ. కోపించి గాంధారి శాప మిచ్చినయది
యాదవసంక్షయ మగుట యెట్లుఁ
దప్పదు మనము తద్బాలవృద్ధస్త్రీజ
నంబుల నెల్ల నర్థాంబు లైన
తావుల సత్ప్రతిష్ఠావిశోకంబులఁ
గాఁ జేయవలయు నక్కాలమునకు
నొదవి యత్తెఱఁగున కుత్సహించుట
మర్జున నీ కని యాడుచుండుఁ

ఆ. బలుమఱును దలంచి పాండవాగ్రజుఁ డది
కారణముగ నతనికరుణ పెంపు
నొప్పు నెఱుఁగుఁ గాన యప్పార్థుఁ డయ్యదు
నికరశేషజనుల నెమ్మి నిలిపె.

192. సీ. నిలిపినతెఱఁ గెల్ల నృపవర చెప్పెద
వినుకృతవర్మనందనునిఁ జూచి
నీతల్లియును నీవు నీతోడఁ బుట్టిన
వారును మృత్తికావతపురమున
నిలుఁ డని బహుసంపదలఁ బొల్చునప్పట్టి
ణంబుఁ దదీయదేశంబు నిచ్చి
యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరి
జనములుఁ దాను హర్షం బెలర్ప

తే. నందుఁ బోయె సరస్వతి యనఁగఁ బరఁగు
ఘననగరమున సాత్యకితనయు నట్ల
నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి
యనుప ముదమున నందుల కతఁడు చనియె.

193. సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబు
నకుఁ గొని చని వజ్రు నాథుఁ గాఁగ
నందుఁ బట్టము గట్టి హస్తితురంగర
థంబుల విభజించి తగినభంగి
నమ్మువ్వురకును సమర్పితంబులు సేసి
యయ్యాయిబంధుల నందు నందు
నందును నిలుచున ట్లొందఁగ నియమించి
యక్రూరుభార్యల నాత్మజులను

తే. వజ్రునకు నప్పగించె నవ్వాసుదేవు
పౌత్త్రిఁ డతివినయంబునఁ బట్టువఱుప
వారు నిలువక పోయిరి వలచునెడకు
దాని విని యూరకుండె భీమానుజుండు.

-:అర్జునుఁడు రామకృష్ణులనిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట:-

194. క. యాదవకుటుంబముల న
త్యాదరమున నట్లు నిలిపి హలధరుఁడును దా
మోదరుఁడుఁ దెగుట వారల
గాదిలి పౌలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్.

195. చ. తలఁచి యతండు మందగతిఁ దానును నర్వ జనోత్కరంబు వా
రలకడ కేఁగి శోకవిధురం బగుచిత్తముతోడఁ దారు గా
నల కటు వోయి పంకరుహనాభుని రాముని రోసి పల్కినం
బులు భ్రమ సంచరించుటయు బోయ తముం గని దయార్ద్రచిత్తుఁ డై.

196. క. కందువచోటికిఁ గొని పో
వం దా రరుగుటయుఁ జెప్పి వనట గదిరినన్
డెందము గలంగఁ గన్నీ
రందంద మొగంబుమీఁద నగ్గల ముఠలన్.

197. సీ. తలవాంచి యేమియుఁ బలుకక యప్పార్థుఁ
డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ
గతి కేఁగు టెఱిఁగి శోకము మూర్తులొందిన
తెఱఁగునఁ బొగిలియు ధీరభావ
మాత్మల నెలకొన్న నన్న నీ విం తేల
యడలెదు కాలపర్యయము నుడుప
వశమె యెవ్వరికిని వార్తలకొఱఁతఁ జె
ప్పుము మాకుననుడు నప్పుణ్యచరితుఁ

ఆ. దడవిలోన నేము తడిసినదినముల
న్నియుగణించి యంబునిధి పురంబు
రేపకడయ ముంచు నేపాట నిమ్మెయి
వచ్చునెడరు దలఁగువార మొక్కొ

198. చ అనుతలఁ పాత్మ నొందుటయు నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె
ప్పిన నుచితంపుభంగులకుఁ బెద్దయు బ్రొద్దు చనంగ నప్పురం

బునఁ గలవిప్రముఖ్యజనముల్ పయనంబున కర్హ మైనవ
ర్తన మొనరింప లేమి జలరాశి మునుంగుదు రట్లు గావునన్.

199. చ. హరికిని రామదేవునకు నర్హవిధానము లాచరించి యె
వ్వరికిని జెప్ప కెల్లపరివారముఁ బౌరులు సామజాదులున్
సరకులు నాయితంబు లగుసంఘటనం బొనరించి నాఁటికిం
గర మవధానయుక్తి సనుకట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్.

200. తే. వినుఁడు యాదవభామినీ వృద్ధబాల
జనుల నందఱ నుచితవర్తనముతోడఁ
బ్రొద్దు వొడువక ముందర పురజన ప్ర
యుతముగాఁ బురి వెలువరించితిఁ గడంగి.

201. ఆ. దానఁ జేసి మీరు నేమను బ్రయ్యు బా
పంబు లేక నెడలఁ బడితి మిదియ
తల్లులార కరము తప్పయి తోఁచుట
నుల్ల మలఁతపేర్మి నరియుచుండు.

202. క. వినుఁ డీతప్పున దోషము
దనుకక యుండంగ నన్ను దయతోఁ జూడుం
డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ
గని యందఱు నెత్తి యతని గారవ మెసఁగన్.

203. క. ఊరార్చి యింక నుచితా
చారంబులు నడపుటయ యిచటఁ గృత్యము దు
ర్వారం బగువిధిచేఁతకు
నేరికి నడ్డపడ వశమె యేల యలఁదురన్.

-: *రుక్మిణీదేవి మొదలగుకృష్ణభార్య లగ్నిప్రవేశము చేయుట* :-

సం. 16-8-71

204. సీ. అని పల్కి రప్పుడునందు రుక్మిణియు జాం
బవతియు లోనగుపద్మముఖులు
గొందఱు గోరిరి కురునాథ యనుమర
ణమునకు బంధుజనంబు లెల్ల

శోకార్తులై రోదనాకులత్వము నొంది
రనుమృతికలనకు నమరి యున్న
యాబలదేవ మురాంతకమహిషుల
కతివిభవం బైనయానకల్ప

తే. నంబు నాకల్పరచనంబు నడిపి నరుఁడు
చందనాగురుమయచితాసంవిధాన
మాచరించి యర్హ ప్రకారాగ్ని విధి యొ
నర్చె మహనీయవిప్రజనంబుఁ బనిచి.

205. క. విను సత్యభామ లోనగు
వనతాజను లధికనియతి వనములకుఁ దపం
బొనరింపఁ బూని కొందఱు
చని రవ్విధమున నలు ప్రసత్కర్మం డై.

206. తే. అఖిల బంధుజనంబుల నాప్తజనుల
నర్థవాక్యప్రయుక్తి నూరార్చి యుచిత
మార నామంత్రితులఁ జేసి యప్పు లురులఁ
బోయె నాక్రీడి సాత్యవతేయుగుఱిచి.

*:- అర్జునుఁడు వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవక్షయంబు చెప్పుట :-*
సం. 16-9-1

207. సీ. పోయి మరున్నదిపొంత యాశ్రమమున
నర్హాసనమున నేకాంత నిరతి
నాసీనుఁ డై యున్న యమ్మహాత్మునిఁ గని
యత్యంత భక్తి సాష్టాంగవినతి
యాచరించినఁ జూచి యమ్మహనీయవి
ద్యానిధి సేరంగ నతనిఁ బిలిచి
తనసమీపంబున నునిచి తద్వదనమ్ముఁ
గనుఁగొని ని న్నెఱుఁగంగ రాదు

తే. వెడమొగం బైన దిది యేను విజయ యెట్టి
కేల కెఱిఁగితి నిది మి మేకినుక వొడమి

వధమునకు నయోగ్యం డగువానిఁ జంపి
తే పరాజితుఁ డైతె నీతెఱఁగు సెపుమ.

208. చ అనవుడు నాతఁ డిట్టు లను నమ్మహాత్మునితోడఁ బద్మలో
చనుఁడు నవాంబుదప్రతిమచారు తనూలసితుండు దేవకీ
తనయుఁడు రామదేవుఁడును దానును మేను దొఱంగి పోయె నే
మనఁ గల దెల్లయాదవులు నాఁడ బోయిరి సంయమీశ్వరా.

209. క మహితాయుధసంప్రహతులు
సహించుదృఢదేహ ధృతులసడి సన్నమహో
త్సహులు యాదవవీరులు
నిహతు లయిరి తుంగలను మనీషిప్రవరా.

210. తే. అట్లు రామకృష్ణులు సర్వయాదవులును
దెగినఁ జిత్తంబు పొగులంగ మగువపిండు
బాలవృద్ధులఁ గొని రాఁగఁ బథమునందు
నన్ను బోయలు దాఁకిన నగుచు నేను.

211. చ ఘనతరబాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు
న్మనమున నచ్చి యప్డు మునినాథ కడంగితి నెట్టకేల క
ద్ధనువు గుణంబుఁ గూర్చితి నుదగ్రత బాహుల లేక యుండె న
స్త్రనికరమంత్రతంత్రములు సంస్మృతి బొందవ యేమి సెప్పుదున్.

212. క. బోయల సంహృతికిఁ బ్రకృతి
సాయకసంపాతనములు సాలవె యని యే
నేయఁ దొడఁగ దొనలు చెనటు
లై యుండె నొకండుఁ జేయునది లేదయ్యెన్.

213. క. నెవ్వగయు నచ్చెరువు మది
నివ్వటిలఁగ నప్పు డేను నివ్వెఱ పడితిన్
జివ్వన ముసరి కిరాతులు
క్రొవ్వెసకం బెసఁగఁ జూఱగొని రజ్జనులన్.

214. ఆ. చాపదండ నిహతి నోపినభంగిఁ గి
రాతకోటి నాఁగి రామకృష్ణ

వల్లభాదు లైనవనితలఁ గొందఱ
వృద్ధబాలకులను వెరవుతోడ.

215. క. కాచికొని వచ్చి తగ నా
నేచినయ ట్లచట నచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును
నై చిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్.

216. తే. పడనిపాటు వాటిల్లిన వెడమొగంబు
వడక యె ట్లుండ వచ్చుఁ దపఃప్రకీర్త
నీయ యిం కిట నే నేమిసేయువాఁడ
నెసఁగుదయతోడ నానతి యిమ్ము నాకు.

-:వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము చేయుట:-
సం. 18-9-25

217. సీ. అన విని యమ్మహాముని క్రీడి కి ట్లను
సంయమిదత్తోగ్రశాపనిహతి
నఖిలయాదవులును న శ్లెరి దానికి
నడలఁగఁ బని లేదు హరి యెఱుంగు
మున్న యాసంక్షయ మన్న చెప్పెద విను
ప్రాప్తకాలం బగుపనికి నడ్డ
పడ నేల యని యాత్మ భావించి యతఁ డుపే
క్షాపరుఁ డై యుండెఁ గాక మూఁడు

తే. భువనములు నన్యథాత్వంబుఁ జేయఁ
జాలువాఁడు కణ్వాదులశాప ముడుప
శక్తి లే కుండెనే యవశ్యంబు భావి
యైనయది గాన యదునాశ మయ్యెఁ జువ్వె.

218. ఉ. నీ వని సేయ నీవలనినెయ్యమునం గృప నన్యసైన్యముం
దా వధియించు శూలధరతాస్ఫురణం బెసఁగంగ ముంద ర
ద్దేవుఁడు దానిఁగాంచు భవదీయసమంచిత దృష్టియున్ నినుం
గావఁడ యాముదాంతకుఁడు కాలవిపర్యయ మావహిల్లుటన్.

219 చ. ధరణిభరంబు వాప నవతారము నొందినవిష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కలనిర్వికారభా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ గుందుదురే మిముబోఁటిబోధనుల్.

220. మ. అవనీభారము వాపి తా హరికిఁ దోడై భీమసాహాయ్యగౌ
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
ప్రవితానంబున నిన్ను బాసి చనియెన్ దైవప్రకారజ్ఞ నీ
దుఃఖరిష్ఠాచరణంబునన్ సురలు సంతోషించి రవ్వీరులన్.

221. క. బలమును బుద్ధియుఁ జేవయు
నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునం
బొలియుం గాలవిపర్యయ
కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే.

222. తే. కాలమూలంబు సర్వంబుఁ గాన దీని
కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్యజనంబులు వినుతి సేయ.

223. సీ. అన విని శోక మోహంబులు వాసిన
డెందంబు నిర్భరానంద మొందఁ
నధికభక్తియు వినయంబును దలకొన
నర్జునుఁ డమ్మహితాత్ము వీడు
కొని వారణపురికిఁ జనుదెంచి ధర్మజుఁ
గని తనపోయివచ్చిన తెఱంగు
వినిపించె సర్వంబు నని యిట్లు సంయమి
సుతుఁడు వైశంపాయనుండు రామ

తే. కృష్ణు లాదిగఁ గల్గినవృష్ణిచయము
భోజసంతతి యంధకరాజి నూత్న
వృత్తములు జనమేజయవిభున కింపు
సెవులఁ దళుకొత్త నేర్పడఁ జెప్పుటయును.

224. శా. కాలస్వైరవిహారభంజన కళాకౌతూహలస్తవ్య దు
శ్శీలాంతఃకరణావిభావ్య కరుణా శ్రీమందిరాపాంగ మం
త్రాశీవాచ్య సుధామయాంగ పవన వ్యాపారరోధక్రియా
శాలిస్వాంత సముల్లసద్విహరణా సంసార విస్తారణా.

225. క. హృదయకమలమధురూపా
విదారితదురంతతాప వేదస్తోమా
స్పదపారాశర్యమన
స్పదనా దివిజ శుభకృద్వచన పరవదనా.

226. మాలిని. అమరగణవిరోధి వ్యాపదాపాదికోపా
శమిత వినత చిత్తా సంగిగాథ త్రితాపా
యమనియమ వికాసిధ్యానగేహప్రదీపా
దమశమ కలితానంద ప్రకాశస్వరూపా.

గద్యము : ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజితిక్కన సోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు
మౌసలపర్వంబు సర్వంబు నేకాశ్వాసము.

# శ్రీ మదాంధ్ర మహాభారతము

## మహాప్రస్థానికపర్వము - ఏకాశ్వాసము

శ్రీపదసీమావాప్తిస
మాపాదనకేళికౌతుకాధీనదయా
వ్యాపారసకలవేదో
హాపోహాతీతసార హరిహరనాథా.

2 వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె నట్లు కృష్ణుని
పరమానందపదప్రాప్తియు బలభద్రుని యనంతత్వసిద్ధియు సకల
యాదవమౌసలాహవప్రకారంబును నెఱింగి పదంపడి పాండవు
లెత్తెఱంగున వర్తించిరి మునీంద్రా యెఱింగింపుము.

3. క. అని యడిగిన వైశంపా
యనుఁ డక్కురుపుంగవుసమాదరణంబున్
వినయంబుఁ గౌతుకముఁ బెం
పును సంభావించి యవ్విభున కిట్లనియెన్.

4. సీ. అర్జునుం డమ్మెయి నచ్యుతరామాది
యాదవజనులవృత్తాంతములును
దనదుతెఱంగు సత్యవతీతనూభవు
హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు
నకు మది యొలయ నన్నరునితోడ
నఖిలభూతంబుల ననఘ పాకంబుఁ బొం
దించుఁ గాలుండు మదీయబుద్ధి

తే. కర్మసంత్యాగకలనంబు కార్య మిప్పు
డనువినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గను చున్కి విదిత మయ్యె
నాకు ననవుడు నయ్యింద్రనందనుండు.

5. వ. అన్న రేంద్రున కి ట్లనియె

6. క. కాలము నే మనవచ్చును
గాలముఁ గాలంబ పోలుఁ గా కొంటికి నీ
లీలలు గలవే లెస్సగ
నాలోకించి తిది హితము నభిమతము నగున్.

7. చ. అని తనమాట కియ్యకొనునన్నరుపల్కులకిచ్చ మెచ్చి య
జ్జనపతి భీమునిం గవలఁ జయ్యనఁ బిల్వఁగఁ బంచి య త్తెఱం
గు నెఱి నెఱుంగఁ జెప్ప ననుకూలత వారలయందుఁ దద్దగ
ల్గినఁ దెలి వగ్గలింప నెఱిఁగించె యుయుత్సున కవ్విశేషమున్.

8. క. ఎఱిఁగించి రాజ్యతంత్రము
తెఱఁగుపఱిచి నడపువెరవు తేటపడంగాఁ
దెలిపి గృహాంతశ్చరితము
నెఱి నుపదేశించె నధిప నెయ్యం బలరన్.

9. క. ఆయనుజుని నట్లు మహా
నాయకుఁ గావించి భటజనముఁ గూర్చి మహీ
నాయకుఁ డార్యులు కీర్తన
సేయఁ బరీక్షితుని రాజుఁ జేసె ధరణికిన్.

10. వ. ఇ ట్లభిమన్యుపుత్త్రి నభిషిక్తుం జేసి యతనికిం బూజ్యసామ్రాజ్య
పరిపాలన ప్రకారంబు లుపదేశించి కురుకులపవిత్రసముచితచరిత్రభద్ర
యగుసుభద్ర కి ట్లనియె.

11. మ. భవదీయాత్మజునాత్మజుండు కురుభూభారోద్వహుం డయ్యె యా
దవవంశోత్తరుఁ డైనవజ్రునకు నింద్రప్రస్థరాజ్యంబు గౌ
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రా రక్షణీయంబు లై
నవి యీయిండులు రెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమీ.

12. క. విను శేషించినయాదవ
జనులకు నావజ్రనృపతి సంరక్షకుఁ డా
తనిఁ బోషించుట ధర్మం
బనఘా యది లేమి ధర్మహాని యగుఁ జుమీ.

13. క. అని తారు గృహంబు వెడలి
చనునెడ నవ్వనిత పిఱుఁదఁ జనుదే కుండన్
జననాథ యతఁడు నియమిం
చినవాఁ డై యూరడిల్లఁ జిత్తములోనన్.

14. చ. పదపడి భారతాజిమృతబాంధవకోటికి మౌసలాజి సు
న్మృదు లయి పడ్డయాదవజనంబులకుం బరలోకసౌఖ్యసం
పద కయి చేసె నక్కురునృపాలవరిష్ఠుఁ డనేకదానముల్
రదనితురంగగోకనకరత్నమయంబులు గా ముదంబునన్.

15. క. భూదానంబులునుం గ
న్యాదానంబులును జేసె నన్నరపతి వా
సోదానంబులు నత్యం
తాదరమున నాచరించి యరదము లిచ్చెన్.

16. తే. ఇట్లు ధౌమ్యాదివిప్రుల కెల్లఁ దృప్తి
యెసఁగ బహువస్తుకోటుల నొసఁగి కృపుని
ననమునను బహుమానంబునను బ్రమోద
భరితుఁగాఁ జేసెఁ గురుపతి కురువరేణ్య.

17. వ. శేషించినకాంచనరత్నాదు లాక్షితిపతి పరిక్షితునకుఁ బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపద ప్రవరజనంబుల రావించి.

18. సీ. ఆపార్థపౌత్త్రినిఁ జూపి మాయేవుర
మాఱుగా మీ రిక్కుమారవరునిఁ
గైకొని తగ నెల్లకార్యజాతంబును
నడపుచు ననురక్తి నాఁడునాఁటి

కెక్కు డగుచు నుండ నీతనియుల్లంబు
రంజిల్ల సమ్యగారాధనంబు
నందు సంప్రవణుల రగుండయ్య యని పల్కి
తమనిశ్చయంబు నుదాత్తభంగిఁ

తే. జెప్పుటయు వారు మొగములు చిన్నవోవ
మము నుపేక్షించి యిటు సేఁత సముచితంబె
నీదుచిత్తంబు కారుణ్యనిలయ మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల.

19. వ. అని గద్గదకంఠు లగుచు నాడినమాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మఱుమాట లాడి తమగమనంబులకు తజ్జనంబుల నియ్యకొల్పెనప్పు డందులోనం గొందఱు గొందఱనివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటంజేసి కాదే యిట్టివి పుట్టెడు నని తలంచి నవ్వి నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు (మన) మనువులు సాలు నని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు ద్రౌపదియు నట్లచేసి రందఱుం దత్కాలోచితంబు లగు నిష్టావిధానంబులాచరించి యగ్నుల నంబుగతంబులు సేసి మొగ,ఱుంవెలి వగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠం బోవ సప్తమం బై యొక్కసారమేయంబు వారల వెనుకఁ జనియె నప్పుడు.

20. సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా
వచ్చి రక్కురువంశవరులఁ జూడఁ
దత్సమయంబు జూదమునాఁడు వెడలి వా
రరిగెడు నయ్యవసరముఁ బోలె
భటసమేతముగ నప్పాండుతనూజుల
తోన యుయుత్సుండు దాను నరిగె
భవదీయజనకుఁ దత్కాంతరసతు లెల్ల
ననుగమించిరి వారి మనుజనాథ

తే. యిట్లు కరిపురి వెలువడి యేఁగె ధర్మ
తనయుఁ డందఱు నెంతయు దవ్వు గాఁగ
నాలయ కేఁగి రొకళ్లనుఁ జూచి నిలువు
మనఁడు తలవాంచి యారాజు సనుచు నుండె.

21. చ. తనువులు దూల నందఱుఁ బ్రదక్షిణముల్ వినుతప్రణామముల్
వినయసమేతు లై నడపి వీడ్కొని రాన్నృపతిం గ్రమక్రమం
బున నిటు లుమ్మలంబు మనముల్ పొగిలింపఁగ వచ్చి చొచ్చి ర
జ్జనములునుం బరిక్షితుడు సామజపట్టణ మస్ఫురద్గతిన్.

22. వ. ఆసమయంబున.

23. తే. జనకుకడకు నులూచి భుజంగలోక
మునకుఁ బోయెఁ జిత్రాంగద తనతనూజుఁ
డై నబభ్రువాహనుపాలి కరిగెఁ దక్కుఁ
గలుగుసతు లెల్ల నీతండ్రికడన నిలువ.

24. వ. అప్పుడు.

25. సీ. కృపుడు ధౌమ్యుండు నాన్నృపతినిఁ దగువారి
నర్థభాషణముల ననునయించి
యెలమి చిత్తంబులఁ దలకొల్పి పౌరులఁ
దగఁ జేర్చి పనుల నుత్సాహ మెసఁగ
వర్తింపఁ జేసిన వారణపురి పూర్వ
భంగి సంపత్పరిభరిత మయ్యె
నట ధర్మజుండు ముందటఁ జనఁ గ్రమమున
ననుగమించిరి పవనాత్మజుండు

తే. నర్జునుఁడు నకులుఁడు దదవరజుండు
ద్రౌపదియు నిట్లు సనుచుండఁ దగిలి వారి
వెనుక విడువక శునకంబుఁ జనియె నవ్వి
ధమున వారు మహాపథగమనమునకు.

26. వ. పూని యుపవాసవ్రతపరు లై భాగీరథిపొంతకుం జని యంత
నుండియుఁ బ్రాఙ్ముఖవర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరి

సరిదరణ్యంబు లనేకంబులు గడచి పూర్వసముద్రతీరంబు సేరి
రట్టియెడ.

27\. క. దిక్కులు మేఘపథంబును
బిక్కటిలఁగ నవయవములు భీషణములుగా
నొక్కయెడ నగ్నిదేవుం
డక్కౌరవవంశవరులయగ్రతలమునన్.

-:అగ్నిదేవుఁ డర్జునుచేతిగాండీవంబు సముద్రంబున వైపింపుట:-

సం. 1 -1-33

28\. సీ. నిలిచి బీభత్సుండు నిర్భరస్నేహంబు
కతమున విడువక గాండివంబుఁ
గొని వచ్చుచున్న నాతనితోడ నవ్వాయు
సఖుఁ డోధనంజయా శౌరి చక్ర
మెన్నఁడే దివమున కేఁగె నీవేల గాం
డీవంబు విడువవు దేవకార్య
మునకుఁ గా వరుణదేవునిచేత నేను దె
చ్చినాఁడ నిది ధనుశ్శ్రేష్ఠ మమ్మ

తే. హానుభావుని కొప్పింపు మనిన నెవ్వ
యట్లు సేయుదుఁ గాక యని యుక్కిరీటి
యగ్రజానుమతికిఁ జెప్పి యంబరమున
నాతఁ దచ్చాప మంబుధియందుఁ బెట్టె

29\. వ. తదనంతరంబ కృశానుం డంతర్ధానంబు సేసె నయ్యోగపరాయణులు
చనం జని.

30\. ఆ. దక్షిణాభిముఖతఁ దలకొని యిలకుఁ బ్ర
దక్షిణంబు గాఁగఁ దమమనములు
తద్ద ముదము నొంద నద్దెస వార్ధి యు
పాంతమునకు నేఁగి రధిపముఖ్యు.

31\. వ. అచ్చటినుండి.

క. పడమరమొగ మై పశ్చిమ
జడనిధితీరంబు సేరఁ జని యుత్తర మె
క్కుడు నియతి నడచి వారధిఁ
బొడ వడఁగినయాదవేంద్రుపురి చేరువగన్.

వ. అటఁ జని యక్రమంబున హిమాచలమున్ సమతిక్రమించి వా
రటవులు భూములున్ నదులు నద్రులనుం గడుఁ బెక్కు లంచితో
త్కటధ్యానయోగసేవననితాంతనిరాకులవర్తనంబు నొం
దుచు గతఖేదు లై కడచి తూలక మేరుసమీపభూమికిన్.

-: ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట:-
సం. 17-2-3

సీ. చనుచున్న డయ్యేడ్వురును నతిస్థిరయోగ
సాధనపరు లయి సత్వరముగఁ
బోవంగఁ బాంచాలభూప పుత్రిక యోగ
మెడలిన మేదినిఁ బడియె నధిప
పవన సమీరణుకొడుకు కనుంగొని
యన్నతోఁ జెప్పి యయ్యతివవలనఁ
గాన మెన్నఁడు ధర్మహాని యి ట్లగుటకు
నరయంగఁ గత మేమి యని విషణ్ణుఁ

తే. డగుచు నడిగిన నాతఁ డిమ్మగువ యింద్ర
తనయుదెసఁ బక్షపాతిని దానఁ జేసి
సుకృతములు ఫలియింపమిఁ జూవె దీని
కిట్టిదురవస్థ వాటిల్లె నీద్యచరిత.

క. అని పలికి సమాధానము
దనబుద్ధిం దిరము చేసి ధైర్యస్థైర్యం
బున వికృతి లేనిగతి నా
వనితశవము విడిచి కౌరవవిభుం డేగెన్.

సీ. భూవర యమ్మెయిఁ బోవంగ సహదేవుఁ
డపగతప్రాణుఁ డై యవనిఁ బడినఁ

గని వాయుజుఁడు ధర్మతనయున కెఱిఁగించి
యితఁ డనహంకారుఁ డెపుడు నీకు
నతిభక్తి శుశ్రూష యాచరించుచు నుండు
మాలోన నెల్ల సన్మార్గవర్తి
యితనికి నేలకో యిద్దెస వాటిల్లె
ననిన నమ్మనుజేంద్రుఁ డతనితోడ

తే. వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుండు లేఁడు జగతి
నెందు నని సంతతమ్ముఁ దా నెద్దఁ దలఁచు
దాన ని ట్లయ్యె నం చుపేక్షానిరూఢ
బుద్ధి నరుగుచు నుండె నప్పురుషవరుఁడు.

37. క. అనిలజుఁడు నరుఁడు నకులుఁడు
శునకంబును దోన నరుగ సుస్థిరమతియై
మనుజేంద్రవర్యు యట్ల
జ్జనపతి సన నకులుతనువు జగతిం బడియెన్.

38. క. విను ద్రుపదనందనయుఁ దన
యనుజన్ముఁడు నంత నంత నవనిఁ బడుటఁ దాఁ
గని ధృతి దూలినయట్లు వ
డిననకులునిఁ జూచి యడలు డెందముతోడన్.

39. సీ. అనిలసూనుఁడు ధర్మతనయున కెఱిఁగించి
యవ్విభుతో సుందరాకృతియును
శౌర్యంబు ధైర్యంబు సౌజన్యమును గుణ
సంఘమునన కాదు జగతి నెందు
నితనికిఁ బోలె నహీనత మెఱయునే
యెవ్వరికైనను నిట్టిపుణ్యుఁ
గుత్సితదశ యె ట్లొకో పొందె నక్కట
యనవుడు నకౌరవాగ్రగణ్యుఁ

తే. డతని కిట్లను నీతండు నాత్మసదృశుఁ
డఖిలజగముల లేఁడు రూపాతిశయము

తనకు కల దని యెపుడుఁ జిత్తమునఁ దలఁచు
నయ్యహంకృతి నిట్టికీ డయ్యెఁ జువ్వె.

40. క. అని ధృతిసారం బూఁది య
తనితనువు నుపేక్షఁ గూర్చి ధర్మతనూజుం
డనఘ చను చుండెఁ దక్కటి
యనుజులు గుర్కారముఁ దోన యరుగుచు నుండన్.

41. సీ. ద్రౌపదిపాటును దనయనుజన్ముల
పడుటయుఁ గనుఁగొని పార్థుఁ డాత్మ
యలమట మునిఁగిన నిల విగతాసుఁ డై
పడినఁ గుందుచుఁ జూచి బకవిరోధి
యన్నకుఁ జూపి యీాయమలచరిత్రుని
యం దెన్నఁడును నసత్యంబు గాన
మిటు వడుటకుఁ గత మేమి నావుడు నీతఁ
డకార్యరవుల నెల్ల నొక్కనాఁడ

తే. యాహవంబునఁ దెగటార్తు ననియె నట్లు
సేయఁ డయ్యెఁ బ లొక్కక్కటి సేఁత యొకటి
యగుట చాలదోషము విను మదియుఁ గాక
యెల్లకోదండధరుల గర్హించుచుండు.

42. ఉ. దానను దాన నిట్లగుట తప్పనె యంచుఁ దదీయ మైనయ
మ్మానితదేహమున్ విడిచి మానవనాథుఁడు తాల్మిఁ జేసి బ
ద్ధానిరతాత్ముఁడై యరిగె నత్తఱి వాయుజుఁ డార్తి నెంతయున్.
దీనతఁ బొంది ధైర్యలత ద్రెవ్విన నేలకు వ్రాలి భూవరా.

43. క. అప్పుడు పగ ని ట్లను నతఁ
డప్పౌరవరున కోధరాధిప కనుఁగొ
మ్మిప్పా టేమిట వచ్చెం
జెప్పు మెఱుఁగు దేనిఁ గరుణ చిగు రొత్తంగన్.

44. చ. అన విని యాతఁ డిట్లనియె నాతనితో భవదీయ మైనభో
జన మతిమాత్ర ముద్ధతిఁ బ్రచండుఁడ వై భుజశక్తి నెవ్వరిం

50 శా. తోడఁబుట్టువు లందఱుం బడినయాదుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు సౌకుమార్యవతి దప్పిం గూడెఁ బాంచాలి వా
ర్ధోడై వచ్చిరి పాప లేక యిటు మీతో రాను వార్లెల్ల నా
తోడం గూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ కావింపవే.

51. చ. అన విని యింద్రుఁ డిట్లనియె నక్కురుభర్తకు శోక మేల నీ
యనుజులు ద్రౌపదీసహితులై తనువుల్ డిగఁ ద్రావి చన్నవా
రనఘ సమస్తలోకమున కక్కడ గాంచెదు గాక వారలం
దనువు లొఱంగఁగా నగుఁ ధర్మమయాత్మక నీవు రావనా.

-: ధర్మరాజ సురరాజులకుఁ గుక్కరవిషయముగా జరిగిన వివాదము:-

సం 17-8-7.

52. సీ. అనుటయు ధర్మజుం డమరేంద్రుతో నన్ను
నత్యంతదృఢభక్తి నాశ్రయించి
పుర మేను వెడలునప్పుడు మొదల్గాఁ దోన
నరుదెంచె నీభవ్యసారమేయ
మిది యట రావలదే నామనంబు ని
ష్ఠురవృత్తి కోర్వ దస్తోకపుణ్య
విరతాత్మ నావుడు దరహాస మొప్ప న
బ్బలవైరి యిట్లంట పాడియే య

తే. మర్త్యభావము కుక్కకేమాడ్కిఁ గలుగు
ననఘ నీచింత తెఱఁ గరక్యంబు దీని
విడిచి చను తేల నిష్ఠురవృత్తి యయ్యె
నిచటఁ దడయంగ నేటికి నెక్కు రథము.

53. వ. అనిన నమ్మనుజేంద్రుం డింద్రునితోడ ననార్యంబును దుష్కరంబును
నగు కార్యం బేనియు నార్యుండును బ్రభుండును నైననీయట్టి సత్పు
రుషుండు సంశ్రితులకై సంఘటింప వలదె భక్తపరిత్యాగంబు చేసి పద
యుసిరి నాకు నెంత యింప య్యెడు ననుటయు నయ్యనిమిష
నాథుండు.

54. చ. అలుక హరించు ధర్మముల నట్లగుటం గురువంశవర్య నీ
వలుగక విమ్ము కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం

గలుగునె నీకు నిష్ఠురత గల్గమి దీనిఁ బరిత్యజించినం
జలము కొనంగ నేల శుభసంగమనం బెడసేఁత కృత్య మే.

55. సీ. అనపుడు ధర్మనందనుఁ డమ్మహాత్మతో
విసుభక్తియుక్తునివిడువు బ్రహ్మ
హత్యఁ బోలెడిపాప మని చెప్పుదురు పెద్ద
లట్లు గావున దీని నఖిలధర్మ
సారజ్ఞ విడుచుట చనదు దివ్యసుఖంబు
నకుఁ గాఁగఁ బాపంబునకుఁ జొరంగఁ
జాల నాపుడును వాసవుఁడు వ్రతస్థుండు
కుక్క నంటినవారి కోరిచేయు

తే. సుకృతమునకు నాశం బగు సువ్రతాత్మ
యింత యొప్పనినిర్బంధ మేల చెపుమ
విడువు మీశునకము దీని విడువఁబడుట
నాకలోకసౌఖ్యంబు నొనర్చు నీకు.

56. చ. జనులు నుతింపఁగా సుకృతసంపదఁ జేసి యమర్త్యభావముం
గనియును జెంద కిట్లునికి కార్యమె ద్రౌపది భీమసేను న
ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాలితి చాలవయ్యె దీ
శునకము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుం డగునీకు నర్హ మే.

57. సీ. అన విని ధర్మజుం డఖిలలోకములకుఁ
బతివి ధర్మమునకుఁ బ్రభువ విట్టి
నీకంటె నెఱుఁగుదునే సదసత్ప్రకా
రము లట్లుఁ గాక వాదము మహాత్మ
లయినవారలతోడ నగునె చేయంగ నై
నను విన్నవింపఁ దగినతెఱంగు
విన్నవించుట దోషవిధముగా దనియెడు
బుద్ధి జేసెద నేను బూని విన్న

తే. పంబు భీమముఖ్యులును ద్రౌపదియుఁ జచ్చి
రేను వారల విడువక యేడ్చుచున్న

వత్తురే తోడ వచ్చి చావనిశునకము
విడువ కుండుట తప్పుగా నుడువఁ దగునె

58. చ. అనఘనరేంద్ర విన్ము శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధమి
త్రునియెడఁ జేయుద్రోహము వధూటి వధించుట విప్రుసర్వముం
గొనుట యనంగఁ గల్గు నివి గూడ సమం బగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచుదోషముతో నిది యోర్వ వచ్చునే.

59. ఉ. కావున నాకలోకపుసుఖం బటు లుండఁగ నిమ్ము దేవ నీ
భావము నిల్పు నాదెసఁ గృపాభరితంబుగ సారమేయసం
భావనసేఁత దోసముగఁ బట్టమి నాకు వరంబు నీవు పౌ
మ్మీవనభూమి నుండెద సమిద్ధతపంబుల నిన్ను గొల్చుచున్.

60. వ అని పుయిలోడక పలికెఁ బౌరవోత్తమా యాకర్ణింపుము.

_: సారమేయరూపంబున వచ్చిన ధర్ముండు ధర్మరాజునకుఁ ప్రత్యక్షం బగుట :-

సం 17-8-16

61. సీ. అట్లతిదృఢనిశ్చయంబుగఁ బలికిన
తనపుత్త్రుఁ గనుఁగొని ధర్ముఁ డధిక
సంప్రమోదముఁ బొంది సారమేయాకృతిఁ
బాసి తా నాత్మరూపంబుఁ దాల్చి
పరమసంభ్రమకృతప్రణతియు నానంద
భరితుండు నగు నాన్నృపాలుతోడ
నీ పుణ్యవృత్తంబు నిర్మల మేధయు
నఖిలభూతంబులయందుఁ గలుగు

తే. దయయు నాదుచిత్తముఁ బ్రినుదమునఁ దేల్చె
పత్స భూలోకమున నెట్టివారుఁ గలరె
తొల్లియును ద్వైతవనమున దోషదూర
నయన నీమనమునతెలం గరసినాఁడ

62. క. విను నీరు రోసి నీదగు
ననుజులు మృతు లయిన వచ్చి యఁదలలో నా

క్కనిఁ గోరుము బ్రదికించెద
నని పలికితి నేను నిర్మలాత్మక నీతోన్.

63. ఉ. దానికి నీవు చిత్తమునఁ దల్లుల నిద్దఱనుం దలంచి మా
లోన నొకండఁ గల్గితి నలుప్తత వారలయందుఁ గల్మిలో
కానుమంతంబు గాదె నకులార్థిత ధర్మువు నాకు నన్మతిన్
పీనుల కింపుగా నకులు వేడితి తద్విధ మెందుఁ గల్గునే.

64. క. భీముని నర్జును విడిచియు
నీమది నకులు బ్రదికింప నిగుడుట పుత్రా
నామనమునఁ బాయదు ని
న్నే మన వచ్చు నఖిలంబు నింద్రుం డెఱుఁగున్.

65. క. విను భక్తి యుక్త మిది యని
శునకముఁ జేపట్టి నీవు సురపతి కొనిన
చ్చినయరద మెక్క నొల్లవ
యనఘా సరి నీకు దివమునందును గలరే.

66. ఉ. ఇంతటి పెంపు గల్గుట మహేంద్రుఁడు నీదెస గాంచె నీవు ని
శ్చింతత మేనితోఁ జనుము సిద్ధపథం బునఁ బుణ్యలోకముల్
వింతలు గాక యుండఁ బృథివీవర నీకు నుదారసౌఖ్య మ
త్యంతము నక్షయంబు నగు నందలిమాన్యులు సంస్తుతింపఁగన్

67. సీ. అనియె నప్పుడు పరమాహ్లాదమునఁ జను
దెంచి గంధర్వులు దేవమునులు
మరుదశ్వివసువులు మహితాదరంబున
ధర్ముఁడు నింద్రుండుఁ దారు నమ్మ
హాత్ముని నెత్తి రథారూఢుఁ గాఁ జేసి
తమవిమానములు పార్శ్వముల నడపి
కొని చన నిఖిలదిక్కులఁ దనతేజంబు
వెలుగంగ సిద్ధులు వినుతి సేయ

తే. దైవతావాసమునకు నాధర్మజుండు
చనియె నయ్యవసరమున సర్వలోక

సమ్మతుఁడు బోధఘనుఁడు ప్రసన్నఫణితి
సారతోదారుఁడును నగువారదుండు.

68. వ. ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె.

69. ఉ. దానములం దపంబులను దద్దయుఁ బేర్కొలయట్టివారలన్
మానవనాథులన్ వినమె మాసెఁ దదీయయశంబు లెల్ల నీ
మానితకీర్తిదీప్తులు సమస్తజగంబులయందుఁ బర్వుట
న్మేనులతోడ వారిటులు నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్.

70. చ. అన విని ధర్మరాజసుతుఁ డాతని కిట్లను నాదుతమ్ములం
గనుఁగొనునంతకున్ సుఖముగాఁ గొన నయ్యెద నిత్తెఱంగు నా
కు నకట చూపరే పవనుకొడుకును నింద్రసుతుండు మాద్రినం
దనులును నున్నచోటు సుఖదం బయినన్ సుఖహీన మేనియున్.

71. వ. వారలను మదీయపక్ష ప్రాప్తులయినభూపతులను జూచువేడ్కయెల్లలో
కంబులమీఁదను గలుగు వేడుకకంటెను మిగిలి యున్నయది యను
టయు నమరేంద్రుండు తనమనంబున నితనితోడ సముచిత సంభాష
ణంబులు చేసెద నివ్విధంబు కటుకవచనత్వంబు గా దని యూహించి
యిట్లనియె.

72. చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబులపెంపున వచ్చి తిప్పదం
బునకు మహాత్మ యిచ్చటను బోవదు నీమది బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం దగునె మొందఁటిచందము నొంది యుండఁగన్.

73. చ. ఒరులకు నొందరానిపద మూర్జితపుణ్యనిరూఢిఁ బొందఁగా
దొరకొని యున్కి నీవికృతదూరమనస్కతఁ గాదె నీసహో
దరులు భవన్మహోన్నతపదస్థితి కర్హులె తొంటినెయ్యముం
బొరయునె దేవతాత్మకులబుద్ధి నెఱుంగుము నీవిశేషమున్.

74. క. అని యిట్లాడినసర్వభు
వనపతియు బుధుండు నైనవాసవుతోఁ దా
ననియెం దగ వెండియు ధ
ర్మనందనుఁడు భరతవంశ మహిమాధాయీ.

75. ఉ. మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్నదైత్య యే
గారవ మొప్పఁదమ్ములను గాంతను బుత్త్రిల మిత్రకోటిఁ గ
న్నారఁగఁ జూడ కుండుటకు నక్కట యోర్తునె యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్.

76. వ. నా క త్తెఱంగు పరమానందకరం బనియె నని యిట్లు మునీంద్రమాన
నీయం బయినపాండవేయమహాప్రస్థానప్రకారంబు జనమేజయునకు
వైశంపాయనుండు సెప్పుటయు.

77. శా. పారాశర్యవచఃపయోనిధిసుధాభంగీ దయాసంగి దు
ర్వారాశేషవిపద్వివారణవిహారా చిన్మయాకార వి
స్తారోదార గుణత్రయస్ఫుటవిశేషా నిర్గుణాశ్లేషమౌ
గారీత్వోజ్జ్వలతత్త్వభాస్వర నిజాగారాత్మకత్రీశ్వరా.

78. క. ప్రణవైకభావ్య సురర
క్షణకేళీస్తవ్య జన్యసకలద్రవ్యా
గణనాతీతా పోష్య
ప్రణతవ్రాతా నిరీహభక్తిప్రీతా.

79. మాలిని. అమృతవికిరణక్రీడాభిరామా త్రిధామా
దమితసకలదైత్యోత్సాహ విజ్ఞానదేహా
సుమహదుపనిషత్ప్రస్తుత్యభిశ్రావ్య సేవ్యా
శమనరమణశీలా సంభృతానందలీలా.

*గద్యము :* ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు
మహాప్రస్థానిక పర్వంబు సర్వంబు నేకాశ్వాసము.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్వర్గారోహణపర్వము - ఏకాశ్వాసము

శ్రీ వర్ధనాయురభివృ
ద్ధ్యావహచరణశతపత్ర యమనియమాది
ప్రావీణ్యపూర్ణమిత్ర మ
హావిద్యోన్మేషగాత్ర హరిహరనాథా.

2. వ. దేవా జనమేజయుండు వైశంపాయనుతోడ మత్పూర్వపితామహు
లగు పాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టి
నెలవుల నిలిచిరెట్లు వర్తించిరి చెప్పవే తదాకర్ణనకౌతుకంబు మదీయ
చిత్తంబున నుత్తరంగం బగుచున్నయది సర్వవిదుండ వేను భవదీయ
సదయవాక్యసంభావనకు నర్హుండ నని ప్రార్థించినం బ్రచురదివ్యజ్ఞాన
మాననీయుండును బరమకృపా విధేయుండును నైనసాత్యవతేయుని
సాంద్రకరుణావిశేషంబున సంపోషితం బైనబోధంబున సాధుజన
స్తవ్యుం డైనయాభవ్యమునివరుం డక్కురువంశవరున కిట్లనియె నట్లు
బంధుదర్శనంబు గోరి పలికినపాండవాగ్రజు తలంపున కనుకూలుం
డై యాఖండలుండు.

3. సీ. తగువాని రావించి ధర్మనందనునకుఁ
దమవారిఁ జూతఁ జిత్తమునఁ గోర్కి
దనికినయది నీ వితని నట గొని పోయి
యఖిలబంధులఁ జూపు మనుడు నతఁడు
గారవం బెసఁగంగ నారాజసత్తముఁ
దోడ్కొని పోవఁగు తూహలమున
దోడన నారదాదులు కొంద ఱరిగి ర
ట్లేగెడుచోటఁ గట్టెదురఁ దోఁచె

తే. నున్న తాసనాసీనుఁ డభ్యుదితసరసి
జాప్తసంకాశుఁ డమృతాశనాంగనాది
వృతుఁడు వీరలక్ష్మీ విరాజితుఁడు సతత
యుక్తసుఖసాధనుండు దుర్యోధనుండు.

4. వ. ఇట్లొప్పియున్నయతనిం గని ధర్మనందనుండు దేవమునివరుల
మొగంబులాలోకించి.

-:ధర్మజుఁడు దుర్యోధనుం జూచి యసూయాపరుం డైన నారదుఁ
డతనిం దేర్చుట:-

సం. 18-1-4

5. సీ. ఇతఁ డతిలోభోపహతమానసుఁడు దీర్ఘ
దర్శి గాఁ డితనికతమునఁ జేసి
నిఖిలదేశంబులయఖిలనృపాలురుఁ
గ్రుంగిరి దంతితురంగసహిత
మున ననవద్యాంగి విగతకల్మషధర్మ
చారిణి సాధ్విఁ బాంచాలి నార్య
జనములు గనుఁగొన సభలోన నవమాన
పెట్టినతులువ యే నిట్టివాని

తే. తోడఁ గలసి మెలఁగుదునె మహితాత్మకు
లార యెచట నున్నవారు భీమ
ఫల్గునులును గవలుఁ బాంచాలియును నన్ను
నచటి కనుపవలయు ననుచు మరలె.

6. వ. మరలిన జూచి నారదుండు నవ్వుచు నతని కిట్లనియె.

7. సీ. ఓధర్మనందన యీధరణీవిభుం
డాహవసంపరిత్యక్తతనుఁడు
దేవతాసంభావ్యుఁ డై వెలింగెడుఁ బుణ్య
కర్ము లెల్లను గడు గారవింతు
రితని నితండు మహీశుల నుజ్జ్వల
క్షత్రియధర్మంబునఁ గాదె త్రుంచె

నది పాప మే లగు ననఘ పాంచాలి యీ
తనిచేతఁ బడుటయుఁ దక్కఁ గలుగు

తే. నెగ్గులును నింక నిచ్చట నేల తలఁప
నిచ్చోటు పుణ్యలోకము మది నీసు రోష
మునుమనోవికృతులు దగు నయ్య వాని
విడిచి సమత నొందుము లోకవినుతచరిత.

8. వ. అని వెండియు

9. క. జూదమునఁ గయ్యమున నీ
కేదురితంబులు నితాంతహృదయక్లేశా
పాదకములు వాటిల్లె న
నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా.

10. చ. అన విని యమ్మునీంద్రునకు నవ్విభుఁ డి ట్లనుఁ బాపశాలి న
జ్జనసతతాపకారి కులసంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డితం డమర్త్యుల కెల్లను మాననీయుఁ డై
మను నటె పుణ్యలోకమున మాటలు వేయును నేల సంయమీ.

11. తే. అతని న ట్లుండ నిమ్ము నాయనుజతనుజ
మిత్రజనములఁ బాంచాలపుత్త్రి నా క
వశ్యమును నభివీక్షింప వలయుఁ జూపఁ
బనుపు వారలయున్నెడ భవ్యచరిత.

12. వ. అని మఱియుం గలుగుమునీంద్రులఁ గలయం గనుంగొని.

-: *ధర్మజుఁడు దేవమునులను గర్ణాది స్వజనులఁ జూపవేఁడుకొనుట* :-

సం. 18-3-6

13. సీ. సంగ్రామమృతులైనసకలబంధులకుఁ ది
లోదకం బే నిచ్చుచుండ వచ్చి
కుంతి కర్ణుఁడు తనకొడు కని చెప్పి నా
కతని జన్మముతెఱం గంతవట్టు
విదితంబుగాఁ జేసె నది మొదలుగ నమ్మ
హావీరుఁ దలఁచినయప్పు డెల్ల

సల్లాంబు సంతాప మొందు దదీయపా
దంబు లద్దే పాదంబు లట్ల

ఆ. యని సభక్తికముగ నర్చితంబులు సేయఁ
గాన కునికి కేను గరము వగతు
నతఁడు నేమునైన నమరేంద్రుఁడును మమ్ముఁ
జెనయునే త్రిలోకసేవ్యులార.

14. చ. అతని నెఱుంగ కుండి విను మర్జునుఁ బంచితి నమ్మహాత్ము నిన్
మృతుఁడుగఁ జేయఁగా నది శమింపదు శోకము నాపహించుచున్
మతికి నలంత సేయు గుణమాన్యుని నాతనిఁ జూచు కౌతుకం
బతిశయ మొందుచున్న యది యాయన యెచ్చట నుండుఁ జెప్పరే.

15. వ. ద్రుపదవిరాటయుధామన్యులు శంఖ ప్రభృతితదీయజ్ఞాతులును రణా
గ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు వారల నాకుంజూడవలదే ప్రాణ
సముం డగు జగత్ప్రాణనందనుని సంక్రందనతేజోవిరాజితుం డగు
శ్వేతాశ్వుని నశ్వుల ననుకరించునకులహసదేవులను సహజసద్గుణశాలిని
యగు పాంచాలినిం జూడక నిలువం జాలుదునె వారి కెవ్వరికిని నాక
లోక నివాసంబు లేక తక్కెనేని సోదరరహితస్వర్గంబునందు స్వర్గ
త్వబుద్ధి పుట్ట దయ్యేడు వారలెచ్చోటనుండి రచ్చోట యేను బుణ్య
లోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచిపుచ్చుం డనిమిషవర్యులారా
యనిపలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లి ట్లనిరి.

16. ఆ. అట్లు చేయువార మమలాత్మ నీదుచి
త్తమున నేది దోఁచె దాని నాచ
రింప వలయు నని నిలింపేశ్వరుండు పా
టించి మాకు నప్పగించినాఁడు.

17. సీ. అని దేవదూతునిఁ గనుఁగొని యిమ్మహా
త్ముని భీమసేనార్జునాదు
లున్న చోటికి నన్ను మన్న నప్పురుషుఁ డా
దర మెసఁగంగ నాధర్మతనయు

నిందు ర మ్మనుచుఁ దా ముందటఁ జన నమ్మ
హానుభావుఁడు వాని ననుగమించె
నట్లు చనంగఁ గేశాస్థిసాంద్రంబు దుర్గం
ధంబుఁ బరుషతరంబు దంశ

ఆ. మశకనిబిడమును దమఃకలితముఁ గ్రిమి
కీటరక్తమాంసకూటకుణప
ఘోరవిధము శాతదారుణచంచువా
యసరవాన్వితంబు నయ్యెఁ బథము.

18. వ. అప్పథంబునఁ బాండవాగ్రజుండు చని చని యారం గ్రాఁగిననూనియ
వోలెం దెరలుచున్న జలంబులు గలిగి యాయసకంటకదుస్స్పర్శం బగు
చుఁ దటంబున నిశితాసిపత్త్రివనంబు శోభిల్ల వైతరణియనుపేరఁ బర
గినయేఱును దత్ప్రదేశంబున ననేకప్రకారయాతన లనుభవించు పాప
కర్ములనుం జూచి దేవదూతునితో మనకుఁ బోవ వలయుచో టింక
నెంతదవ్వు గల దియ్యెడయును దేవతాధీనంబై యుండునే యని
యడిగిన నప్పురుషుం డతనితోడ.

19. తే ఈ నెలవును బృందారకాధీన మిదియ
మనకు రావలసినచో టనిన నతం డ
సహ్యదుర్గంధఘోరదర్శనత నచొటు
చిత్త మతిదుఃఖితంబుగఁ జేయుటయును.

20. వ. మరలి పోవం జూచిన నయ్యెడఁ గొన్ని యెలుంగులు

21. తే. భవ్యజనన నీగాత్రము దివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మాపైఁ గరంబు
హృద్య మై వీచుటయు దుఃఖమెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచున్నార మేము

22. క. నినుఁ జూడఁ గనుటఁ బటుయా
తనలం దొఱఁగితిమి పరమధర్మాత్మక నీ
వనయము దయ నిచ్చట నిలి
చిన బ్రదుకుదు మింకఁ గొంతసేపు నిలువవే.

-: ధర్మరాజు నరకమున నున్న యన్నదమ్ముల నెఱింగి పరితపించుట :-
సం. 18-2-36

23. వ. అని దుఃఖభారకృపణంబు లగుచు వీతెంచినఁ గౌంతేయాగ్రజుం డోహో యెంతబెట్టిదంబు లైనయిడుమలం బడియెదరో వీర లని కారుణ్యం బొలయ నిలిచి వెండియు నత్తెఱంగుమాటలు విని మీ రెవ్వ రని యడిగినఁ గర్ణుండ భీమసేనుండ నర్జునుండ నకులుండ సహదేవుండ ద్రౌపదిని ధృష్టద్యుమ్నుండ ద్రౌపదేయుల మనుపలుకు లెసంగుటయు

24. సీ. ధర్మనందనుఁడు చిత్తమ్మున నుద్వేగ
మావహిల్లఁగ దైవ మకట యిట్లు
సేసెనే కీ దేమి చేసి రొకో వీర
లిన్నరకమునకు నేఁగుదేర
వలసినయట్టిది వాసవాద్యమరులు
నీచులు వో వీరి నేవిచార
మించుకయును లేక యిట్టికష్టపుటికు
మలఁ బెట్టెడిదె ధర్మమా తెఱంగు

తే. మాలితే నీవు సజ్జనమాన్యు లలము
సత్యపరులు దయాఢ్యులు నిత్యదాన
రతులు బహు దక్షిణాంచితక్రతు వితాన
పాలితాత్ము లనర్థంపు బాటు పడిరి

25. చ. ఒకటను మేలు సేయనిసుయోధనుఁ డమ్మెయి దేవపూజ్యుఁ డై
సకలసుఖానుభూతియు సజస్రము పెంపు వహింప నొప్పి దృ
ష్టికిఁ గడు ప్రేఁక నై తనదు చెల్వులఁ జుట్టులఁ దాను సంతసం
బుకలిమి నేచి మి న్నడిచి పుణ్యప దావృతుఁ డై వెలింగెడున్.

26. ఆ. ఈఁగకాలియంత యేనియుఁ బాపంబు
వీరివలనఁ గనుట వినుట గలుగ
దొక్కనాఁడు నట్టియుత్తములకు విధి
పాడి మాలి యిట్టి పాటు దెచ్చె.

27. సీ. అని యగ్గలపుఁజింత మునిఁగి కలంక మ
నోవికారము నాకు నావహిల్లఁ
గత మేమియొకొ యిది ఘనమాయయో కల
గనుటయో యరయ నిక్కంబొ చిత్త
విభ్రాంతిఁ జేసి వివేకింప నేర రా
దయ్యెడు నని పరమాకులేంద్రి
యుఁడు శోకదుఃఖమయుండు నై కొండొక
ప్రొద్దూర కుండి సద్బుద్ధిఁ దలఁచి

తే. యలుక యింద్రుపైఁ బొడమిన నమ్మహాత్ముఁ
డప్పురుషుఁ జూచి మగుడ నీ వరుగు మార్య.
పర్య యెవ్వరిదూతవు వారికడకు
ననుచుఁ బలికి వెఁడియు నిట్టు లనియె నధిప.

*-: ఇంద్రుఁడు నరకంబుకడ నున్న ధర్మరాజునొద్దకు వచ్చి యతని సంభావించుట :-*

సం. 18-2-52

28. క. నాయనుజులు దుఃఖార్థితు
లై యున్నా రట్టులగుట నచటికి రా నిం
కీయెడన యేను నిలిచెదఁ
బాయక యని చెప్పు మాకృపానిరతునకున్.

29. చ. అనుటయు దేవదూతుఁడు రయంబున నిర్జర నాథుపాలికిం
జని తెలియంగఁ జెప్పఁ గురుసత్తమ ధర్మజునిశ్చయంబు న
య్యనఘచరిత్ర భాస్వరునియాడినమాటలు నాతఁ డంతయున్
విని చనుదెంచె నయ్యెడకు వేగమ సంయమదేవయుక్తుఁ డై.

30. ఆ ధర్ముఁడును మహాముదంబున నిజపుత్త్రుఁ
డగునజాతశత్రు ననునయించి
రక్షణం బొనర్పఁ బ్రకటవాత్సల్యత
నరుగుదెంచెఁ గురుకులాగ్రగణ్యు

31. వ. అప్పుడు.

32. సీ. వివిధపాపాత్ములు వికృతశరీరు లై
యాతనాబాధితు లగుట మానె
దుర్గంధమును గృధ్రవర్గాది పలలాశి
పక్షిపంక్తులుఁ గుణపవ్రజంబుఁ
దోఁపవ యెఱచి నెత్తురు కేశపటలంబు
లస్థిపుంజము లదృశ్యంబు లయ్యెఁ
గ్రూరాసిపత్త్రఘోరారణ్యయు క్త వై
తరణి లేకుండె సత్పరిమళంబు

తే. నింపుఁ జేయుసోఁకును సొగియించుతనుపు
నార వీతెంచి సమ్మోద మావహించె
నమృతమయ మిది యనఁ దగి యనిల మధిక
విశదభావంబుఁ బ్రాపించె దిశలు పదియు.

33. వ. ఆసమయంబున వాసవుతోడఁ జనుదెంచినట్టి.

34. మహాస్రగ్ధర. వసురుద్రాదిత్యగంధర్వ గరుడ భుజగవ్రాతముల్ వైభవం
బుల్లసనం బొందంగ సిద్ధుల్మనముల ముదము ల్పల్లవింపంగసాధ్యుల్
హసితస్వాంతంబులం బెల్లలమికొనఁగ నత్యాదరోత్కర్షముల్ పాం
డుసుతోపాంతంబునంబొందుగొనినిలిచి చూడ్కుల్తదంగంబుగప్పన్.

35. వ. ఒండొరులతో నక్కురుమూర్తి గుణ విశేషంబు లుగ్గడించు చుండ
సంయమి సురసమేతంబుగా నయ్యాఖండలుండు నయ్యఖండయ
శోమండితుం జేర నిజ సాంత్వన స్వరంబున నిట్లనియె.

36. క. నీ విచ్చో నునికికి ని
ద్దేవత లందఱును వగచి ధిషణాగుణసం
భావిత నిన్నుం దోడ్కొని
పో వచ్చినవారు కినుకఁ బో విడువ వనా.

37. క. సిద్ధియు నవ్యయలోకస
మృద్ధసుఖావాప్తియును శమితవికృతియు స

ద్బుద్ధియు నుదాత్తభంగిని
సిద్ధించెను నీదుగుణవిశేషముకతనన్.

38. క. విను మొక్కటి సెప్పెద రా
జనువానికి నెల్లఁ దప్ప దవనీశ్వర యె
ట్లును నారకస్థలంబుం
గనుఁగొనవలయు టిది వేదకథితము సుమ్మీ.

39. సీ. పుణ్యంబులును బాపములు రెండు జోక లై
యుండుఁ బుణ్యంబుల నొదవు నాక
సుఖము పాపంబులఁ జొప్పడు నరకదుః
ఖము విను మున్ను నాకంబుసుఖము
ననుభవించినయట్టియతఁడు పడంపడి
యధికనారకపీడ ననుభవించు
మున్న నారకదుఃఖమునఁ బడ్డవాఁ డనం
తరమ నాకమునఁదాఁ బొరయు సౌఖ్య

తే. మల్పపుణ్యుండు తొలితొలి యమరతాసు
ఖంబు గయికొని మఱియు దుఃఖముల నొందు
భూరిపుణ్యుండు మునుమును ఘోరనిరయ
యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు.

40. క. ఇట నేను నిన్నుఁ బుత్రెం
చుట యుత్తరకాలదివ్యసుఖసంగమసం
ఘటనకుఁ గాదే నీకట
కటఁబడుటకు దీనిఁ దెలుపఁగా రా వలసెన్.

41 సీ. కర్ణుఁ డుత్తమసిద్ధిఁ గాంచి వెలింగెడు
నమ్మహాభుజునకు నై కరంబు
దుఃఖింతు నీ వెప్డుఁ దుది ముట్టి యున్నాఁ డ
తుండు నిజోజ్జ్వలస్థాన మొంది
సర్వాస్త్రవిదుని నాజలజాప్తనందనుఁ
గనుఁగొని చిత్తంబుకలఁక విడువు

మనిలనందనుఁడు నర్జునుఁడును నకులుండు
సహదేవుఁడును భవత్సైన్యరూప

తే. వర్తి సర్వమహీపతివర్గములును
ద్రౌపదియు ద్రౌపదేయులు రాజవర్య
దీప్తనిజధామసంప్రాప్తిఁ దేజ మలరి
యుండఁగా జూచి సమ్మోదయుతుఁడ వగుము.

42. ఆ. దైవవిహిత మగుటఁ దప్పింప రాకున్న
యట్టియల్పదుఃఖ మనుభవించి
తిఁక నిట సుఖంబు లేపార నాతోడ
విహరణం బొనర్పు విమలచరిత.

43. క. మానితసువ్రతములకు
స్నానకరణమునకు ననుగుణం బయిన శుభం
బే నీకుం గావింపం
గా నుజ్జ్వలవృత్తిఁ బరగు కౌరవ ముఖ్యా.

44. తే. రాజసూయాశ్వమేధాధ్వరముల సంచి
తంబు లయిన యుదాత్తలోకంబు లనుభ
వింపు మాధిక్యమహనీయవిభవ మెసఁగ
నక్షయోదారసౌఖ్యంబు లావహిల్ల.

45. సీ. మహితవర్తను లైన మాంధాతృనలహరి
శ్చంద్రదిలీపదుష్యంతభరతు
లొందిన కీర్తనీయోన్నతి నొందుము
నినుఁ గొనియాడంగ మునినిలింప
గంధర్వగరుడోరగప్రధానులు సిద్ధ
సాధ్యసత్తములును సకుతుకముగ
వచ్చినవా రని వారి నెల్లను జూప
నతఁడు వినయసంభృతాంగుఁ డగుచు

తే. నాదరముగఁ బ్రత్యుద్గతి యాచరింప
వార లెంతయుఁ బ్రీతియై గారవంపుఁ

బలుకు లెసఁగఁగ నధికసంభావనంబు
సేసి యాననములు వికసిల్లుచుండ.

46 వ. అమ్మహేంద్రుఁ డమ్మహానుభావునితో మఱియు ని ట్లనియె.

47. క. ఆకాశగంగ యిదె పు
ణ్యాకృతి యున్నదిఁ బరిప్లుతాంగుఁడ వై సు
శ్లోకా నాచెప్పినన్నృప
లోకంబును మిగులు మమరలోక సుఖములన్.

-: యముఁడు ధర్మరాజు నుచితవచనంబుల సంభాషించుట :-

సం. 18-3-381

48. సీ. అనియె నప్పుడు ధర్ముఁ డభిరామమూర్తి ము
ఖప్రసాదంబునఁ గరము వెలుఁగ
నారాజవర్యునిఁ జేరంగ నరిగి ని
న్నీమగౌరవ పరీక్షింపఁ గంటి
నిన్ను మున్నా అరణీప్రసంగంబున
ద్వైతవనంబునఁ దగిలి కుక్క-
తో వచ్చినప్పుడు దైవతగిరిపొంత
ననుజవర్గమువిషయంబు గాఁగ

తే. నిప్పు డిచటను జలన మొకప్పుడైన
నీదుమది నించు కేనియు లేదు దమము
శమము సత్యంబు మద్గతసారభక్తి
నీకు నగ్గలములు మహనీయచరిత.

49. వ పరిశోధితుండ వయితి కలంక దొఱంగి నుఖివి గమ్మని పలికె రాజు నకు నవశ్యంబును నరకంబు సూచుట గలదు గావున నత్తెఱంగున కయియేనును వాసవుండును నిన్నుంగడుఁ గీ దగునచ్చోటుసౌనిపితిమి సూర్యతనయవననందనాదులకదుఃఖానుభవంబులు మాచేసిన వెడ మాయంబు లగుట నీకుఁ దెలిసె వారు పుణ్యలోకవాసు లయి యుని కియు వాసవువాక్యంబులఁ దేటపడియె నని చెప్పి.

50. క. నీ వియ్యాకాశనదీ
పావన సలిలముల మునుఁగు భవ్యాత్మ భవ
ద్భావంబు విడుచు మానుష
భావవికారముల శోక బంధము లడఁగున్.

51. చ పరమసుఖంబుఁ జెంది యతిభాస్వరు లై విహరించునీదుసో
దరు లగుకర్ణముఖ్యుల ముదం బెసలారఁగఁ జూచె దీమహో
త్తరబహుసౌఖ్యనిర్మలపదంబున దివ్యవిహారలీలలం
బరగెద వేల యిం కిచట బాంధవరక్షక రమ్ము చెచ్చెరన్.

*-: ధర్మజుఁ డాకాశగంగావగాహంబుఁ జేసి దేవభావంబు నొందుట :-*

సం. 18-3-40

52. సీ. అని పల్క ధర్ముఁ డత్తనయునిఁ దోడ్కొని
యయ్యందఱును దోడ నరుగుదేర
నాకాశగంగయుపాంతంబునకుఁ బోవ
నప్పుణ్యనది నమ్మహానుభావుఁ
డార్యసంస్తవనవాక్యంబులు చెలఁగ భ
వ్యస్నానమంగళ మాచరించి
మానుషతనువు నమ్మాత్రన విడిచి ది
వ్యం బగుమహితదేహంబు దాల్చి

తే. వైరమత్సరసాహసం వాసలౌల్య
గర్వశోకాదులైన హృద్గతవికార
ములఁ దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు
పావకుఁడుఁ బోలె శోభిల్లెఁ బౌరవేంద్ర.

53. వ. ఇవ్విధంబున నొప్పి మీతాత ధర్మనందనుండు బృందారక నాయక
నారదా ద్యుదారపురుషుల నభినందించుచు ధర్ముండును దానును దో
నరుగుదేర దివ్యశక్తి నటఁ జని మనోహరం బయినయొక్కయెడ.

54. సీ. విస్ఫురద్బహురత్న వితతికనత్కన
కాత్మకం బయినమహాసనమున

దేదీప్యమాన మై దివ్యావయవవీధి
త్రిప్రతానం బెల్ల దిశల వెలుఁగఁ
జక్రగదాద్యస్త్రసంతతి నుజ్జ్వలా
త్యంతసుందరపురుషాకృతులును
జారుమౌళిస్థలీసను వేతనిజరూప
ములుఁ గల్గి భక్తిమై బలసి కొలువఁ

తే. దనదుచూడ్కికి నెంతయుఁ దగు లొనర్చి
మున్ను చూచినయట్లగుమూర్తి యొప్ప
నరుఁడు కేవలసవినయపరత వెలుఁగఁ
బొలుచునారాయణునిఁ గాంచె భూపవర్య.

55. చ. కని మది నమ్మహాత్ముఁ డధికప్రమదంబు వహించె నొండెడం
గనుఁగొనియెం బ్రియం బెసఁగఁ గౌరవవంశవరేణ్య దీప్తి ధా
ముని రవిపంక్తిలోనఁ బదమూఁడవమూర్తి వెలుంగుచుండఁ గ
ర్ణుని మఱి భీమసేనుని మరుద్గణమధ్యగతత్వశోభితున్

56. తే. అంగములభంగి తొల్లింటియట్ల యై య
నూనతేజోవిరాజితు లైనవారిఁ
గనియె నశ్వి సమీపవర్తనులఁ దత్స
మానమూర్తుల వీక్షించె మాద్రిసుతుల.

57. చ. ఉదిత రవిచ్ఛవిం దరుణి నుత్పలగంధి నుదాత్తమూర్తి ద్రౌ
పది నచొటెల్లనం దనప్రభన్ వెలుఁ గొందఁగఁ జేయుదాని న
వ్విదితయశుండు చూచి మది విస్మయ; మందఁగ నింద్రుతోడ ని
మ్మదవతి యెవ్వ రార్యజనమాన్యచరిత్ర యెఱుంగఁ జెప్పవే.

-: ఇంద్రుఁడు ధర్మజునకు దేవత్వంబు నొందినస్వజనంబులఁ జూపి చెప్పుట :-

సం. 18-4-9

58. సీ. అనవుడు నతనితో నాతఁ డీభామ మ
హాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదు

నికిఁ గూతు రై యయోనిప్రభవం బగు
మానుషరూపంబు మహిత లీల
మొగిఁ దాల్చి భవదనుభూతి సెల్లించె గౌ
రీశ్వరునాజ్ఞ వహించి వచ్చె
నని చెప్పి యిల్లర మ్యాకృతు లేవుప
గంధర్వవరులు సిక్కమలనయన

తే. యందు మీకు జన్మించినయక్కుమారు
లల్లవాఁడె మీతండ్రికి నగ్రజుండు
ప్రకటగంధర్వపతి ధృతరాష్ట్రనాముఁ
డిందు నతఁ డంచుఁ జూపె నరేంద్రముఖ్య.

59. వ. ఇట్లు ద్రౌపదీ ద్రౌపదేయాఁబికేయుల తెఱం గెఱింగించి వెండియు నాఖండలుండు పాండవాగ్రజునకుఁ గర్ణుం జూపి భవదగ్రజుండు సూర్యునపర శరీరంబు కౌంతేయుం డయి రాధేయుం డనం బరఁగినవాఁడు సుమ్ము చూడు మని పలికి సిద్ధసాధ్య విశ్వేదేవగణంబులతో నున్నవారు తత్తదంశ ప్రభూతులయి వాసుదేవానుచరణపరాయణు లగుచు వర్తించిన సాత్యకికృతవర్మాదియాదవుల నాలోకింపుము.

60. క. అని చెప్పి చూపి యభిమ
న్యునిఁ జూచితె చంద్రుభంగి నుజ్జ్వలకాంతిం
దనరెడుఁ దదంశజాతుం
డనూనధృతిశాలి వీఁడె యంచుం జూపెన్.

61. వ. చూపి తదనంతరం బమ్మహేంద్రుం డమ్మహాత్మునితోడ.

62. ఆ. పాండురాజు వీఁడె బహురత్నఖచిత వి
మాన మెక్కి గొంతి మాద్రి తనయ
పార్శ్వభాగమున సుఖాసీనులుగ నాదు
వలను వచ్చుచున్న వాఁడు గంటె.

63. క. అదె భీష్ముఁడు వసువులకడఁ
గదిసి యెలమి నున్నవాఁడు కంటే ద్రోణుం

డిదె దివిజగురునిపాలఁ బ్ర
మద మెసఁగ వసించినాఁడు మాన్యచరిత్రా.

వ. అని పలుకుచుఁ జూపి గంధర్వయక్షగుహ్యకగణంబులలో ద్రుపద విరాటులను దదీయానుజతనుజ వర్గంబులనుం దక్కనుం గలుగు కేకయపాండ్య ప్రభృతి నానాదేశాధీశులను వేఱువేఱం జెప్పుచుంజూపుచు భవదీయం బగుసమరంబునం బరిత్యక్తశరీరు లయి యుత్తమ లోకంబులు వడసియున్నవారల సంలోకింపుమని చెప్పె ననిన విని జనమేజయుండు వైశంపాయనుతో మునీంద్రా యిప్పుడు నీచెప్పిన సుయోధనశకుని సైంధవులను గర్ణుఁడును గర్ణకుమారులును వెండియుంగల తత్పక్షభూపతులును ఘటోత్కచాదులయిన పాండవులవారును నీ చెప్పిన సకలజనంబులు నాకలోకంబున నెప్పుడు నుండుదురో యట్లుంగాక కొంతకాలంబు నిలిచి క్రమ్మఱ మనుష్యాదిజన్మంబుల నొందుటకై యరుగుదెంతురో యిత్తెఱంగు విన వలతుం జెప్పవే యని యడగిన నమ్మునిపతి యమ్మనుజపతితో ని ట్లనియె.

సీ. కురువర యిది దేవగుహ్యంబు మునివరుఁ
డైనవేదవ్యాసుఁ డకులకరుణఁ
జెప్పినయది నీకుఁ జెప్పెద సమవధా
నంబుతో వినుము సనత్కుమారుఁ
గలసెఁ బ్రద్యుమ్నుఁ డన్యులకు దురాసదం
బయినకుబేరలోకానుభవము
ధృతరాష్ట్రుఁ డొందెను సతియుఁ దానును నింద్రు
భవనంబునను నిల్చెఁ బాండునృపతి

తే. యాంద్రుఁ డిరువురుఁ దో నిల్వ నమృతకరునిఁ
గూడె నభిమన్యుఁ డనిమిషగురుని నొందెఁ
దత్ప్రతీకాశుఁ డయినకోదండగురుఁడు
ద్వాపరాత్మకుఁ డయ్యె గాంధారవిభుఁడు.

క. రారాజు నాకనరకో
దారసుఖాత్యంతదుఃఖధామంబులఁ బెం

పారియు హీనత నొందియుఁ
గౌరవకులనాథ పిదపఁ గలియం దొం(దు)దెన్.

67. వ. అట్లు పోలె నాకనరకంబు లనుభవించి

68. ఆ. అతనితమ్ము లెల్ల యాతుధానావలిఁ
గలసి రాత్మజనకుఁ గలసె సూర్యుఁ
గర్ణుఁ డధిప వసువు గావున వినుము గం
గాత్మజుండు వసువులందు నిలిచె.

69. వ. ద్రుపదుండు విరాటుండు ధృష్టకేతుండును భూరిశ్రవుండును శల్యుం
డును శంఖుండును నుత్తరుండును విశ్వనామదేవతలఁ గలసిరి
ధృష్టద్యుమ్నుండు హుతవహునిఁ గూడికొనియె నని చెప్పి యప్పర
మసంయమి యప్పదమితేనితో వెండియు ని ట్లనియె.

70. తే. వినుము ధర్మనందను పుణ్యతనువునందుఁ
దగఁ బ్రవేశించి యున్నవివ్యామయాత్ముఁ
డైనవిదురుండు నమ్మహితాత్మబోధ
శాలియును ధర్ముఁ గూడిరి సచ్చరిత్ర.

71. సీ. కమలగర్భునినియోగంబున నిజయోగ
బలము గైకొని బలభద్రదేవుఁ
డంబుధి కరిగి యనంతుఁబరమమూర్తిఁ
గలసె నత్తెఱఁగు ము న్నలఘుకీర్తిఁ
దగ నీకుఁ జెప్పితిఁ దక్కుఁ దవృష్ణిభో
జాంధకు లెల్ల గుహ్యకగణంబుఁ
గూడిరి కృష్ణసంక్రీడకుఁ బాత్రంబు
లైనషోడశసహస్రాంగనలును

తే. విధినియుక్తకాలంబున విను సరస్వ
తీజలంబుల మునిఁగి యుత్కృష్ట మగుని
జాప్సరోభావ మొంది నారాయణుని యు
పాంతచారిణు లైరి ప్రహర్ష మెసఁగ.

72. చ. అనుమరణంబునం దగ మురాంతకు రుక్మిణి సెందె లక్ష్మి య
వ్వనరుహ నేత్ర తక్కుఁగలవామవిలోచన లేద్వురుం దదీ
యనుతతనుప్రవేశనసమాచరణం బొనరించి రవ్వరాం
గనలును లక్ష్మియంశముల కావునఁ గౌరవవంశవర్ధనా.

73. వ అని చెప్పి యమ్మహాయుద్ధంబున మృతులైనయట్టివారును నేను మున్నుప్రసంగించినయట్టివారును బ్రసంగింపనివారును నిట్టిట్టిగతిం బ్రాపించి రని నాచేతం జెప్పంబడినవా రెల్లను నిజార్హప్రకారంబుల సురాసురయక్ష గుహ్యకగంధర్వబృందంబులం జెందిరి కురునందనా నీయడిగినతెఱం గెఱింగించితి నని వెండియు.

74. క. వినుము పాండవకౌరవవిషయ మైన
యట్టియితిహాస మే నుపాఖ్యానజాత
సహిత మగునట్లుగా సమస్తంబు మహిత
విస్తరంబుగఁ జెప్పితి విశదభంగి.

75. వ. కృష్ణద్వైపాయనమునీంద్రుండు సత్ప్రసాదభరితుం డై యాజ్ఞాపింప నట్లు తదీయానుజ్ఞ వడసి తద్దయాలబ్ధప్రజ్ఞావిశేషుండ నై యశేషం బును వివరింప నమ్మహాత్ముని కారుణ్యంబున నిమ్మహనీయేతిహాసంబు సమాధానమానసుండ వై యాకర్ణించి నీవును బహుళపుణ్యాత్ముండవుఁ గృతార్థుండవుఁ బరమార్థవిదుండవునైతి వని యిట్లు సాంద్రానందసం పాదనశీలుం డై.

76 క. శ్రీనిత్యత్వప్రమదా
దానకుతూహలనిరూఢతాస్త్వ్యాపాం
గా నిర్భరవేదవ్యా
సానేకవచోనుషంగ హరిహరనాథా.

77. వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పినట్లు సర్పయాగ సమాగప్రవృత్తం బైనమహాభారతం బంతయుఁ దత్సభాగతుం డైన రోమ హర్షణనామధేయుండును సాత్యవతేయశిష్యుండును బండిత ప్రవరుండును నగుసూతునిపుత్త్రిం డైనయుగ్రశ్రవుం డనియెడుకథ కుండు సమ్యగవధానంబున నాకర్ణించినవాఁ డగుటను సమాశ్రిత

వత్సలుం డైనయాకృష్ణ ద్వైపాయనుననుగ్రహంబునఁ దత్కథాసా
కల్యవివరణవిశారదుం డై యుండు నతఁడు నైమిశారణ్యపుణ్య
క్షేత్రంబునందు శౌనకుం డను కులపతి మొదలుగాఁ గలకొండఱు
మహామునులు సత్త్రయాగం బాచరించుచుండ నయ్యెడకుం జని
వారలం గాంచినఁ బుణ్యకథాశ్రవణకౌతుకాధీనమానసు లైనయమ్మాన
నీయులు పుణ్యాత్మకుం డైనయక్కథకునకు సముచితార్చనంబులం
బ్రియం బొనర్చి కథాకథనంబుఁ బ్రసంగించినం బ్రీతుం డై యాతం
డేమి తెఱంగుకథ వినం గోరెద రనుటయు నప్పరమార్థపరాయణు
లతనితోడ నెయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్రజ్ఞానప్రదం
బును నఘనిబర్హణంబును నైనయది యక్కథ మాకు విన నిష్టం
బని పలుకుటయు.

78\. క అతఁ డింతటిది మహాభా
రతంబ యనునిశ్చయము తిరంబుగ మతిసం
గత మగుడు నమ్మహాత్ముల
కతివిశదము గాఁగ నిమ్మహాకథ చెప్పెన్.

79\. వ చెప్పి యి ట్లనియె నట్లు జనమేజయుండు సర్పయాగకర్మానుష్ఠానం
బులయెడ వైశంపాయనువలన నివ్వినుతేతిహాసంబువిని విస్మితుండును
బ్రమోదభరితుండును నయ్యె నక్కాలంబునఁ దదీయయాజకులు యజన
సమాపన విధి యనుష్ఠించి రయ్యుధిష్ఠిరానుజ పుత్త్రపౌత్త్రుఁ డత్తె
ఱంగున భుజంగంబులయాపదఁ దీర్చినయ స్తికు నభ్యర్చనంబున
నత్యంతసంతుష్టునిం జేసి యతని నివాసంబునకు ననిచిపుచ్చి ఋత్విజు
లాదిగా నఖిలబ్రాహ్మణులకు బహుధనంబు లొసంగి వినయం బెసంగ
నామంత్రితులం జేసిన వారలు నిజనివాసంబులకుం జనిరి వైశంపా
యనుఁ బెంపారుసవిశేషపూజనంబులఁ బరితోషితుం గావించి దేవోప
చారంబులఁ గృష్ణద్వైపాయనమునీంద్రుం బూజించి యజ్ఞపతి సకల
జనంబులు ప్రస్తుతింప విభవంబు శోభిల్లఁ బురంబుఁ బ్రవేశించె.

80\. సీ. అని చెప్పి యాశౌనకాదిమునీశ్వర
గణముతో మఱియు నక్కథకుఁ డింపు

మిగులంగ నిట్లను మేటిమునీశ్వర
సంఘంబులో నెల్ల సత్యదర్శి
సర్వవిధిజ్ఞాత సర్వవిజ్ఞాన భ
వ్యాత్ముండు సర్వేంద్రియప్రబోధ
శాలి సర్వజ్ఞుండు శౌచశాంతిక్షమా
దాంతితపోనిత్యతావిభాసి

తే. యా ప్రసక్వపిధైశ్వర్యుఁ డఖిలసాంఖ్య
యోగభేదవిదుండు ధర్మోపదేశ
చతురవాగ్విలాసుఁడు నిస్తత్వవస్తు
వేది సాత్యవతేయుండు వేదమయుఁడు.

81. వ పాండవులకీర్తిఁ బ్రకటించుటకును మఱియుం గొందఱు జనపతుల చరిత్రంబులు జనుల కెఱింగించుటకును దేవదేవుం డగు వాసుదేవుని సంక్రీడా విశేషంబులు వివరించుటకును సర్వదేవజాతులజన్మంబులును దదీయ సాయుజ్యంబులును దేటపఱుచుటకును సకలధర్మంబులునుం దెలుపుటకునుఁ గాఁ బంచమవేదం బయి పరఁగునిమ్మహాభారతసంహిత యొనర్చె నిమ్మహితేతిహాసంబు సంవత్సరత్రయకృతంబు దీని విశేషంబు వినుండు

82 తే. అమలధర్మార్థకామమోక్షములగుఱిచి
యొలయుతెరు వెద్దియును నిందుఁ గలుగునదియ
యొండెడలఁ గల్గు దీన లేకుండఁ జెప్ప
దక్కొకంటను లేదు వేదజ్ఞులార.

83. సీ. పూతాత్ములార యీపుణ్యేతిహాసంబు
జనమేజయుఁడు సేయుసర్పముఖము
కాలంబునం దట్లు కారుణికోత్తముఁ
డైన వేదవ్యాసుఁ డాదరమున
నాజ్ఞాపనము సేయ నతనిశిష్యుఁడు లోక
నుతుఁడు వైశంపాయనుండు సెప్పె

నన్న రేంద్రుఁడు విన నాసభ నిలిచి స
వినయభక్తికముగ వినినవాఁడ

తే. గథనశక్తియు నమ్మునికరుణవలనఁ
గలిగె నాకిత్తెఱంగున గారవించి
మీరు వినుచుండఁ జెప్పెడు మేటిపదము
గంటి మంటి మీదయ పెంపుకతనఁ జేసి.

84. వ. అని పలికి వెండియు.

-: ఫలశ్రుతి :-

85 క. అలఘుమతులార పర్వం
బుల నీయితిహాసరత్నమును వినిన నఘం
బులు వాయు నాకలోకము
గలుగును సిద్ధించు ముక్తి కాంక్షిత యైనన్.

86. క. ఆద్యంతంబును నీయన
వద్యకథ వినఁగఁ గనినవారికిఁ బాయున్
సద్యంబ బ్రహ్మహత్యా
వద్యము మొదలైనపాపవర్గం బెల్లన్.

87. క. సురపితృకార్యంబుల భూ
సురులకు దీని వినిపించు సుకృతాత్ముఁడు ద
త్కరణఫలంబుల నధిక
స్ఫురితంబుగఁ బడయు మహితబోధనులారా.

88. క. మానసముల నింద్రియముల
నేనియుఁ జేయంగఁ బడినయేనఃపుంజం
బీనిర్మలేతిహాసము
వీనుల నొక్కింత సిలుక విరియు సకలమున్.

89. ఉ. భ్రాజితవృత్తిమైఁ బరఁగుభారతసంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను రాజితభంగి జగత్త్రియంబునం

బూజితకీర్తియై నెగడు భూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే
రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్నయంతటన్.

90 ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్
భూరియశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గు వారి కే
కోరిక లైన వేగ మొనఁగూడు సుపుత్త్రినిఁ గాంచు సద్వరున్
గారవ మొప్పఁగా బడయు గర్భిణియున్ వరుసం గుమారియున్.

91. ఉ. శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు ననేకజన్మపా
పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహిత కెల్లఁ బుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్నమానవుం
డక్షయ పుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్.

92. ఉ. వ్యాసమునీంద్రసారకరుణాతిశయంబున భారతార్థ ము
ద్భాసిత మైనయట్టినుతభాగ్యునకున్ సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనపంక్తులు గీర్తన సేయ శశ్వదు
ల్లాస సుఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁ డై.

93. వ. అని యిట్లు సమస్తపురాణపారీణుం డైనసూతుండు.

94 చ పరమపదాప్తిహేతు వగుభారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపునం గరఁగుచొప్పునఁ జెప్పిన వారు మోదసం
భరితతఁ బొంది యక్కథకు బ్రాఁతిగ నర్చితుఁ జేసి రర్మిలిన్
హరహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁ జూడు మెప్పుడున్.

95. ఉ పావన దుర్దశాపహ శుభప్రదమూర్తి సుధానుభూతిసం
జీవితభక్తలోక తులసీదళదామ కపాలమాలికా
భావిభవాభిరామ పరిపక్వతపః ఫలరూప సాంఖ్యవి
ద్యావహయోగశక్తి విశదాద్భుతఖేలన లోకపాలనా.

96. క. దేవాది చతుర్విధ భూ
తావాసా సుకృతహృదయ హారివిలాసా
కేవల భావానందమ
యావేదవ్యాస వర్ణనారూఢ దయా.

97. మాలిని. అకృతక మధురోక్తి వ్యాప్త సందీప్తసారా
సకల భువనరక్షాశాలిశుంభద్విహారా
శుకజనక మనీషా శుద్ధబుద్ధానుభావా
సకృపకృత విలాసా సంభృతానందభావా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధన విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతమునందలి స్వర్గారోహణ పర్వంబు సర్వంబు నేకాశ్వాసము.

— :(o): —

శ్రీ మదాంధ్రమహాభారతము సర్వంబును సంపూర్ణము

శ్లో. యదక్షర పదభ్రష్టం
మాత్రాహీనం తు యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ
నారాయణ నమోఽస్తుతే.